# భూషణ కిరణావళి




సంకలనము & ప్రచురణ

శ్రీరామరాజభూషణ సాహిత్య పరిషత్తు

భీమవరము

# విషయ నివేదిక

# తొలిపలుకు

మాననీయులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారల సూచన ననుసరించి శ్రీరామరాజ భూషణ సాహిత్య పరిషత్తు వసుచరిత్రపై పండితుల సమీక్షా వ్యాసములు సంకలనము చేయ సంకల్పించినది. అందులకు ప్రథమ యత్నమీ 'భూషణ కిరణావళి' ప్రకాశనము. ఆచార్య దిగుమర్తి సీతారామస్వామిగారు తమ అమూల్యములైన సలహాలనేగాకుండా 'ఆప్తవాక్యము' వ్రాసి యిచ్చినందులకు పరిషత్తుపక్షాన వారికి హృదయపూర్వక ధన్యవాదములు. కోరినంతనే తమ వ్యాసములను సకాలములో పంపించిన శ్రీయుతుల్లు వెంపరాల్ల సూర్యనారాయణశాస్త్రి, వి. వి. యల్. నరసింహారావు, విశ్వనాథ సత్యనారాయణ, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, డాక్టరు దివాకర్ల వెంకటావధాని, యమ్. ఆర్. అప్పారావుగారలకు పరిషత్తు పక్షాన కృతజ్ఞతలు.

వ్యాసములను పరిశీలించిన వెంటనే 'భూషణ కిరణావళి' అచ్చొత్తించుటకు పదిహేను వందల రూపాయలు ద్రవ్య సహాయము చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారికి పరిషత్తు పక్షాన కృతజ్ఞతాభివందనములు. పుస్తకము అచ్చొత్తించుటకు సహాయపడిన దాతలు, సహృదయులు శ్రీ బొండా సత్యనారాయణమూర్తిగారికి పరిషత్తు పక్షాన కృతజ్ఞతాంజలి.

పరిషత్తు 'భూషణ కిరణావళి' రెండువేల కాపీలు అచ్చొత్తింప సంకల్పించినది. ధనలోపమువల్ల ఒక వేయి కాపీలు మాత్రమే అచ్చొత్తించగల్గితిమి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారుకూడ వ్యాసములను తిలకించిన మీదట రెండు వేల రూపాయలు యిచ్చుటకు వాగ్దానము గావించిరి. ఆ వాగ్దానము కార్యరూపము పొందగనే మిగిలిన కాపీలు అచ్చొత్తించగలవారము.

"భూషణ కిరణావళి" గ్రంథరూపము నొందుటకు బహుధా దోహదమొసంగిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు, సహాయకార్యదర్శి డాక్టరు బి. రామరాజు గార్లకు పరిషత్తు పక్షాన కృతజ్ఞతలు.

ఎంత ప్రయత్నపడినను అచ్చుతప్పులు అపరిహార్యము లయినవి. క్షమాశీలముతో పఠితలు సవరించుకొన ప్రార్థితులు. నిర్ణయించిన గడువులోపల 'భూషణ కిరణావళి' అచ్చొత్తించి యిచ్చిన మహాంధ్ర ప్రెస్ వారికి పరిషత్తు పక్షాన ధన్యవాదములు.

భీమవరం<br>
19 మార్చి 1969

చుక్కవ గంగరాజు,<br>
కార్యదర్శి.

# ఆప్తవాక్యము

భూషణ కిరణావళి యను నీ గ్రంథము రామరాజ భూషణుని వసుచరిత్రపై ప్రౌఢులైన విద్వాంసులచే ననుగ్రహింపబడిన వ్యాసముల సంకలనము. ఇది రామరాజ భూషణ సాహిత్య పరిషత్తువారి వక్ష్యత్రయము కృషిఫలము. ఈ పరిషత్తు 1965 ఫిబ్రవరిలో ప్రారంభింపబడినది. సుగృహీత నామధేయులు నూజివీడు ప్రభువులు శ్రీ M. R. అప్పారావుగారు దీని నాశీర్వదించిరి,

భీమవరమున చిరకాలముగ సాహిత్యాభిరుచిని వ్యాపింపజేయుటకై ఎందరో మహనీయులు సమాజములు నెలకొల్పి కృషి చేసిరి. అట్టి సమాజములలో రవీంద్ర సారస్వత సమాజము, సుహృత్ పరిషత్తు, వసంత భారతి, సాహితీ సంసత్తు వంటివి గణింపదగినవి. నేడు రామరాజ భూషణ సాహిత్య పరిషత్తు వీనిలో నిత్యచైతన్య సుందరముగా నున్నది. ఇది వ్యవహార దక్షులైన సభ్యులచే నిర్వహింపబడుచున్నది. ప్రస్తుతము శ్రీ భూపతిరాజు రామకృష్ణంరాజుగారు దీనికి అధ్యక్షులు. వీరు శక్తిత్రయ సంపన్నులు. కార్యదర్శియైన శ్రీ చుక్కా గంగరాజుగారి నిరంతర సేవాదక్షత ఆశ్చర్యజనకము.

ఈ పరిషత్తువారికి రామరాజ భూషణుడు అభిమానకవి. అతని గ్రంథముల వసుచరిత్ర కావ్యతల్లజము. వసుచరిత్ర కర్తగా ఆ మహాకవి భూషణుని కిరణావళిని వ్యాపింపజేసి రసికలోకమును దేదీప్యమాన మానసిక స్థితి నానందింపజేయుటయే ఈ సంకలన గ్రంథ ప్రకాశనోద్దేశము.

వసుచరిత్ర వెలువడిన నాటినుండియు ఆంధ్ర ప్రబంధ సాహిత్య ప్రపంచమున నద్వితీయమగు నగ్రస్థానమున విరాజిల్లు చున్నది.

ప్రౌఢాంధ్ర సారస్వత యాత్రికులకు నాలుగు వందల యేండ్లుగా అక్షర తీర్థమైన మహారచన వసుచరిత్ర. ఇంత దీర్ఘకాలము ఒక వాఙ్మయమును పరిపాలించిన కావ్యరత్నము- ఏ సారస్వతమునందైన ప్రశంసాపాత్రమనుట స్వభావోక్తి. ఎందరో చెప్పిరి. ఎంతయో చెప్పిరి. మేరువు నందావగింజంత యనిపించును.

వసుచరిత్ర సాహిత్య సంగీతములు సంగమించిన వారణాశి. ఆ విషయములపై ఇందు తలస్పర్శముగ కూర్పబడిన రచనలు పొందుపరుపబడినవి. వసుచరిత్రకారుని తాత్త్విక దృష్టిని- తెనుగుదనమును గూర్చి క్రొత్తకోణములలో కొంత పరిశోధన సాగినది- ఇదియ నిదంపూర్వము. వసుచరిత్ర యందలి నాటకీయత చిరకాలముగ రసజ్ఞ ప్రస్తావనల నుదీరితమైనదే. చివరిది ఒక సహృదయ శేఖరుని ప్రసంసావేశము. ఎంతయో చేయవలయునని సంకల్పించి ఇంతయైన చేయగలిగినందులకు సంతోషింపవలసిన పరిస్థితికి వచ్చితిమి.

వసుచరిత్ర నిజమునకు రసానందమునుగూర్చు కావ్యముగాగాక రసోచిత చమత్కృతికు ప్రాధాన్యమిచ్చిన రచనగా ప్రచారమునకు వచ్చినది. సంస్కృతమున నైషధీయ చరితమువలె నిది ఆంధ్రమున విద్వదౌషధమైనది. ఒకపట్టుగాకూర్చొని వసుచరిత్రనామూలచూడము. పఠించుట ప్రయత్నసాధ్యము. అవచాటముగ గ్రంథైకదేశమునకొన్ని పద్యములు చదివి- అందలి చమత్కారముల కలరి అలసిపోవుట సాధారణము.

సాహిత్యరసపోషణ బిరుదమును ఈతడు గద్యలో చెప్పకొనెను.- ఈ బిరుదము నాచన సోమన చెప్పికొన్నదే. బిరుదము విషయముననే కాక వసుచరిత్ర కర్త భావములలో కల్పనలలో పదముల కుప్పలో పూర్వులనుండి ఎంతయో గ్రహించి స్వీయము చేసికొనెను. ఈదృష్టితో వసుచరిత్రపై ఎంతయో పరిశోధన జరుగవలసియున్నది. బ్రహ్మశ్రీ

వఝ్జల చినసీతారామస్వామిశాస్త్రిగారు ఈయుగ ప్రారంభమున ఈ విషయమున చాల పరిశ్రమ చేసిరి. వారు ఆంధ్రనైషధము, శృంగార శాకుంతలము, స్వారోచిష మనుసంభవము అను నాంధ్ర కావ్యముల ప్రభావము వసుచరిత్రపై నెంత కలదో సవిమర్శనముగ ప్రసంగించిరి. దానితో గ్రంథమునందు అర్థాదికము అనుసృతి యని తేలిపోయినది. మిగిలిన గ్రంథమును అట్టిదే. వసుచరిత్ర చదువరి పఠన గాంభీర్యమునకు పరీక్ష. వసుచరిత్రకారుని ప్రతికల్పనకు సంస్కృతాంధ్ర కావ్యములనుండి మూలములు చూపవచ్చును. ఇది రామరాజ భూషణుని అసాధారణ సారస్వత పరిశ్రమను తెల్పును. ఈ మూలములను బహిరపరచు కృషియే జరుగవలసియున్నది. ఎందరో మహావిద్వాంసులు ఈ ధోరణితో పనిచేసినగాని ఫలితము దక్కదు. ఒక్క ఉదాహృతి—వసుచరిత్రను కేవల పండిత కావ్యముగజూచు విమర్శకులు సహితము మెచ్చుకొను పద్యము—

> మోహోపదేశతమో ముద్రితములైన
>
> కనుదమ్ముల హిమాంబులునుపరాదు ... ...

అను పద్యము. దీని గీతి—

> లలన కాసంగ కీలికీలా కలాప
>
> సంతతాలీఢ హృదయ పాత్రాంతరాళ
>
> పూరిత స్నేహపూరంబు పొంగిపొరల
>
> జల్లని పటీర సల్లంబు జల్లరాదు.

దీనిమూలము ఆచార్యదండి దశకుమార చరిత్రమున నున్నది. "తదపి శీతలోపచరణం సలిలమివ తప్తతైలే తదంగ్గే దహన మేవ సమన్తాదావిశ్చకార" కొంచెమందిచ్చిన మిగిలిన దల్లుకొనిపోవుట ప్రతిభాలక్షణముగదా! ఇట్లే దీని తరువాతనున్న మఱియొక శైత్యోపచార సీసము "జవరాలి యడుగుల చివురాకు లంటించి ..." ఇత్యాది.

కాదంబరిలోని ఒక సందర్భమునకు అనుకృతి. తదవయవరూప శోభా వినిర్జితాని కమల కిసలయాని పాణి పాదేన ... ఇత్యాది. హాస్యని యందు వలెనే బాణునియందును ఎంతో గౌరవముగల రామరాజ భూషణుడు తన సంస్కృతి కవి స్తుతిలో వసుచరిత్రమున వీరిరువురను చెప్పకుండుట గమనింపదగినది. "భువి కవితాకన్య పుట్టించె నెవ్వాడు ... అను పద్యమున బాణహాస్యులకు అర్థద్వయముతో నభేదాధ్యవసాయము చేసి చెప్పుట కుదిరియుండదు. నరసభూపాలీయమున బాణవేగమును స్మరించినను ఆ సందర్భము వేరు. ఇట్లే ఆంధ్రకవి స్తుతిలో "మహిమున్ వాగను శాసనుండు సృజియింపన్ ... పద్యములో ఈతను ఎఱ్ఱనను త్యజించుట అతి వేలమైన శ్లేషవ్యామోహముగాక మరేమన గలదు. ఇంతకు చెప్పవచ్చిన దేమనగా వసుచరిత్ర నానందించుటనగా కూలంకష పరివాహ సుభగమైన పూర్వసంస్కృతాంధ్ర సారస్వతముల నోలలాడుటయే. ఇది పూర్వాంధ్ర ప్రబంధ సాధారణమైనను వసుచరిత్ర యందు ప్రధానము.

గ్రంథమునంతను ఒకేసారి యాలోకించు నుత్సాహము వసుచరిత్రకారు డీయలేకపోయినను ఏకదేశములలో అద్వితీయుడనిపించుకొనును. విరాటపర్వములోని "వలలుండెక్కడ చూచె నొండెడ నసావ్య ప్రాగ్మాజములో పుట్టనే..." అన్న పద్యము తలపునకు వచ్చినప్పుడెల్ల రామరాజభూషణుడైనచో ఈ పద్యము ఎంతయో సందర్భశుద్ధిగా ప్రాగ్మాజమునకు ప్రాగ్మాజానికి శ్లేషతో సరిపెట్టి వ్రాసి యుండునని యనుకొనుట సహృదయ పథికక్షుణ్ణమైన భావనామార్గము. అసలు ఇట్టి యాలంకారిక రచన అక్కడక్కడ నొక్కొక్క పువ్వుగా వికసించుచు వసుచరిత్రనాటికి సంపూర్ణ వసంతమైనట్లు తోచును. వసుచరిత్రనాటి నుండియు పద్యరచనా చమత్కారమునకే కావ్యకర్తలు ప్రాధాన్యమిచ్చి జీర్ణవాఙ్మయమునకు దారివేసిరి. కావ్య సమష్టిపై దృష్టి యుంచి

ఏపద్యమున కెంత బరువువలయునో చూచి రచన చేయువాడే మహాకవి. ఇట్టి కావ్యమంతయు చదివి రసస్ఫూర్తి పొందువాడు సహృదయుడు. ఏకదేశమున నానందింపబడునది అందలి చమత్కారము మాత్రము. భావనాశ్రమ మక్కరలేకయే గతానుగతిక ధోరణుల కలవాటుపడి హస్తచాలన మస్తక కంపనములతో తృప్తిపడు శాబ్దికులకు వసుచరిత్ర అభిమాన కావ్యరాజము. రాయల యుగములో మనుచరిత్రము—కొంతవరకు పారిజాతాపహరణము మాత్రమే – ఈ శాబ్దిక వాతావరణ దోషమునకు విధేయముకాని నిరంకుశ రచనలు. ఆనాటి కావ్యముల రమాభ్యుదయము, వసుచరిత్ర పఠితల శబ్దశాస్త్ర స్థితిని శిలిత నిఘంటుతను పరీక్షించు ప్రాశ్నికస్థానము నలంకరించినవి. నేటికిని అవి చదువరికి పాండిత్య నికషోపలములు. ఇందు రామాభ్యుదయము కథావైశాల్యము చేతను పద్యబాహుళ్యము చేతను వెనుకబడి వసుచరిత్రకు ప్రాథమ్యము కల్పించినవి. రామభద్రునకు రామరాజ భూషణునకు పాండిత్యస్పర్థలను పగటు కథలు వీరి యీయాలంకారిక స్పర్థను బలపరచును.

వసుచరిత్ర తరువాత వెలసిన ప్రబంధములలో చాలవరకు దాని ఛాయలు గోచరించుటయే దాని గొప్పతనమును చాటును. ఈ యనుకరణ ధోరణిలో నిర్జీవ దారుపుత్రికలు (కొయ్యబొమ్మలు) తయారైనవి. కథలేదు. హృదయస్పర్శి రసార్ద్ర రచనయే కరవైనది. కొన్ని వర్ణనలొక శుష్క కథా సూత్రము నలగించి ప్రబంధమనుట పరిపాటియైనది. రేకుల ప్రోక పూవు గాదుకదా! వీనిలో కొన్ని పిల్ల వసుచరిత్రలైనవిగాని తల్లి తారుణ్యకళ వనికిరాలేదు. ఒక్కొక్క ప్రక్రియకు ఒక్కొక్కడు నేత. అతనియందే యదిరాణించును. అల్ప ప్రజ్ఞావంతుడు దాని ననుకరించుట శివునిజూచి పిశాచీభూత భేతాళములు తాండవమాడుట వంటిది. వసుచరిత్రకారుని రగడతో కొయ్య

బొమ్మలు మెచ్చుకళ్లకు కోమలుల సొరెక్కునా అనుప్రశ్న ముత్యాల సరమైనది. ఇట్లా రగడ నవ్యసాహిత్యమునకు నాందియైనది.

నేడు వసుచరిత్రకారునివలె పద్యము వ్రాయగల కవులు మెచ్చగల సహృదయులు మృగ్యమైరి. మిగిలినది ఆగ్రంథమును భద్ర పరచుకొని కొంతయైన చదివి ఆనందించుట. ఆంధ్రప్రబంధ సాహిత్యమున రామరాజభూషణుని వసుచరిత్రమునందే ప్రత్యేక పద్యశిల్పము పరమావధి నందుకొన్నది. బహుధా పాపఠ్యమానమైనను ప్రాఁబడని నిత్య ప్రత్యగ్రమైన రీతియది. నవ్యవిద్యార్థులకు వసుచరిత్రపై పరన గౌరవమును కలిగించుటకు ఈసంకలన గ్రంథము తోడ్పడును. భూషణ కిరణావళి ఈ గమ్యప్రాప్తికి సారస్వతుల నెలయించి కృతార్థమగుత!

ఇట్లు,

| సౌమ్య : వసంతము<br>భీమవరము<br>19—3—1969 | దిగుమర్తి సీతారామస్వామి,<br>ప్రాచ్యభాషా పీఠాధిపతి,<br>దంతులూరి నారాయణరాజు కళాశాల. |
|---|---|

# భూషణ కిరణావళి

## రామరాజ భూషణుని సాహితీ శక్తులు

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

రాయలయుగ మని పేరెక్కిన పదియాఱవ శతాబ్దమున నవతరించి, యష్టదిగ్గజము లని ప్రసిద్ధిగాంచిన మహాకవులలో నొకఁడై ప్రతిభా వ్యుత్పత్తి సంపన్నుఁ డని కీర్తితుఁడైన "మూర్తికవి" యను నామాంతరముగల రామరాజభూషణుని సాహితీశక్తులను వ్యక్తీకరింపఁ బూనుట యెవ్వరికైనను సాహసమే యన నస్మదాదుల మాట వేఱ చెప్పనక్కఱ లేదు. ఆతని కృతులు మూఁడు గనఁబడుచున్నవి. 1 నరస భూపాలీయము 2 వసుచరిత్ర 3 హరిశ్చంద్ర నలోపాఖ్యానము. ఈ మూఁటిలోను నాతని సాహితీశక్తులు మూఁడు విధములఁ బ్రదర్శింపఁ బడినవి. నరసభూపాలీయమునకు ప్రధాననామము "కావ్యాలంకార సంగ్రహము" అది ఆపేరే యది యలంకారశాస్త్రగ్రంథ మని చెప్పు చునే యున్నది. "చిరేణ చరితార్థో భూ త్కావ్యాలంకార సంగ్రహః" అను ప్రతాపరుద్రీయమునకు నాంధ్రీకరణము కాదు. కాని తచ్ఛాయనే నడచిన యనువాదము కాన నందుఁ బాండిత్యప్రకర్షము కనఁబడునే కాని ప్రతిభకుఁ బ్రాముఖ్యము లే దనఁదగును. మూఁడవ దగు హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థికావ్యము. అందుభయభాషా వశ్యతయు, కథాద్వయ సంఘటన నైపుణియు మాత్రమే కనఁబడును. ఆ రెండు కృతులందలి ప్రతిభావ్యుత్పత్తులను గూర్చి పిదపఁ బరిశీలింతము. సాహిత్యరస పోషణుఁ డను బిరుదము నాతఁ డాశ్వాసాంతగద్యములలో వ్రాసికొనఁ జేసినది వసుచరిత్ర సాహిత్యమే యని పెద్దలు పలుకు

చున్నారు. అందలి యితివృత్తము భారతములోనిది. అవారితకల్పనా విభూషావహముగాఁ నా చిన్నకథను బహుముఖములుగాఁ బెంచి, పాత్రప్రవేశ నిర్గమములందును సచేతనములగు నదీపర్వతములకుఁ జేతనసత్త్వ సంఘటనమునందును తదితర పాత్రి పరివేశాదులందును నాటకీయత స్ఫురింప ననితరసాధ్యమగు శ్లేషమహిమచేఁ గావ్యలక్షణములకు దూరము గాకుండ రచింపఁబడిన వసుచరిత్రము నవలంబముగా జేసికొని యాతని సాహితీశక్తులను దెలిసికొన యత్నింతము.

సాహిత్యమన:– కావ్యమీమాంసయందు 'శబ్దార్థయోర్యథావత్సహభావేన విద్యా సాహిత్యవిద్యా' శబ్దార్థములనన్యూనాతిరిక్తములుగా సహభావముతోఁ బరివర్తిల్లఁజేయువిద్య సాహిత్యవిద్య' అని రాజశేఖర పండితుఁడనెను. దాని వ్యాఖ్యయందు "యథావత్సహభావేన సహృదయ హృదయాహ్లాదకారి పరస్పర సుభగసామ్యేన స్థితయోశ్శబ్దార్థయోః విద్యా సాహిత్యవిద్యా" (సహృదయుల హృదయముల కాహ్లాదకారియై సొగసైనట్టి యొండొంటి సమత్వముతో నుండెడు శబ్దార్థములయొక్క విద్య సాహిత్యవిద్య) అనియు అదియే అలంకారాది ప్రతిపాదక శాస్త్ర మనియు" గలదు. "సాహిత్యం తుల్యకక్షత్వేన అన్యూనాతిరిక్తత్వం శబ్దార్థములు సమబలముగలవై హెచ్చుతగ్గులు లేకుండుట సాహిత్యము) అని యొక రనిరి. "సహితం రససంయుక్తం సాహిత్యం రసయుక్తమైనది సాహిత్యము) అని యింకొకరనిరి. మఱొకరు "హితేన నిరతిశయ ప్రేమాస్పదేన రసేన సహితం తదేవ సాహిత్యం" (నిరతిశయ ప్రేమస్థానమైన రసముతోఁ గూడి యుండునది సాహిత్యము) అనిరి.

మఱియొకరు—

> అంధీభూయ గుణాంగణేషు తరవో వాతాసఘాతా ఇవ
> శ్లాఘంతే యది సాహితీం రసవతీ మజ్ఞాస్తతః కిం సుఖమ్?

యాసన్ వ్యంగ్యచమత్కృతిః పదగతిః రర్థౌచితీ శ్లాఘ్యతా
యంతః శర్మ య దశ్నుతే రసయుతా సా జీవనాడీ కలేః

అని కవిత్వమునుగూర్చి ప్రసంగించుచు రసవతి యగు సాహితి యన వ్యంగ్యము, చమత్కారము, పదయోజన, యర్థాదుల యౌచిత్యము గలది యను నర్థము స్ఫురింప నవిరి. వీని నన్నిటిని బర్యాలోచింప:- సహృదయ హృదయామోదకముగా రీతి, గుణాలంకార, వృత్తి యుతములై తమలోఁ దాము పొందిక పొసఁగునట్టి రస సంయుక్తములైన శబ్దములు నర్థములును గలిసి 'సాహిత్యము' అగు నని తెలియుచున్నది. రసవత్కవిత్వ మన్నమాట.

సాహిత్య మన నేదియో యొక విధముగాఁ దెలిసిన దనుకొందము. ఇఁక రస మన నేమియో యరయుదము. ఏ పద్యమున కా పద్యమే, యేపదమున కాపదమే రసోత్పాదక మనరాదు. విభావానుభావ వ్యభిచారిభావ సంయోగమువలన రసము నిష్పన్న మగును. అని యాదిని భరతమహాముని చెప్పెను. దాని ననుసరించి యింత సాధనసామగ్రి యున్నఁ గాని రసము సిద్ధింప దన్నమాట. అట్టి సాహితీరసమును రామరాజభూషణుఁడు వసుచరిత్రమున నెట్లుపోషించెనో యరయుటకు ముందు చతుర్విధ కవితానిర్వాహకుఁ డను బిరుదమునకు నీ సాహిత్యరసపోషణ బిరుదమునకునుగల భేద మరయ వలసియున్నది.

పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకషుఁడనని తొలుతఁ జెప్పకొనిన బిరుదమును బట్టి సంస్కృతభాషయు, ఆంధ్ర భాషయు నాతనికి సరహస్యముగా వశమై యున్న వని తెలియుచున్నది. ఆతని కావ్యముల నరయ భాషాద్వయపాండిత్యమే కాదు. సకలశాస్త్రములను, సకల

కాలను- నందును ప్రధానముగా సంగీతవిద్యను వశ మొనర్చుకొ న్న వాఁడని తోఁపక మానదు. ఇంతసామగ్రి నార్జించుకొని చతుర్విధ కవిత్వముల నిర్వహించినాఁ డట. చతుర్విధకవిత్వము లనగా:- ఆశు, బంధ, చిత్ర, గర్భ- కవిత్వము లని కొంద ఱనిరి. ఈనాలుగును దాత్కాలికముగా మహారాజులను, సహృదయులగు ప్రాజ్ఞులను మెప్పించు నవియై యుండుటచే- సాహిత్య మన వీనికంటె భిన్నమైన ప్రబంధకవిత్వమై యుండును. అట్టి ప్రబంధకవిత్వమును రసమును బూర్ణముగాఁ బోషింపఁగలవాఁడు రామరాజభూషణుఁ డని తేలినది. కొందఱు చతుర్విధ కవిత్వము లన:- ఆశు, మధుర, చిత్ర, విస్తర, కవిత్వము లనియు, విస్తర కవిత్వ మనఁ బ్రబంధకవిత్వ మనియు నన్నారు. పింగళిసూరన కళాపూర్ణోదయమునందు "ఆశు మధుర చిత్ర విస్తార కవితావిజృంభణ స్తంభిత బాణ, భవభూతి, కాళిదాస ముఖ్య విఖ్యాతిగౌరవు లగు కవులును అని చెప్పెను. విస్తరమో, విస్తారమో యేదియో యొకటిగా నానాభ్రీటిలోఁ జెప్పినమాత్రమున నది ప్రబంధ కవిత్వమే యనుట యెట్లు? ఆశు మధుర కవిత్వముల వలెనే యీవిస్తరకవిత గూడఁ దాత్కాలికముగా రసికుల నానందపఱుపఁ జెప్పు నొకవిధ మగుకవిత్వమేల కారాదు? ఈకవి నరసభూపాలీయమునఁ దన్నుఁ గూర్చి చెప్పుకొనుచు-

సీ॥ శతలేఖనీ పద్య సంధాన ధౌరేయు, ఘటికా శతగ్రంథ కలనధుర్యు
నాశు ప్రబంధ జంధాభిజ్ఞు నోష్ఠ్య నిరోష్ఠ్యజ్ఞు సకలజహోర్వసిద్ధుఁను
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య సాధిత వ్యస్తాక్షరీ ధురీణు
నేకసంధోదిత శ్లోక భాషా కృత్య, చతురు నోష్ఠ్య నిరోష్ఠ్యసంకరజ్ఞు
నమిత యమకాశునిధిఁ బ్రబంధాంక సింగ రాజసుత తిమ్మరాజ
పుత్ర ప్రసిద్ధ
సరస వేంకటరాయభూషణ సుపుత్రుఁసను బుధవిధేయు శుభ
మూర్తి నామధేయు"

అని చతుర్విధములే కాక బహువిధముల కవిత చెప్పనేర్చిరి నేను. బాల్యమున మీఁదఁ జెప్పిన యన్నివిధముల కవిత్వము చెప్పనేర్చియు ఏకైక దినప్రబంధ, ఘటికా సద్యశ్శతగ్రంథ కల్పనుఁ జేయ్యును పరువాత స్థిరముగా నుండెను. ప్రబంధకవిత్వమునకుఁ బూనుకొని ప్రభువుల వినోదార్థము చతుర్విధకవిత్వములను మాత్రి మాశువుగాఁ జెప్పుచుండువాఁ డని భావింపవచ్చును. మీఁదిపద్యమందలి ఆశు ప్రబంధ బంధాభిజ్ఞత యన— నేకైక దిన ప్రబంధ కల్పనమే యగును. అట్టివి ప్రబంధము లనఁబడినను రసవంతములై యుండు నను బ సందిగ్ధము. వసుచరిత్రమువలె సర్వాంగ సుందరములుగా నవి యుండునా? ఉన్నచో నీకవిశ్రుత మగు నాసుప్రబంధ మేదియుఁ గానరాదుగదా. ఆశువుగాఁ జెప్పువానికి స్థిరత్వ మసంభవము. మీఁదిసీసమునఁ జేర్కొన్న అచలజిహ్వాకృతి, వ్యస్తాక్షరి మొదలగు వానివలె నల్పాల్పములు గాక శతలేఖినీపద్య సంధాన ఘటికాశతగ్రంథకలనాదులు కొన్ని విస్తృతి గలవై యుండునుగాన నట్టివానికే విస్మరమనియో విస్తార మనియో, వ్యవహార ముండిన నుండవచ్చును. రామభూషణుని వసుచరిత్ర రచనాకాలమున కట్టి తత్కాలచమత్కార జనకములగు చిత్రకవిత్వరచనలం దాస్థ తగ్గిప్రబంధ రచనాసక్తి యధికమైన దన వచ్చును. (రామరాయులను) బహు సంస్కృతాంధ్ర కృతులన్ బల్కాలు మెప్పించి తత్కారుణ్యంబున రత్నహార హయ వేదం డాగ్రహారాది సత్కారం బందినవాఁడుగదా రామభూషణుఁడు? ఆ రామరాయులపేరఁ గాని యాతని సభలో నింకొకరిపేరఁ గాని చెప్పిన యిప్పటి యొక్క సంస్కృతకృతి కాదన్న నొక్కయాంధ్రకృతి యేదేని రామభూషణకృతము అని లభించుచున్నదా? ఆ మహారాజు సరసుఁడు గాన నట్టిచిత్రకవితలకే మెచ్చి రత్నహారములను హయములను, వేదండములనే కాదు,

అగ్రహారములను గూడ నిచ్చి యుండవచ్చును. కావునఁ జతుర్విధ
కవితా నిర్వాహకత్వముకంటె సాహితీరసపోషణము వే అని
తెల్లమగుచున్నది.

సరే! సాహిత్య మనఁ బ్రబంధకవిత్వ మని తేలినది. మఱి
ఆ సాహిత్యమందు రసమెట్లు పోషింపఁబడెనో తెలియవలసి యున్నది.
భరతునిసూత్రము ననుసరించి వసుచరిత్రమునందు గిరికావసువు
లాలంబనవిభావములు ఉద్యాన, శుకపిక, మలయానిల, చంద్రికాదు
లుద్దీపన విభావములు. గిరికావసువులయందు యౌవనోదయమువలన
సంకురితమైన "రతి" యనఁబడు స్థాయిభావము పరస్పర గుణశ్రవణ
మువలనను, దర్శనము వలనను బొడమిన సాత్త్విక భావముల చేతను,
శృంగార చేష్టల చేతను బల్లవితమై, పరస్పరానురాగములు తెలియు
టచేతఁ గోరకితమై మంజువాణీమాహాత్మ్యమునఁ బుష్పితమై, వివాహానం
తర ముభయుల సమావేశమున ఫలితమై, శృంగారరసముగాఁ
బూర్ణస్వరూప మొంది సహృదయ హృదయాస్వాద్యమైనది. సరస
భూపాలీయమునందు శృంగారమే కాదు. మఱే యేరసమైనను వసుచరి
త్రమునందువలె విభావానుభావాదుల సంయోగమువలన పరిపూర్ణ
మగునట్టి యవకాశము లేదు గదా అది శాస్త్రకావ్యము. ప్రదర్శిం
పఁబడిన లక్ష్యములను జూచినను నవి ముక్తకము లగు పద్యములు
అట్లుగాక సరసభూపాలీయమునఁ దాను జెప్పిన సాహిత్యలక్షణముల
కనుగుణముగా వసుచరిత్రమున విభావానుభావ సాత్త్విక వ్యభిచారి
భావ సంయోగమును ఘటించి, తద్ద్వారమున రసముయొక్క పరి
పూర్ణస్వరూపమును రామరాజభూషణుఁడు నిరూపించినాఁడు
సాహిత్యరసపోషణుఁ డయినాఁడు.

రసాస్వాదమున కర్హులు సహృదయు లనినారు. సహృదయు

లన నెవ్వరో తెలియవలెనుగదా. బహువిధములగు కావ్యములను బరిశీలించుటచే మన స్సనెడి యద్దము నిర్మలము కాఁగా- కవి గానో, నాయకుఁడుగానో తాను మారిపోయి వారి హృదయము తో సమ మగు హృదయము గలవాఁడు సహృదయుఁ డట. "యేషాం కావ్యానుశీలనవశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయ యోగ్యతా స్యాత్; తే హృదయసంవాద భాజఃసహృదయాః" అని పెద్దలసూక్తి. అట్టి సహృదయులకుఁ గాని సాధ్యము కానట్టి రామభూషణ సాహిత్యశక్తులను బరిశీలింప నెంచుట సాహసము అయినను యథామతి యత్నించుట యపచారము కాదనుకొందును.

పరిసారరుద్రీయమునకు నించుమించుగా ననువాద మనఁదగిన తన నరసభూపాలీయమున 'తను వగు శబ్దార్థంబులు ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్ తనరుగుణంబులు గుణములు ఘనవృత్తులు వృత్తి తార కావ్యేందిరకున్' అని కావ్యమునకు శబ్దార్థములు శరీరము. ధ్వని జీవము. అలంకారము లలంకారములు. గుణములే గుణములు వృత్తులే వృత్తులు. అని మూలానుసారము చెప్పెను. అలంకారాదులతో పాటు ధ్వనికూడ నిందుసామాన్యముగాఁ జెప్పబడినను వస్తు గుణాలంకారాదిధ్వను లన్నిటికంటె నుత్తమ మైన రసధ్వని యనియే గ్రహింపవలెను. అదియే కావ్యమునకు జీవితము (ప్రాణము). రస మెన్నఁడును వాచ్యము కారాదు. వ్యంగ్యమే కావలెనను నియమ ముండుటచేత నీపద్యమునఁగూడ రసమును బేర్కొనక చమత్కరించె ననిపించుచున్నది.

కావ్య శరీరములగు శబ్దార్థములకు శోభ నిచ్చునవి యలంకారములేకదా! అట్టి శబ్దాలంకారార్థాలంకారములను బ్రతికవియు ఘటించుచునే యున్నాఁడు. కాని రెండిటిని సమముగా నాదరించినవారు చాల తక్కువ యనవచ్చును. రామరాజభూషణుఁ

జేట్లు గాక, పూర్వ్యు లగుకవులు రేఖామాత్రముగా సృష్టించుచు వచ్చిన యనుప్రాస యమకాది శబ్దాలంకారములను నుపమో త్ప్రేక్షాదులతోపాటు శ్లేషాలంకారమును సనుముగా నంతటను సాఘటించి శ్లేషయమకచక్రవర్తి యనిపించుకొనిన వేంకటాధ్వరిని దలపంచెదను ఆతని లోకోత్తర శబ్దశిల్ప చమత్కృతియు యర్వా చీనులకు మేలుబంతి యైనది కూడను. వసుచరిత్రమున నవతారికలో

సీ॥ ఏరాజు భూరితేజోరుణాలోకంబు లోకంబు తమము నిరాకరించు
నేఘన్యు బాహా ధరాధరాభోగంబు భోగంబుసవరించు భూమిసతికి
నేపుణ్యు నభిరూప రూపానుభావంబు భావంబు కరఁగించు భామినులకు
నేధన్యు శుభకీర్తి శోభాపిహారంబు హారంబు దిశాదిశాయోవతమున
కతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ డనుపమస్వాంతుఁ డాశ్రితవన వసంతుఁ డనఘతర కందనోలు మహాపురీనిశాంతుఁడగు
రామమేదినీకాంతుఁ డలరు.

అనుసీసపద్యము నాలుగుపాదములందును ఛేకానుప్రాసమును, గీతమున వృత్త్యనుప్రాసమును మాత్రమే కాకసీసపాదములందుఁ బ్రత్యేకము యమకాలంకారములును సంసృష్టియును గలిగి రామ భూషణుని శబ్దార్థాలంకారముల విశిష్టతను వ్యక్త మొనర్చుచున్నది.

ఈక్రింది కందపద్యమున శబ్దము, నర్థము, నలంకారము, రీతి యివ్యేలే కాక సంగీతకళా రహస్యమర్మితయు నెంత మనోజ్ఞముగా నిముడ్పఁబడినవో యరయఁదగును.

క॥ ఉద్ధతరిపు నిర్ధతపనఁపద్ధతి, కరిభవన దవనిపటి దంబుధి సం
పద్ధరణ సముద్ధరణ సఁముద్ధ రణ రజోవ్రజోద్య దిభమదస్మృతికిన్."

ఇందు తిరుమలరాయని ప్రతాపము వర్ణ్యమగుటచే గాఢి యను రీతియు, ఓజస్సు అను గుణమును గృహీతము లైనవి. ఈ రెండును శబ్దగతములు. ఇఁక నర్థము నరయుఁ- గర్వితులగు తిరుమలరాయని శత్రువులచేత సూర్యమండలము భేదింపఁబడిన దఁట. అనఁగా- ఆరాజుచే యుద్ధమునఁ జంపఁబడిన వైరులు సూర్యమండలమును భేదించుకొని వీరస్వర్గమున కేఁగుచున్నా రని భావము. "ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ, పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖే హతః" అనికదా శాస్త్రము. తీవ్రముగా యుద్ధము జరుగుచుండ చతురంగబలముల పాదఘట్టనచే రేఁగినధూళి భీతులగు శత్రువులు దాఁగికొనుటకు గృహమువలె నగుచు, భూమికి బట్టవలె నుండు సముద్రమునఁ బడి యందలినీటి నంతను నింకింపఁజేయుఁగా- భూమికి మానభంగము కాకుండ సేనలలోని యేనుఁగులమదజలములు ప్రవహించి సముద్రమును యథాపూర్వముగా జలమయముగాఁ జేయుచున్నవట. ఇంతటిగంభీర మగు నర్థమును అతిశయోక్తి-కహాలంకారములు అను నర్థాలంకారములును అసకృద్వర్ణావృత్తి వలన ననుప్రాసము లనఁబడు శబ్దాలంకారములును, మాత్రమే కాదు. ఉద్ధతిరిపు- విధ్ధతపన- పద్ధతికరి. అనియు, సంపద్ధరణ- సముద్ధరణ- సమిద్ధరణ అనియు. రెండు తావులందు 'తకిటతక- తకిటతక- తకిటతక- అని తాళానుగుణ మగు ముక్తాయింపులును ఘటింపఁబడినవి. ఈ కాసంత పద్యమున నీ వైచిత్రియే కాక వ్యాకరణశాస్త్ర రహస్య మొకటి యిముడ్చఁబడినది. భవన, పట అను ప్రాతిపదికములపై 'సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః" అను వార్తికముచే క్విప్ప్రత్యయము వచ్చి నామధాతువులు కాఁగాఁ క్విప్పు సర్వలోపి గావున) భవన, పట అనువానిపై "లట శ్శతృ శానచా వప్రథమా సామానాధికరణ్యే" అను పాణినిసూత్రముచే శతృప్రత్యయము చేరి 'భవనత్, పటత్

అనురూపములు సిద్ధించినవి. ఇట్టి వ్యాకరణ విశేషములతో, అర్థ
గాంభీర్యముతో, శబ్దార్థాలంకారములతో, ఓజో గుణముతో,
గౌడీరీతితో, నారికేళపాకమున, ఆరభటీవృత్తితో, భూదేవికి మాన
భంగము కాకుండ నేనుంగుచే వస్త్రము నిచ్చె ననువ్యంగ్యముతో-
సీసంపపద్యమును రచించిన రామభూషణుని యమకకవిత్వవిషయమును
మాత్రము "ప్రాయశో యమకం యత్రరసపుష్టిర్న విద్యతే"
అనునుక్తికిఁ బాత్రులే యని గ్రహించి, యాతని ప్రతిశబ్దమై చిత్రియం
దంతర్వ్యాహీనిగా సర్థచమత్కృతికూడ నుండు నని మాత్రము విజ్ఞులు
మఱువకుందురుగాక! పైపద్యమందలి ముక్తాయింపులవంటివి గ్రంథము
నంతటను గాన నగును. "నిజామాముల్ వజీరుల్ భజింతురు."
"అంద్రైన నింద్రైన వింద్రైన నా(దంబు)" "ధారాధర ధారాజల
ధారాహత" "(వయః కోలాహల కోలాహల కేలాహల (హాళిక)"
అని మచ్చునకుఁ జూపితిని. మఱి ఆర్ధికముగా అరిగాఁ బంచను
మేపగించి" "వలుదగుబ్బలు ప్రసేనకవృత్తి" "పదమెత్తన్ గలహంస"
మున్నగు పద్యములం దెన్నో గానకళా రహస్యములు గనఁబడును.
"సంగీత సాహిత్య నాయక విద్యాయుగళంబు పల్కుఁజెవికిన్
బాలింప జోడై సిరుల్ ప్రకటింపన్" అజగదంబ యిరువంకలపాలను
గడుపార రామరాజభూషణుఁడు ద్రావి గట్టని తేర్చిన వాఁ
డనిపించును.

లాక్షణికులు యమకములను గూర్చి ఆదిమధ్యాంతాది
భేదములచేఁ బెక్కురీతులఁ జెప్పియున్నారు. వాని నెల్ల లక్ష్యములతో,
సమన్వయించి చూప గ్రంథవిస్తర మగు నని లక్ష్యములను మాత్రము
మచ్చున కొకటిగాఁ జూపెదను. ప్రాజ్ఞులు వానిని బట్టి యూహించు
కొందురు గాక.

సీ॥ మందయానము నేర్పు నింకింపరాజీవ రాజీవ రాజన్మరాళరాజము

సీ॥ ఈరాలఁ బోరాదు హారాళము జవాది యీరాల నడు చక్క-

నేఁగవలయు

సీ॥ తలిరుఁబ్రాయము వాని వలరాజు నలరాజు, నలరాజుఁ

దెగడంబోయగము వాని

సీ॥ ఒకచాయ ననసాయ పికగేయ సముదాయ మొకసీమ నానాయ

యూర నినదము

సీ॥ మెఱుఁగొప్పు నెఱికొప్పు నెఱగప్పు తఱిఁగప్పు జలదమాలిక చొప్పు

దెలుప జేసె॥

ఇత్యాదులు వీని నన్నిటిని మించి యితరకవుల కెందఱికో యను కార్యమై, యనుప్రాస నిబిడమై, గానానుకూలమై, సాహిత్యరసయుక్తమై కాంతియను గుణముతో నిండిన యీక్రింది సీసము పూచినతంగేడువలె తేజరిల్లుచు ననన్యసామాన్య మగుఖ్యాతి వడసినది. అంతటిశబ్ద విచిత్రత యున్నను, నర్థమును బుష్టముగానే యున్నది. ఈపద్యమునకు వలయూఁపని సహృదయుఁడే కాడు, చెవు లున్న యేసామాన్య మానవుఁడునుగూడ నుండఁ డనిన నతిశయోక్తి గానేరదు. ఆశిల్ప మంతటిది.

సీ॥ లలనాజనాపాంగ వలనావసదనంగ తులనాభికాభంగదోఃప్రసంగ

మలసానిల విలోలదళ సాసవ రసాల ఫలసాదర శుకాలపన విశాల

మలినీ గరుదనీ కమలినీకృతధునీ కమలినీ సుఖిత కోకకుల వధూక

మతికాంత సలతాంత లతికాంతర నితాంత రతికాంతరణ కాంతసు

తనుకాంత

మకృతకామోద కురవకావికల వకుళముకుళ సకల వనాంత

ప్రమోద చలిత

కలిత కలకంఠికుల కుంతకాకలీవిఁ భాసురము వోల్చు మధుమాస
వాసరంబు—1—25.

ఇందు వసంతఋతువిలాసములు వర్ణింపఁబడినవి. అర్థము కంటెను శబ్దగుంఫనము హృదయాకర్షక మగుచున్నది. మొదటి పాదమున నాలంబన విభావములగు యువతీయువకులయందు మన్మథ విలాసావిర్భావమును, ఆకాశమున కుద్దీపనములుగా రెండు మూఁడు పాదములందు చిలుకలును, తుమ్మెదలును, చక్రవాకములును వర్ణింపఁ బడినవి. అట్లుద్దీపన మొందిన యుభయనిష్ఠ మగు "రతి" ఫలితావస్థ నొంది పూర్ణ శృంగారరస స్వరూపము నొందినట్లు నాల్గవపాదమున సంభోగము వర్ణింపఁబడినది. గీతమునందు గోరంటలు, పొగడలు పూచిన వనియుఁ, గోకిలలు మధురముగా గూయుచు రతికాంతాభి కాంతులగు నా మిథునములకుఁ బునరుద్దీప్తికరము లగు చున్నట్లును వర్ణింపఁబడినది. ఇట్లు శృంగారము రేఖామాత్రముగా వర్ణితమైనను స్థాయిభావ మగు 'రతి' పరిపుష్టమై, రస్యమై శబ్దాలంకారమధ్యమున మెఱుపువలెఁ దళుకుతళుక్కు—రను చున్నది. వృత్త్యనుప్రాస పరిపూర్ణ మగు నీపద్యపాదములు విడివిడిగా తాళమున కనువగురీతిని గూర్పఁ బడుటచే ఖండజాతి ఝంపతాళముతోఁ గొందఱు గాయకు లిద్దానిని బాడెడి యాచారముగూడఁ గలదు. ఇట్లు సంగీతసాహిత్యము లేకీభవింపఁ జెప్పుట రామభూషణకవికే చెల్లును. ఇట్లే పెక్కు—కందపద్యములును, జంపకోత్పలమాలలును దాళమున కనువగునవి కలవు. శబ్దాలంకారములందు వ్యంజనముల (హల్లుల యొక్క—యసకృదావృత్తి యున్నచో వృత్త్యనుప్రాస మనియు, ఎడము లేకుండ రెండు రెండు హల్లులు గలపదములు మరలమరల వచ్చుచో ఛేకానుప్రాస మనియుఁ, బదములు పునరుక్తము లయ్యును, తాత్పర్య భేద మున్నచో లాటానుప్రాస మనియు, సమవర్ణములు గల జంట

వొకటి గాని అధికము గాని యున్న యెడ యమక మనియు నరసభూపాలీయమునఁ జెప్పఁబడినది. "యమకమున సమవర్ణకత్వమే కాని సమానార్థకత్వ మాజంట కుండరా దని నియమము కలదు." (సమానార్థకత్వాభావన త్సమానామపూర్వికా అనేకావృత్తి ర్యమకమ్...అని.)

చ. పరబలభంగ చంగము లభంగుర తుంగమతంగజంబు ల
 ప్పురిఁ బరికీర్ణ కర్ణపుట పూరిత భూరితరానిలాహతిన్
 విరియఁగఁ దోల మేఘములు నింగిఁ దొలంగి తదంఘ్రిమూలముల్
 శరణము నంద బోలు ననిశంబుఁ బదంబు మదంబు పేరిటన్. 1-160

ఈపద్యము మొదటిపాదమున "బిందుపూర్వక గకారము"లును (ంగ) రెండవపాదమున రేఫమును, 'ణకారముతోఁ గూడిన రేఫమును,' మూఁడవపాదమున 'బిందుపూర్వక గకారమును,' నాల్గవపాదమున 'బిందుపూర్వకబకారమును' మరల మరల వచ్చుటచే వృత్త్యను ప్రాసములు వేఱు వేఱుగా నున్నవి.

శా॥ ఆరామామణిమీఁది ప్రేమమున ని ట్లారామసీమా సరో
 వారంబుల్ దిలకించి యందు నణిమర్వారంబులై మీఱు బృం
 గారావంబులచే ననంగరుజ పొంగారన్ గురంగాక్షి శృం
 గారాగారముఁ జేరి తాల్మి నిలుపంగా రాక గారామునన్. 3-82.

ఈపద్యమున "రామా, రామ" యనియు "వారం, వారం" అనియు "గారా, గార" అనియు, "గారా, గారా" అనియు నాల్గు పాదములందును రెండేసి హల్లులజంటలు వేర్వేఱుగా నుండుటచే ఛేకానుప్రాసము అను శబ్దాలంకారము.

చ. పతికృత ధర్మకౌశలముపట్టునఁ దోడగు నారి నారి దాఁ
 బితృశరణ ప్రచింత మదిఁ బెట్టక యీశ నివేశితాత్మ యా

సతి సతి -రాశి కెక్కి- యినసత్కృతిఁ గైకొనుకన్య కన్య -శో
శ్వేతమతి నిట్లుగా మనినవామయె వామ-ను మన్మ కోమలీ.6-57
(శ్వేతమతి నిట్లుగా మనినవామయె వామ. . .అనిపాఠాంతరము)

"నారినారి" "సతిసతి" ఇత్యాదిగా శబ్దార్థముల పునరుక్తి యున్నను, తాత్పర్యభేద ముండుటవలన నిది లాటానుప్రాసము. తోడగునారి యుత్తమయగు నారి-ఈశవివేశితాత్మయైన సతియే యుత్తమసతి- యని యీరీతిగాఁ దక్కినచోట్లఁ గూడఁ తాత్పర్య భేదము కలదు. ఇం దొకవిశేషము- ధర్మ మనఁగా విల్లు. వింటి కౌశలమునఁ దోడ్పడునట్టి నారి అనఁగా అల్లెత్రాడు శ్రేష్ఠమైనది. అనునిట్టి యప్రకృత శ్లేషము లీపద్యమున నంతటను గలవు. రామభూషణునకు శ్లేషకవిత యనిన నొకలీల గావున నే శబ్దసంఘటనము ననే శ్లేశము గల యిట్టితావులందుఁ గూడ శ్లేషమును మిళిత మొనర్పఁగల్గినాఁడు.

ఉ. వాసవమాలికాంకమున వర్తిలు నీనిరవద్య వాసనా
వాస వరాస నాభినుత వారిజదామము ధాత్రిఁ జెందియున్
వాసవ మాలికాంకమున వర్తిలుఁ దావకమైె వసుక్షమా
వాసవఁ చాల నెత్తయిన వారికి నెందును బేరు దప్పనే. 5-10క.

ఇందలి "వాసవ" అనుదానికి- సమానార్థకత్వము లేని సమానమగు వర్ణానుపూర్వికకు నావృత్తి, గలుగుటచే యమకాలం కారము "వాసవమాలిక" యను మొదటిపాదమునందలి శబ్దము- మాలికకు పేరు. రెండవ పాదమందో- వాసనావాసము, వరాసవాభి మతము, అని వేఱర్థము. మూఁడవ పాదమున "వాసవమాలిక" యనఁగా వసురాజసంబంధి మాలిక యని వేఱొక యర్థము.

నాల్గవ పాదమున వసుక్ష్మమా-వాసవ = వసు వను పేరుగల, క్ష్మమా వాసవ=భూలోక దేవేంద్రుఁడా! అని యింకొక యర్థము (కావున 'వాసవ' అను వర్ణానుపూర్వికకు వేర్వే ఱర్థములు వచ్చె నని తెలియునది.)

అర్థగాంభీర్యము చెడకుండ నీరీతిగా నున్న యనుప్రాస, యమకాది శబ్దాలంకారభూయిష్ఠము లగుపద్యము లమితములు. మచ్చున కొకకొక్కటిమాత్రము చూపఁబడినది.

శబ్దాలంకారములకు సంబంధించిన ముక్తపదగ్రస్తము లాశ్వాసాంతపద్యములం దరయవచ్చును. 5 ఆశ్వాసము 69 సీసము ముక్తపదగ్రస్త విభూషితము మరియు 4-86 పద్యము సింహావలోకన ముక్తపద గ్రస్త సమంచితము.

సీ. కలికిపె న్నెఱు లింద్రశిలల యందముఁ జూపుఁ, జూపు కొన్నసపిల్లు తూపుచిలుకు

చిలుకు తేనియల జొబ్బిలు మోవి సురమణి, రమణీయ వజ్రావి రదనపాలి,

పాలిండ్లు పసిఁడిగుబ్బలు లయి చెన్నారు, నారు శాతకృపాణియంద మెఱుఁగు

మెఱుఁగు చక్రము మించు మించులజఘనము, ఘన మూరురుచి కరికరముకన్న,

కన్నుసువు సేయుఁ గచ్ఛపాకార గరిమఁ గరిమరాళికయాన నీ చరణమహిమ

మహి మనోభవమణిపుత్రి మాడ్కి నీకుఁనీకుటిల కర్కశత మాను నేల కలికి?

ఇందలి ప్రథమపాదము మొదట నున్న 'కలికి' యనుపదమే పద్యాంతమున మరల వచ్చి, మొదటిపదమును జూచుచుండుటచే దీనికి 'సింహావలోకన ముక్తపదగ్రస్త' మని యందురు.

ఈసింహావలోకనమునే దండి సందష్టయమక మనెను. కావ్య ప్రకాశికాకారాదులు "అంతాదియమకము, ఆద్యంతయమకము," అనిరి. నరసభూపాలీయమున రామభూషణుఁడు -సింహావలోకన ముక్తపదగ్రస్త మనియు, పాదాంత పాదాది ముక్తపదగ్రస్త మనియుఁ జెప్పెను. సూక్ష్మముగాఁ బరిశీలించిన దండ్యాచార్యుఁడును, వామనుఁడును జెప్పిన ఆద్యంతయమకము, ఆదిమధ్యయమకము, మధ్యాంతయమకము మున్నగుయమకవిశేషములును, అనుప్రాస విశేషములును వసుచరిత్రమున నెన్నియో గలవు. విస్తర మగు నని విరమింపఁబడెను.

కావ్యలక్ష్మియొక్క శబ్దరూప మగు నర్థశరీరమును రామభూషణకవి యెట్లలంకరించెనో వసుచరిత్రమును మాత్రమే యనుసరించి యింతవఱకుఁ జెప్పఁబడినది. గ్రంథవిస్తర మగు నని యాతని యితరకృతులను స్మరింపలేదు. ఇఁక కావ్యలక్ష్మియొక్క యర్థరూపమైన యర్థశరీరమును గూర్చియుఁ బ్రసంగింపవలసియున్నది.

ఇట్లు శబ్దాలంకార వైచిత్రియందే కాక శ్లేషార్థముల చమత్కారములందును, అర్థగంభీరిమ గల కల్పనాపాటవమునందును మూర్తికవి యెందఱ కవులకో మార్గదర్శకుఁడైనాఁ డనినది జగద్విదితము. వసుచరిత్రమున నర్థగాంభీర్యము గల పద్యము లెన్నియో గలవు. అపూర్వ కల్పనము గల గిరికాదేవిముక్కును వర్ణించిన పద్యము ముక్కు తిమ్మన రచిత మనియు, దానిని గొంత ధనమిచ్చి తిమ్మననుండి విలిచి తెచ్చుకొని వసుచరిత్రమున ఘటించుకొనెను. బట్టుమూర్తి, "యను కిం వదంతి" యొకటి కలదు. ముక్కువర్ణనము ముక్కు తిమ్మనకే చెల్లు ననుభావముతో బుద్ధిమంతులు కల్పించిన యవిశ్వసనీయ మగు కథ యిది. ఇట్టివర్ణనము తిమ్మన తనకావ్యమున

నేర్పటను జేసి యుండలేదు. గిరికావయవ సౌందర్యము వర్ణించిన యితరపద్యముల కల్పనముల ముందిది లెక్కయే కాదు. కావున నది మఱచి పాఠకు లిందలి కల్పనాసౌందర్యము నరసి యానందింతురుగాక.

శా. నానాసూన వితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లద టంచు గంధఫలి బల్కాకన్ దపంబంది యో
షా నాసాకృతిఁ బూని సర్వసుమన స్సౌరభ్య సంవాసమై,
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీపుంజంబు నిర్వంకలన్."

ఇందు "సంపంగిమొగ్గ" యనునర్థము గల గంధఫలిశబ్దము స్త్రీలింగము— 'తుమ్మెద' యనునర్థము గల సారంగము పుంలింగము. అన్నిపువ్వుల వాసనల నాస్వాదించి యానందించు సారంగ మను పురుషుఁడు నన్నేల యొల్లఁడు (తుమ్మెద సంపంగియొద్దకు రా దని ప్రసిద్ధి) అని తాపము నొంది గంధఫలి యను స్త్రీ తపస్సుచేసి గిరికాదేవి నాసికయై పుట్టి (సంపంగిపూవు ముక్కున కుపమాన పదార్థము.) ఎల్లపూవుల వాసనలకు స్థానమైన దట. ఏపువ్వువాసన కావలసినను సారంగము తనయొద్దకు రావలసిందే కదా (గిరికయొక్క ముక్కు పూవు లన్నిటివాసనలను నిత్య మాఘ్రాణించుచున్న దని భావము.) అట్లు సారంగము వచ్చినచో నాపురుషునకు పరాభవముగా— నాతనిభార్యలగు మధుకరీపుంజమును తన కిరువంక నిలిచి హాస్యము చేసెడివారిఁగా నెలకొల్పుకొన్నది. అనఁగా నాగిరికముక్కు సంపంగి పూవువలెను, ఆమెచూపులు తుమ్మెదబారువలెను నున్న వని భావము.

పై కల్పనలోని భావమేమన — ఒకప్రౌఢకాంత తన్నొల్లక యితరకాంతలను వలచునట్టి ప్రియునిపైఁ గోపించి, యాతనివలపు కత్తెలను దనవశమున నుంచుకొని, వారికొఱకై యాతఁడు వచ్చు

నప్పటికి—నాతని భార్యలచేతనే నీచమగు నూడిగము చేయించుకొనుచు గనఁబడి యాప్రియుని వంచించి కసి దీర్చుకొనునట్లు గంధఫలి సారంగము నెడఁ బ్రవర్తించినది అని సారంగ, గంధఫలీ, వాసనా శబ్దముల లింగమును బట్టి యూహింపఁ దగును. అట్టి లింగవివక్షలేనియెడల ఇతర రాజులమైత్రి గోరుచుఁ దన్నుఁ బరాభవించిన శత్రురాజును జయించి వానిభార్యలను తనకు దాసికలను జేసి ఆశత్రువును వంచించి నట్లని యనుసంధించుకోవచ్చును. ఇట్టి కల్పనము మనుచరిత్రమున "కుకురు, కాశి, కురు, కరూశ" అను ప్రథమాశ్వాసాంతపద్యమున —కృష్ణరాయలు కుకురు, కాశి, కురు, కరూశాది దేశముల రాజులను జయించి వారికన్యలను దెచ్చి తనరత్నపాదుకలు తమ్మపడిగము, అద్దము, తములపాకులబరణి, మొదలగు రాజలాంఛనములను (నారాజులకుఁ బరాభవముగా నుండునట్లు) ఆకన్యలచే మోయించుచున్నాఁడు అని కలదు. ఆకాలమున నది పెద్దప్రవాసి చిహ్నముగా నుండెడి దనుకోఁదగును.

ఇంతటి యర్థగాంభీర్యము గలిగి యిట్లే నారికేళపాకమున "తనరాజీవశరం బెఱుంగదు." "ఇంతి మృదూక్తి మాధురికి" 'సవిహృదయాలవాలము' ఇత్యాదిగా నెన్నియో పద్యములుజక్కఁగా ఈపద్యభావమొక్కటియే కల్పింప నేరక యన్యు లిది తెచ్చి వసుచరిత్రమున నదుకుకోఁబడె ననుట యెంత హాస్యాస్పదము! ఎంత హేయము! అసూయాలక్ష్మి యట్లు కటాక్షించినది కాఁబోలు—ప్రకృతమునకు వత్తము.

రామరాజభూషణుఁ డుభయభాషలును, శాస్త్రములును సరహస్యముగా నేర్చినవాఁ డగుటచే నందఱవలెఁ గాక శ్లేషార్థముచేఁ దనకవితను బుష్ట మొనర్చుకొన్నాఁడు. ఆతని పుణ్య మేమో శ్లేషకవిత యాతనిపదదాసి గదా! వసుచరిత్రవంటి తాజమహాలు శిల్ప

సృష్టి చేసిన యీమహనీయునకు హరిశ్చంద్రనలోపాఖ్యాన రచన మొకలెక్కలోనిది గాదు. అయినను నాఁటికిఁ బ్రాయము కైవాలి యుండును. ఐహికప్రవృత్తి తగ్గి యుండును. ఆముష్మికచింతనా పరతంత్రుఁడై యుండును అని హరిశ్చంద్ర నలోపాఖ్యానము నవతారికనుబట్టి గ్రహింపవచ్చును.

సీ॥ సుతులఁ బెక్కండ్ర శాశ్వతరామనామధన్యులఁ జేసి
పిలుచుభాగ్యోదయంబు,
రచితాగ్రహారంబు రామచంద్రపురాంక పూతం బొనర్చిన
పుణ్యరేఖ
నవదివ్యభవనంబు నవరించి శ్రీరామ విభుఁ బ్రతిష్ఠించిన
విపులమహిమ
రామసరో నామ రమణీయముగఁ దటాకము వినిర్మించిన
ఘనయశంబు
సఫలత వహించు నీహరిశ్చంద్రనల కథాయుగ నిబంధ చిత్రబంధ
ప్రబంధ
మంకిత మొనర్చు రఘుభర్త కఖిలకర్త, కురువరాభీప్సితము లెల్ల
నొదవు నీకు.

అని తనయుపాస్యదైవత మగు నాంజనేయమూర్తి స్వప్నమునఁ జెప్పగా నట్లే యొనర్చుచున్నా నని చెప్పెను. వనప్రతిష్ఠయు, నిక్షేపమును దక్క సప్తసంతానములలో నైదుసంతానములుగాంచి, యాంజనేయాదేశానుసారము దాను రచించిన ద్వ్యర్థికావ్యమును దనయుపాస్యదైవతమునకును- దనకును -నిష్టదైవత మగు రామచంద్ర పరమాత్మున కంకితమొనర్చి ధన్యుఁడైనవాఁడు -వసుచరిత్రమువంటి మహాప్రబంధరచనయందు సిద్ధహస్తుఁడై యున్నాడు, కావుననే వార్థకమును లెక్కింపక రెండర్థముల నాద్యంతమును జోడించి చెప్పఁ

గలైను. అందలి సాహిత్యము నెట్లు జోడించెనో తుదిని బరిశీలింతము. ముందు వసుచరిత్రసృష్టిని గూర్చి కొంచెము చూతము.

వసుకావ్యముయొక్క యితివృత్తము భారతమాదిపర్వములో నిట్లున్నది. "వసురాజు తపము చేయుచుండ నింద్రుఁడు ప్రత్యక్షమై దివ్యమగు నొకవిమానమును, సకలపరిహారణములను వారించు, నింద్రమాలయు, దుష్టశిక్షణ మొనర్చు నొక వేణుయష్టియు నిచ్చి, స్వర్గమునకు వచ్చి పోవుచుండు నట్లు వరమిచ్చెను. ఆవిమాన మెక్కి సంచరించుచు నుపరిచరుఁ డను సంజ్ఞ నొంది, ఇంద్రమాలికను దాల్చి, వేణుయష్టి కేటేట నింద్రోత్సవము చేయువాడు.

కోన్నాళ్ల కాతని రాజధానియగు నధిష్ఠానపురము చెంతఁ బ్రవహించు శుక్తిమతీనదిని గామించి కోలాహలుఁడను పర్వతరాజు నిరోధితనాయేటినీరు పొంగి పొరలి పోవుటచే జగత్తంతయు నానీటిలో మునిఁగిపోవుచుండ వసురాజు తన కాలికొనగోటితో నాకొండను దూరముగాఁ జిమ్మి లోకమును గాపాడెను. కోలాహలుని సమాగమమున శుక్తిమతి గర్భవతియై వసుపదుఁడను కొడుకును, గిరికయను కూఁతును గని వారిద్దఱను కృతజ్ఞత మెఱయ వసురాజున కర్పింపఁగా నారాజు వసుపదుని సేనాధిపతిగాఁ జేసి, గిరికను భార్యగా స్వీకరించెను. అని అదికావ్యమునకు యథాస్థితముగా ననుకూలము గాదని తన భావనాపాటవముచే సానపట్టి గనిఁ బుట్టిన యారత్నము నలంకారయోగ్య మొనర్చి శ్లేషవిధానముచే దానికి శాశ్వతమగు మెఱుఁగులు దిద్దెను.

కొండకు నదికిని బిడ్డలు గలిగి రను కృతయుగగాథ యీనాఁటి జనసామాన్యమునకు విరుద్ధముగాఁ గనఁబడవచ్చు నని యూహించి, నాయికానాయకులుగాఁ నదిని, గొండను ముందుగాఁ దీర్చినాఁడు.

"భావా నచేతనా నపి చేతనవ చ్చేతనా నచేతనవత్
వ్యవహారయతి యథేచ్ఛం సుకవిః కావ్యే స్వతంత్రతయా"

ఆ (సుకవి యచేతనపదార్థములను చేతనములనుగాను, చేతనములను జడపదార్థములనుగాను మార్చి, కావ్యమునఁ దనయిచ్ఛ వచ్చినట్లు స్వతంత్రుఁడై వ్యవహరించును.) అను సూక్తిప్రకారము రసానుకూలముగా శ్లేషబలమున నాయకుఁడు కొండ యని, నాయిక నది యని స్ఫురింపకుండఁ గథ నంతయు మూర్తికవి నడపినాఁడు. ("అపారే కావ్యసంసారే కవి రేకః ప్రజాపతిః, య థాస్మై రోచతే విశ్వం త థేదం పరివర్త్యతే." అపారమగు కవిత్వప్రపంచమునఁ గవియొక్కఁడే బ్రహ్మ. ఆతని కెట్లు రుచించునో యట్లే యీజగత్తంతయు మాఱిపోవును.) కావున నట్లే మాఱిపోయి, రసాభాసమయ్యును మనుచరిత్రమందలి వరూథినీప్రవరుల కథవలెఁ గావ్యమున కొకదీప్తిని గలిగించినది. ప్రవరుని కేమియు లేక వరూథిని కొక్కతెకే యనురాగము కలిగినట్లు శుక్తిమతి కేయించుకయు లేక కోలాహలుని కొక్కనికే యామెయందనురాగము కలుగుటవలన "ఏకత్రైవానురాగ శ్చేత్...రసాభాస స్త్రిధా మతః" అని యుండుటచే రసాభాసమై ప్రధానకథ యగు గిరికావసురాజుల సంయోగమున కంగమై, ప్రధానమగు శృంగారమును బుష్టమొనర్చినది. రసాభాసమాస్వాద్యమే కాని దోషము కాదు.

"శ్లో॥ రసభావా, తదాభాసా, భావస్య ప్రశమోదయా సంధిః శబలతా చేతి సర్వేఽపి రసనా ద్రసాః, రసనధర్మయోగిత్వా, ద్భావాదిష్వపి రసత్వ ముపచారా దిత్యభిప్రాయః"

అని, సాహిత్యదర్పణము. కావుననే మను, వసుచరిత్రములం దీరసాభాసము పెంపొందింపఁబడినది. ప్రకృతమునకు వత్తము.

రామభూషణుఁడు మహాప్రతిభాశాలి కావున నచేతన భావము స్ఫురింపకుండ శుక్తిమతీ కోలాహలుఁనకును నాభాసశృంగారమైనను నౌచిత్యము చెడకుండ నెంతయు మనోహరముగాఁ దీర్చెను. గాలిని మూటగాఁ గట్టెను. కొండను బిండి రసము తీసినాఁడు.
నాయిక యగు శుక్తిమతిని శుద్ధశాంత స్వభావగాఁ దొలుత నిట్లు వర్ణించెను.

ఉ॥ జీవన మెల్ల సత్కవిని షేవిత మాశయ మెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల పట్టు, పరిచారము లెల్ల విశ్వధా
త్రీవలయ త్రికాలఫల దేశికముల్, నవకంబు లెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము, లానది పెంపు నుతింప శక్యమే?

తనజీవితము నుత్తములగు పండితులవశము చేసి వారివలన విజ్ఞానము నార్జించికొని నిర్మల పవిత్ర గంభీర హృదయమై, సమస్తజగత్తునకు నెరుగుచుఁ ద్రికాలఫలములను దెలియఁ జెప్పునట్టిదియై జీవన్ముక్తులకుఁ గూడ నచ్చెరువు గూర్చు లావణ్యము గల్గినట్టి యొకముగ్ధ యగు నాయికగను—జలపక్షులచే సేవింపఁబడు జలములతోను, నిర్మలములును, పవిత్రములును, లోఁతుగలవియునగు జలాశయములతోను, పుడమి నలువంకల ముక్కాఱుపంటల కనువుగాఁ బ్రవహించు ప్రవాహములతోను ముత్యాలు పుట్టునట్టి శంఖములతోను, బ్రకాశించునట్టి నదిగాను శుక్తిమతిని వర్ణించెను. ఇఁక నాయకుఁడగు కోలాహలుని ధీరలలితునిగా నుం దిట్లు వర్ణించెను.

సీ॥ సుమనోధివాస భాసుర శిఖోన్నతివాఁడు, ఘనసారతిలక వాసనల వాఁడు
ఘనసంకు మదసాంద్రగండభాగము వాఁడు, నవపద్మరాగ దంతముల వాఁడు

కలితోపకంఠ నక్షత్రమాలిక వాఁడు, హరిచందనచ్ఛాయ
నమరువాఁడు
తపనీయమేఖలాధాళధళ్యము వాఁడు, మణిపాదవలయధామంబు
వాఁడ
నర్ఘ్యరత్నావళీ విచిత్రాంబరాభిః రామశృంగారముల వాఁడు
హైమగర్భ
గేహమున కేఁగువాఁడు కోలాహలాఖ్యుఁడొక ధరాధీశుఁ
డెదు రయ్యె నువిద కపుడు.

"సిగలోఁ బువ్వులు తుఱుముకొని, కప్పురపుబొట్టు దిద్దికొని, చెక్కు-లందు జవ్వాది యలఁదుకొని, దంతము లెఱ్ఱవాఱఁ దాంబూలము సేవించుచు, మెడయందునక్షత్రమాలను దాల్చి, రత్నాభరణములను, విచిత్రమగు వస్త్రములను దాలిచి, శృంగారరసమూర్తి యగు కోలాహలుఁ డనుపేరు గల యొకధరాధీశుఁ కాశుక్తిమతి కెదు రయ్యెను." ఇందు విశేష్యమగు ధరాధీశశబ్దము విననగానే ధరా= భూమికి, అధీశుఁడు=ప్రభువు, రాజు అనునర్థమే సామాన్యముగా స్ఫురించును, గాని "అహార్యధరపర్వణ అను పర్వతపర్యాయమగు ధరశబ్ద మంత వేగముగా స్ఫురింప నవకాశము లేదు. ఏమి విచ్ఛిత్తి విశేషము !

"యానేవ శబ్దాన్ వయ మాలపామో, యానేవ చార్థాన్ వయ
ముల్లిఖామః
తైరేవ విన్యాసవిశేషభవ్యైః సంమోహయంతః కవయో జగంతి."

(మన మేశబ్దముల నుచ్చరింతుమో, ఏపదార్థములను విశేషించి చెప్పుదుమో, వానినే కవులు స్వీకరించి మనవలెఁగాక చిత్రవిచిత్రము లగు కూర్పులచేత లోకమును మోహపెట్టుచున్నారు.) అనినట్లు

ఈపద్యమందలి ధరాధీశాది శబ్దసంయోగమున మూర్తికవి ఆహా! యెంతభ్రమ కలిగించినాఁడు! ఇట్లు శృంగారియగు నాయకునిపరముగాను -ఆవిశేషణములకే - దేవతలు నివసించునంత యెత్తైన శిఖరములతోను, చేవగల తిలకవృక్షములతోను, జవ్వాది యంటుకొనిన చాఁపఱాలతోను, కెంపులు గల (కొంక) నకిమిశ్రదేశములతోను, మంచిగంధపుటడవులతోను, బంగారు చఱియలతోను, రత్నవికారమగు పరిత్యంతపర్వతములతోను గూడుకొని ప్రకాశించునట్టి యొక - ధర = పర్వతములకు, అధీశుండు = రాజు అను కోలాహలుఁడు ఉవిదకున్ = స్త్రీయగు శుక్తిమతికి-ఎదురైనాఁడని కొండపరముగాను, నర్థద్వయము కల్పించి చమత్కరించెను. (ఈపద్యమున నున్నట్లు విశేషణము లన్నియు శ్లేషించుటయే గాక, విశేష్యముగూడ శ్లేషించినచోట శ్లేషాలంకారము గాదు. ఇఁక నేమన - మఱియొక పదార్థజ్ఞానము కలిగించు ధ్వనివిశేషము మాత్ర మగు'' నని మల్లినాథాదు లనిరి.) నర్మద, బాహుద, వేత్రవతి, సరస్వతి మొదలగు పుణ్యనదులు తన్ను సేవించుచుండ నాశుక్తిమతి నిత్యమును బ్రహ్మలోకమునకు వెళ్లుచుండును. అట్లు వెళ్లుచుండఁగాఁ ద్రోవలో మీఁద వర్ణించినవేషముతోఁ గోలాహలుఁ డామె కెదు రయ్యెనఁట (నర్మదాదినదులను జెప్పినప్పుడుగూడఁ జెలికత్తెలపరముగాను, నదీపరముగాను నర్థద్వయకల్పనము లేకపోలేదు.) అ ట్లెదురైన కొండలరాజును గాంచి శుక్తిమతియు వినయముతో నోరగాఁ దప్పుకొని యేగినదఁట- కొండ యడ్డమైనచో నది ప్రక్కగాఁ బ్రవహించుట నైజము గాన నట్లు చెప్పఁబడినది. తరువాత నామె రూపమును జెప్పవేయక చూచి యేఁగినది మొద లాకోలాహలునకు విరహవ్యథ కలిగిన దని, అయిదుపద్యములలో విరహిపక్షముగాను, కొండపక్షముగాను, అలంకారశాస్త్రవిధుల కనుకూలముగా - నర్థద్వయము గలుగ వర్ణించెను.

తుద కాతఁ డావిరహతాపము భరింపలేక, యానదికడకు రాఁగా -ఆమెయు నెదురుగా వచ్చి యతిథిపూజ గావించి యుపచార వాక్యములు చెప్పుచు తుదను "అనఘ! యెవ్వార లైనఁ గొండంత వారిఁ కవనిఁ గొండంత పూజ సేయంగఁగలరేఁ భక్తి నే నిచ్చు నీపుష్పపత్రితోయఁ మాత్రములు గైకొనుమె కాక గోత్రతిలక" అని కొండతోఁ జెప్పించుటలోని యౌచిత్యమునకు విలువ నిర్ణయింపఁ దరమా? పిదప శుక్తిమతిని జూచి గిరిరాజు, తనయనురాగము వెల్లడింప- శుక్తిమతి కాంతవృత్తితో విరాగము వెల్లడించును. తన హీనస్థితిని నదీపక్షముగాఁగూడ నర్థము వచ్చునట్లు దీనముగాఁ జెప్పి వారించును. కాని కోలాహలుఁ డామెపైఁ బడి పట్టుకొనఁగా—

"వేణి చలింపఁ-గంపిత నవీన మృణాలభుజాగ్ర కంకణ
శ్రేణి నటింప -లోల శఫరీ నిబిరీస కటాక్షకాంతి వి
స్ఫూణము సూప హంసకగణ క్వణనంబును మీఱ -సైకత
శ్రేణి వివర్తితాబ్జముఖ శోభితయై కడు సంభ్రమించినన్."

అని హృదయము చెదరినమగువ యెట్లు సంభ్రాంత యగునో యట్లు వర్ణించుచు -సైకతములే పిఱుఁదులుగాఁ గల నది యనునర్థముతో విశేష్యమే గాక, యెల్ల విశేషణములును, నర్థద్వయముతో నిబంధింపఁ బడినవి. తరువాత నాకొండ బలాత్కారమున నానదితో రమించిన ట్లాద్యంతము నుభయార్థములతో నద్భుతముగా వర్ణించి, యఘటనా ఘటనా పటుత్వము ప్రకటించుకొనెను రామభూషణకవి.

పిదప నదిపై నష్టముగాఁ గొండపడుటచే ప్రవాహము స్తంభించి జలము జగము నంతయును ముంచి వేయఁగా - వసురాజు వచ్చి తనకాలి బొటనవ్రేలి గోటితో నాపర్వతము నెగమీటఁగా జలమంతయు ప్రవాహరూపమునఁ బోయినది. రాజునకు భయపడి యాకొండ యచ్చటనె పడియుండి యానదికొఱకు గ్రుక్కిళ్లు

భ్రమింగుచు నుండెను. నదికూడఁ గలఁక దేఱి ప్రసన్నమైనది. పిమ్మట నానదికి గర్భచిహ్నములు గనఁబడె నని యుభయపక్షముల నర్థములు స్ఫురింప వర్ణింపఁబడెను. ఆశుక్తిమతి నవమాసములు నిండిన పిదపఁ గొడుకును, గూతును గనె నని చెప్పి నదియగు తల్లియు, కొండయగు తండ్రియును గిరిక నెట్లు పెంచి పెద్దదాని జేసిరో యెచ్చటను బ్రకృతాప్రకృతములు మఱువకుండ జోడించి చెప్పిన రామభూషణుని వశ్యవాక్త్వము మాటలతోఁ జెప్పఁదరము గానిది.

పిదప గిరికకు విద్యాభ్యాసము- అందు సంగీత విద్యాభ్యాసము మున్నగునవియు, శ్లేషమయముగానే రచింపఁబడినవి. న్యాయముగా నీకథ యంతయు నారంభముననే యుండఁ దగినది. కాని యట్లు చేయక, శుక్తిమతీ ప్రవాహ నిరోధకుఁడై తనకాలి బొట్టనవ్రేలిచే నెగఁజిమ్మఁబడి పడియున్న కోలాహలపర్వతమును వసురాజు క్రీడాపర్వతముగా స్వీకరించిన బలశాలి యని మాత్రమే ముందు చెప్పి - వసంతర్తువు రాఁగా విహారార్థ మాకొండపైకి నర్మసచివునితో గూడి వచ్చి విశ్రమించి యుండ, వీణాగానము వినఁబడఁగా ఆవీణ వాయించువా రెవ్వరో చూచి రమ్మని నర్మసచివుని పంపును. ఆనర్మసచివుఁ డాచోటికి వెళ్లి చూచి వచ్చి, యచట నొకజగన్మోహనాకార యగు నొకయువతి వీణ వాయించుచుండఁ బొదలమాటున నుండి చూచి వచ్చితి నని చెప్పి యామెసౌందర్యమును బెద్దగా వర్ణించి, యామె నీకుఁ దగినయువతి యని యాతని గొనిపోయి యొకపొదరింట నిల్పి చూపి, యాతనియానతిపై - మాయాముని వేషము ధరించి, హాయిగాఁ జెలికత్తెలతోఁ గూడి వీణ వాయించు చున్న యాకన్య యెదుటికేఁ జిత్రముగఁ జని వారివలన సత్కృతుఁడై యానర్మసచివుఁ డాకన్యవృత్తాంత మడుగఁగా - నాపె చెలికత్తె యగు

మంజువాణి యనునామె - శుక్తిమతీకోలాహలుల సమావేశము శుక్తిమతి గర్భిణియై కొడుకును గూఁతును గనుట - మొదలగు వృత్తాంతము నంతయుఁ జెప్పి ఆమెకూఁతురే యీమె. ఈమె పేరు గిరిక" అని యామెజననాదికము చెప్పిన ట్లచ్చటఁ జెప్పించును. ఈసంవిధానము శాకుంతలనాటకమున దుష్యంతుఁడు పొదరింట డాఁగి యుండి చెలికత్తెలతో వృక్షసేచన మొనర్చెడు శకుంతలను జూచి పరవశుఁడగుట, తుమ్మెదబాధ తొలఁగించు నెపమున నెదుటికి రాజపురుషుఁడ నని వచ్చి ప్రియంవదాముఖమున శకుంతలాజన్మ వృత్తాంతము వినుట మున్నగుసంఘటనలను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి.

దక్షిణుఁడు, అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అను శృంగారనాయకులకు, నాయికల యానుకూల్యమునకై సాయపడునట్టి విట, పీఠమర్ద, చేట, విదూషకు లను నలుగురును నర్మసచివనామమున వ్యవహరింపఁబడుదు రని రసమంజరియందుఁ గలదు. కోపించిన నాయికను బ్రసన్నురాలి నొనర్చువాఁడు పీఠమర్దుఁ డనియు, కామతంత్రమునను గళలయందును బండితుఁ డగువాఁడు విటుఁడనియు, సంధాన చతురుఁడు చేటుఁ డనియు, అవయవాది వికారములచే నవ్వుపుట్టించువాఁడు విదూషకుఁ డనియు- నందే కలదు. వసుచరిత్రమున నాయికను ననుసంధించుటలో నేర్పరియగు నీగాలముఁడు చేటుఁ డను నర్మసచివుఁ డగును. ఆతఁడు నాయకునకు మిత్రుఁడు గాఁ బరిగణింపఁబడును. రాజు గిరికాసమ్ముఖమున కదాటుగా వచ్చినప్పుడు "చింతితకళ్యాణసమృద్ధి ర స్తనుచు సన్మిత్రుండు దీవించె" నని యుండుటచే మిత్రుఁ డన వచ్చును, "అని చెలి విన్నవించుటయు" అనియు "నీ వేగతిఁ బల్కరించెదవొ యిష్టసఖా" అనియు, "జనవల్లభుఁడున్ మది మెచ్చ నెచ్చెలిన్" అనియు "భూపతి యచ్చో హితు నేర్చు" అనియు, "మాకుఁ బరమాప్తుఁడు గాక మునీంద్ర

మాతుర్రిడే" అనియు, నాయూచోట్ల నీతఁడు చెప్పఁబడుట చే-రాజునకు మిత్రుఁడును, నాయికానుసంధాన నిపుణుఁడు నగు చేయఁడను నర్మసచివుఁడే యాగౌతముఁడని తెలియఁదగును.

ఆధర్మసచివునకు మాయామునివేషము నాటకమున వేషము వేయించి చెలులతో నుండిన గిరికయెదుటికిఁ బంపుదృశ్యము నిరుపమ చమత్కృతియా భూషితము. గిరిక వీణ వాయించుచుఁ బాడుచున్నది. చెలులు వినుచున్నారు. నర్మసచివుఁడు "నరపాల నిరపాయ హితవిహారహారిణియై గడిదేటి యొకజడదారి"నై యెట్లు వారియెదుటికిఁ బోదునా, యని యాలోచించుచున్నాఁడు. ఇంతలో నొకచెలికత్తె యే మన్నదా! "చెలులారా!" యీగంధగజయాన గీతప్రబంధకలనకు నలరి యతి లియ్యమై వచ్చెను, చూచితిరే" అని సంగీత కవిత్వమున గణాదిని వచ్చెడి యతిని గూర్చి ప్రసంగించినది. "యతి వచ్చెను" అనునావాక్యమునే యవకాశముగాఁ జేసికొని మాయామౌనివేషమున నున్న నర్మసచివుఁడు "మేలు లతాంగి! నీపలుకు మెచ్చితి నే యతివచ్చు జాడ నేలీల నెఱింగితమ్మ" అనుచు వారి యెదుటఁ బ్రత్యక్షమై వారుతన్నుఁ గూర్చి జంకకుండునట్లు, "బహుళీకృతచాతురి మించు నీవిపంచీ లలితామృతారవము చిత్తము సోఁకినది." ఇంత సొగసుగా వాయించుచున్న "ఈకలాశాలిని జూచి దీవన లొసంగపోవుట" న్యాయము గాదని వచ్చితి ననెను. వచ్చినవాఁడు మౌని. ఆతనిపని యాకన్యను దీవించి వెడలిపోవుట-ఇం దెవ్వరికి నెట్టిసందేహము కలుగవలసినపని యే మున్నది? అట్టివారి దీవన యట్టికన్యకాజనమున కవశ్యవాంఛనీయమే కదా! హఠాదాగమమునకు నాకాంతలు ముందు తొట్రిల్లిరే కాని భక్తితో గిరికయును, జెలులును మ్రొక్కిరి. అంత నమ్మాయామౌని వినయవతి యగు గిరికను జూచి సంతసించి "అనన్య కన్యాసామాన్య లావణ్య

వ్రిభావ, సువల్లభుం బెండ్లి యాడు” మని దీవించినాడు. “అనన్య...వ్రిభా! వసువల్లభుం బెండ్లియాడు” మను నర్థాంతర ఘటిత మగుట చిత్రము. ఈఘట్టము కేవలనాటకీయ మనుటకు సంశయ మే మున్నది?

ఇంకొక చిత్రసంఘటన మీఘట్టముననే యున్నది. తా నెవ్వరో శ్లేషఘటిత వాక్యములచే సత్యముగాను, కపటముగాను చెప్పి, గిరికజన్మవృత్తాంత మంతయు మంజువాణియను నామెచెలిపలన విని మాయామౌని “కొంతతడ వాత్మధ్యానవిజ్ఞాన ము దాఁ్రియత్త ముగా నున్న”ట్లుండి కాంతారత్నముతో “లేమా! యే మాంతర దృష్టిఁ జూచితిమి భామాభావిభాగ్యోదయము. ఈయబ్జాసనను వసురాజేంద్రుఁడు తప్పక పెండ్లియాడు” ననెను. అని యూర కుండ లేదు. “అయ్యనఘుఁడు నీలతాంగియు లతాంతముఁ దావియుఁ బోలె నేకమై వెలయంగఁ గన్నులారఁ గనువేడుక వేగమ మీకుఁ గల్గెడున్” అని చెలులనుగూడ దీవించెను. దీవించినంతమాత్రమునఁ గార్యములు సిద్ధించునా? యనియు మునులవాక్యము పొల్ల యగునా? యనియు సంశయించుచు మంజువాణి “ఇన్నగరాజుఁ జూడ వసుధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు? వచ్చి యీకొన్ననతీవజుంపముల కోనకు నెన్నఁడు డిగ్గు? (డిగ్గుఁగాక) డిగ్గి యీకన్నియఁ గన్నులారఁ గుతుకంబున నెన్నఁడు గాంచు? గాంచి తా నెన్నఁడు గారవించుఁ? జెలు లెన్నఁడు గాంతు రభీష్టసంపదల్? అని సందేహసూచక వాక్యములతోనే యడిగినది. కాని “ఓతపోధనమణి! యీలతాంగి వసుధావరు నెన్నఁడు చెట్టపట్టునో? యని యనురక్తి పెంపు మెయి నాడితిఁగాక, శుభప్రసంగ మంగనకు నొసంగఁ గొంగుముడిగాదె భవద్వచనంబు” “అని” వెంటనే భయపడుచుఁ బల్కినది. ఈమంజువాణిపలుకు లెంత స్వభావానుగుణములో! తరువాత లలనా!

యీయెలనాఁగఁ బెండ్లియగు వాలాయంబుచేరి క్షమాతలనాథుండు (నామాటనమ్ము. ఇది నమ్మలేని నిజమంత్రిపొ్రిఢి(ని) రప్పింతును, ఆసలనాసత్యసమానుఁ జూడుము —అని— మాయాజపాకలనాదంభము పూని (అ)మౌని దిశ లాకర్ణించి "మఝ్ఝా" యనెను. ఈమాట లన్నియు లతాగృహమున నుండి వినుచుండుటచే "ఇదె సంధింపఁగ వేళ" యనుకొనుచు వసురాజేంద్రుండు ...లతాచ్ఛాదసంఛాదికఁ బాసి యెదుట నిల్చెను. శతకోటి మన్మధ సౌందర్యనిధి యగు నారాజును జూచి యక్కాంతలు సంభ్రమమున నర్పించు బంగారు గద్దియపై రాజు కూర్చుండెను. అంతకు మున్నె "చింతితకార్యాణి సమృద్ధిరస్తు" అని మాయాముని దీవించి యున్నాఁడు. అట్టియెడ జగన్మోహనాకారుఁడగు నారాజును, జూడఁగనే గిరికహృదయమున ననురాగ మంకురించి తన్మయీభవనము వలన సాత్త్వికభావములగు రోమాంచ కంప స్వేదాదులు పుట్టినవి. పిదప ఔత్సుక్య మనుసంచారి భావము ప్రకటిత మైనది. ఈరీతిగా నామెయందలి శృంగారమునకు బీజమగు "రతి" యన బడు స్థాయి పరిపుష్ట మైన దని భట్టుమూర్తి తనయసాధారణ సాహిత్యరసపోషణ నైపుణ్యముఁ బ్రకటించెను. తరువాతపద్యమున లజ్జాభరముతోడి యామెచూపులను బ్రత్యేకముగా వర్ణించెను. చూడవలె నని మనస్సు తొందరసెట్టుచున్నను లజ్జచేఁ గుంగుచు నవలానవలాలిత దృష్టిజాలములు తొంగలిఱెప్పలందు నిలిచిపోయి యెదురుగాఁ బోలేకఁ ఆమె యాకర్ణాంతవిశాలనేత్రి యగుటచే చెవిరత్నాభరణకాంతులవెనుక యొదిగి యుండి, తుదకు వెన్నెలపుల్గులచాలు చంద్రునిమీఁద వ్రాలిన ట్లారాజుపై వ్రాలెను. అనఁగాఁ గొంతసేపు కంటిఱెప్ప యెత్తక, నిలిచి, కడగంటితోఁ గొంతసేపు చూచి, తృప్తిగనక తటాలున రాజుముఖమును జూచినది. ఆచూచిన చూపచ్చట నిలిచినదా? అనినచో — కాంతతదీక్షణ జాలకంబు —ఆరాము యొక్క— సొగసైనచూపు లెదుర్కొన సిగ్గుచే

వెనుకకు మరలియు, ఈరీతిగనే వెనుకకు బోవుచున్న రాజుచూపుల వెంబడిని బాఱఁబోచ్చినవి. అనఁగా రాజును సిగ్గుచేతఁ జూడఁజాలక యెట్టెట్లో చూచినది. అంతలో రాజు తన్నును జూడ గిరిక తన చూపులను గిరుక్కున వెనుకకుఁ ద్రిప్పికొని, యాతఁడును సిగ్గుచేఁ దనచూపును మరల్చుకొనఁగా నాతని చూపువెంట మరలఁ జూడఁ దొడఁగినది. అని యతిసూక్ష్మమగు భావములను లలితాతిలలితముగాఁ బ్రదర్శించెను.

ఇట్టిభావమే కళాపూర్ణోదయమున సూరనయుఁ జెప్పినాఁడు. అక్కడఁ గూడ నాయికానాయకుల యన్యోన్య ప్రథమదర్శనమే. వర్ణ్యము సమానమే కాని పాకము వేఱు.

చ॥ వనజదళాక్షి చూచినను వల్లభుచూపు లతండు చూచినన్
వనజదళాక్షి చూపులు ఘనత్రపచే సెను వెన్కకున్ వెసన్
జనుచు నొకళ్లొకళ్లకయి సారెకు వచ్చుచుఁ బొల్పుమీఱెఁ గ
న్గొన రతిపంచబాణుల వినోదపు టుయ్యెలచేరులో యనన్.

అని- ఇట్టి మనస్సున కందని భావములను సులభముగాఁ జెప్ప నేర్పు ప్రతిభావంతులగు మహాకవులకుఁ గాని సాధ్యపడవు గాదా? - సాహిత్యరసపోషణ మన నింతకంటె నేమి యుండును? వసురాజు ప్రవేశమునైతము నాటకీయముగానే నడచినది. కాని మాయామాణవి ప్రవేశమునఁ గలుగు విచ్ఛిత్తివిశేషమువలె నిచటివిచ్ఛిత్తి యంత బలముగాఁ గనరాదు. కారణమే మన - "యతి వచ్చు లియ్యమై" యని గానసంప్రదాయమునఁ బలికినపలుకునకు వక్రోక్తిచే యతి పక్షముగా నర్థము చేసి ప్రవేశించుట యక్కడ. ఇక్కడ మాయ నైకొని మాటాడుచున్నట్లు ముందుగనే స్పష్టమగుటచే మునివాక్కు లందును, రాజు ప్రవేశించుటయందును నంతటి విచ్ఛిత్తి కలుగ దనియే కాని యేపాటి విచ్ఛిత్తియు లేదని కాదు. ఇట్టివిచ్ఛిత్తి

విశేషములలో నేదో యొకటి శబ్దమందో, అర్థమందో, అలంకారమందో, ధ్వనియందో, తుదకు రీతియందో, లేనిపద్య మొక్కటి యు వసుచరిత్రమున లేదనియే చెప్పవచ్చును. అవి యెల్లను పెద్దపెద్ద వ్యాఖ్యలయందును బరిపూర్ణముగాఁ గనఁబడు నని చెప్పఁజాలము. ఆసాహిత్య మట్టిది.

ఇంత ధీరముగాఁ బలుకుటకుఁ బెద్దలవలన విన్న కొన్నిగాథలు హేతువు. అం దొకటి చెప్పెదను.

పెద్దాపుర సంస్థాన ప్రభువులగు తిమ్మజగపతి మహారాజులుంగారి యాస్థానమున మహావిద్వత్కవియు, వైణికవతంసులు నగు శ్రీ శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిలవారు వసుచరిత్రిలోని కొన్నిపద్యముల కఱువదినాలు గర్థములను జెప్పి రనియు, "స్వైరవిహారధీర" లగు నపద్య మాపద్యములలోనిదే యనియు, వానిలోఁ గొన్ని యర్థములు మాత్రమే విన్నా ననియు, మాగురువులు బ్రహ్మశ్రీ చావలి లక్ష్మీనరసింహశాస్త్రిలవారు చెప్పెడివారు. వారివలన విన్న యాయర్థవిశేషము లిటఁ జూపెదను.

వర్మసచివుఁడు గాన మొనర్చుచున్న గిరికను బొదలమాటున నుండి చూచి వచ్చి, యామె చక్కదనమును శ్లాఘించుచు రాజుమనస్సున నామెయాకారము హత్తుకొనిపోవఁ బరిపరివిధముల వర్ణించి "యెదుటి కేల పోలే" దని యడిగెద వేమో" యని శంకించుకొని—

ఉ. స్వైరవిహారధీరలగు సారసలోచన లున్నచోటికిన్
భోరున లాఁతివారు చొరఁబూనినచో రసభంగ మంచు నేఁ
జేరక పువ్వుఁదీవియలచెంతనె నిల్చి లతాంగిరూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక! నీకుఁ జెప్పఁగన్.

అని పలికినాఁడు. నవ = క్రొత్తవగు, అంబురుహ = తామరలవంటి, అంబక = కన్నులుగల యో వసురాజా స్వైరవిహారధీరలు = యథేచ్ఛముగా విహరించుటయందు - ధీరలు - అనఁగా ఎట్టిజంకును లేక యథేష్టముగా విహరించువారు, అయిన సారసలోచనలు = స్త్రీలు, ఉన్నచోటికిన్, భోరునన్ = ఆకస్మికముగా, లాఁతివారు = ఇతర పురుషులు, చొరఁబూనినచోన్ = ప్రవేశింప నెంచిన యెడ, రసభంగము = వైరస్యము (రసాభాసము) అంచున్ = అనుకొనుచుఁ నేన్, చేరక = వారినిసమీపింపక, పువ్వుఁదీవియలచెంతనె, నిల్చి, లతాంగిరూపు = ఆచిన్నదాని యాకృతిని, కన్గొనఁగన్, చూచి సిగ్గున్, దెల్పఁగన్, వచ్చితిని. అని ప్రకృతమగు వసురాజుపరముగా నొకయర్థమును ముందు వివరించి, తిమ్మజగపతిప్రభువు లింకేమైన నిందు విశేషార్థము లున్నవా? యని ప్రశ్నింప కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రభువులకు వినెడి యోపిక యున్నచో అప్రకృతశ్లేషార్థము లెన్నియేని గలవు. వినిపింతు ననె - విష్ణుపక్షముగా - నవాంబురుహాంబకా = వికసించిన కమలములవంటి కన్నులు గలవాఁడా, కమలాక్షా! స్వైరవిహారధీరలు = స్వేచ్ఛావిహారమున ధీరయగు లక్ష్మీస్వరూపమైన - సారసలోచనలు = స్త్రీలు - అనగా ఆస్త్రీలందఱును లక్ష్మీస్వరూపలే కావున, అన్యుఁడనగు నేను దరియుట రసాభాసమని తలఁచితి నని యొకయర్థము. నవ - అంబురుహా = నీటియందుఁ బుట్టినాఁడగు నగ్ని (ని. కృపీటయోని ర్జ్వలనః - అమరము) అంబక = నేత్రమునఁగల శంకరా! - స్వైరవిహారధీరలు = స్వర్గమర్త్య పాతాళ లోకములందుఁ దనయిచ్ఛ వచ్చినట్లు ప్రవహింప ధీరయైన గంగాదేవి రూపములైన, సారసలోచన లున్నచోటికిన్ - అని యీశ్వరపక్షమున నింకొకయర్థము - నవ - అంబురుహా = తామరపువ్వు, అంబక = బాణముగాఁ గల మన్మథుఁడా! (న. అంబకం నేత్రశరయోః, విశ్వము.) స్వైరవిహారధీరలు = స్వేచ్ఛా

విహార మొనర్చు ధీరయగు రతిదేవిరూపము లైన - సారసలోచన -
ఁని వేఱొకయర్థము" అని యింకను జెప్పఁబోవుచుండ
"శ్లేషార్థములేనా? కావ్య జీవిత మగు వ్యంగ్యమే మైనను గలదా
శాస్త్రిగారూ" యని ప్రభువు ప్రశ్నింప - దానికి మాత్రము కొదవ
యేమి ప్రభూ? యని - "సారసలోచన" లున్నచోటికి ఇతరులు
పోయినచో ఆశబ్దమునందుఁ గల రసశబ్దమునకు భంగము కలుగఁగా
సారసలోచనలు = నీఁ డెవ్వఁడు? ఎందుల కిటకు వచ్చె? అని
యాలోచనతోఁ గూడినవా రగుదు రని నేను జేరఁ బోవలే దని
యభిధామూలక వ్యంగ్య మొకటియు, దానిరూపు = కన్యకలను
పెండ్లి యగుపర్యంతము మెడలోఁ దల్లి గట్టెడి బంగరుచిన్ననగను,
కన్నారఁగఁ జూచి = భ్రమప్రమాదములు లేనట్లు స్పష్టముగాఁ
జూచి, నీకుఁ దెల్ప వచ్చితిని. ఆమెయవివాహిత - నీవు పెండ్లాడఁ
దగినది యని లక్షణామూలకవ్యంగ్యము మఱొకటియు - పువ్వుఁ
దీవియల చెంత నిల్చి - యాతీవెలకును, నామెకును సామ్య మెంతవఱ
కున్నదో యని కన్నారఁగ - ఉపమానోపమేయపదార్థములను
బరిశీలించి, పరిశీలించి చూచి - యామె లతవంటి దేహముగలది -
యని నిశ్చయించుకొంటి నని యొకవ్యంగ్యమును - పూచినదీవెలతోఁ
బోల్చుటవలన - నామె నట్టిలతవంటి దేహముగలదే కాదు సుమా!
సర్వాభరణభూషితయై పూచినతీవవలె నుండు దేహముగలది యని
మఱొకవ్యంగ్యమును. "నీకుఁ దెల్పఁగ వచ్చితి" ననుటచే ఆమె
కర్హుఁడగుపతివి నీవే కావునఁ జెప్పవచ్చితినని వేఱొక వ్యంగ్యమును,
ఎదుటికిఁ బోయి ఆమె కులగోత్రాదికము లేల తెలిసికొనలే దందు
వేమో! "యత్ర మిత్రత్వ మిచ్ఛంతి తత్ర త్రీణి న కారయేత్ఁ
వాగ్వాద మర్థసంబంధం పరోక్షే దారభాషణం" అను సూక్తి
ననుసరించి నీపరోక్షమున నీభార్య కానున్న యామెతో సంభాషించుట
మిత్రలక్షణము కా దని సమీపింపలేదు. "అని మఱొక వ్యంగ్యము"

ఈవ్యంగ్యమునుండి నీవుకూడ వచ్చి యేదో యొకపూబోదలోఁ గూరుచుండి చూచుచుండుము. అప్పుడు నేను వారిని దగ్గఱికి యామెకులగోత్రాదికము లడిగి నీవు వినుచుండఁగనే వారివలనఁ దెలిసికొందును అని మఱొకవ్యంగ్యమును గల వని కృష్ణమూర్తి శాస్త్రిగారు చెప్పఁగా - తిమ్మజగపతి మహారాజుగారు బ్రహ్మానంద మొంది వసుచరిత్రను మెచ్చుకొనుచు శాస్త్రిగారిని సత్కరించిరఁట. ఇట్లు సహృదయులగు ప్రాజ్ఞు లెన్ని యర్థములు, ఎన్నివ్యంగ్యములు సరసముగాఁ జెప్పినను లక్ష్యముగా నిలుచునట్టి సాహితీరస సంపన్నము వసుచరిత్రము కావుననే, చంద్రికాపరిణయము, కవిరాజ మనోరంజనము, శకుంతలాపరిణయము (పెద్దాడనాగరాజామాత్యునిది) రసికజనమనోభిరామము మున్నగు నెన్నో ప్రబంధములు పిల్లవసు చరిత్రము లనుపేరితో వెలువడుట కలిగినది. అవి యెంతవఱకుఁ గృతార్థము లైనవో సహృదయులే ప్రమాణము.

తెలుఁగుకవు లనుసరించుట, అనుకరించుట మాత్రమే కాక సంస్కృతములోనికి ననువదించుట యనుమహాభాగ్య మీవసుచరిత్ర మున కొక్కదానికే కల్గినది. ఆకావ్యమునం దెంతటివిశేషములు లేకయే యప్పయదీక్షితులవారివలన విద్యలను, మంత్రోపదేశమును బొందిన కాళహస్తికవి యనుపండితకవి సంస్కృతభాషయం దనువదించినాఁడు. అంతియ కాక "తమిళము, కన్నడమునంటి భారతీయభాషలందే కాక, కొంతవఱకు కాంగ్లభాషలోనికిఁ గూడ అనూదిత మైనది" అని వసుచరిత్ర చతుర్థముద్రణము పీఠికయందు నిడుదవోలు వెంకటరావుగారు వ్రాసియున్నారు. ఇంత జగద్వ్యాపకముగా నన్నిభాషలలోనికి ననూదితమైనది వసుచరిత్ర మనిన దాని యందలి గుణవిశేషము వేఱ చెప్ప నేల!

వసురాజును గిరికయుఁ బరస్పరము ననురాగము తేటపడఁ జూచుకొన్నారు. చెలికత్తెల నర్మోక్తులకు గిరిక సిగ్గునఁ దెరచాటున

కే: గఁ వను రాజు "ప్రాణసఖులార! నెయ్యంపుటలుకఁ బూని యేల యీబాల యీవేళ నీవిశాల యవనికాభ్యంతరమ్మున కరిగె" నని ప్రశ్నించుచున్నాఁడు 'కలహంసి' యను నొకచెలికత్తె వచ్చి గిరికతో "కుమారి! మునీంద్రులు నిన్ను దీవించుచు కల్పవృక్షకుసుమము లిచ్చిరి. వానిని స్వీకరింప మీయమ్మ నిన్నుఁ దోడ్కొని రమ్మనిన" దని యామెను దోడ్కొని పోవుచుండ, అంతకు మున్ను రాజుచేఁ బ్రశ్నింపఁబడిన యాచెలికత్తె వెనుకనుఁ జేయి పట్టి "తరుణీ! రాజు నిన్ననుసరమే పోవుట తగవా? లోకులు నిన్ను నవ్వుదురు. నిందింతురు సుమీ యని గిరికను బోకుండ నిలిపి, 'రాజా! మాచెలి మీఁది ప్రేమను నీమనమునఁ బాయకుండు' మని చెలులందఱితోఁ గలిసి యామెను దల్లికడకు దీసికొని పోవుచుండ—

చ. అలఘుపదాంగదధ్వనికి నంచలు మూఁగిన నిల్చి యొకమాఱు నెయ్యపుం
జెలువలఁ గూడఁ బిల్చుగతి (నొకమాఱును) చిల్కకుఁ బార్శ్వలవాంచలంబులన్
ఫలము దెమల్చురీతి (నొకమాఱును) నళిపంక్తికి మోము మలంచు కైవడిన్ (ఒకమాఱును)

కలికియు నానృపాలకుని గ్రమ్మఱఁ జూచుచు నేర్పుతో నేఁగినది. ఇఁక రాజునకుఁ గలిగిన వియోగతాపమునకు మితి యుండునా? ఆవియోగతాపముతోనే పట్టనము చేరుకొని మలమల నేఁగిపోవుచుండెను. అచ్చటి యాతనిమనోభావములును, జేష్టలును నైషధమందలి విరహాతప్తుఁడగు నలుని చేష్టాకులవలె స్ఫురించును. రాజును విడిచి వెళ్లునపుడు గిరిక నేర్పుతోఁ దిరిగి తిరిగి రాజును జూచుచు వెళ్లుఘట్టము చదువుచుండ — దుష్యంతునితోఁ బ్రథమ సమాగమైనపిదప శకుంతల వెళ్లిపోవుచు—

"దర్భాంకురేణ చరణః క్షత ఇత్యకాండే, తన్వీ స్థితా కతిచిదేవ పదాని గత్వా
ఆసీ ద్వివృత్తవదనా చ విమోచయంతీ, శాఖాసు వల్కలమసక్తమపి ద్రుమాణాం."

(దర్భలు లేని మార్గమున వెళ్లుచున్నను పాదమున దర్భకొనః గ్రుచ్చుకొనిన ట్లాకమా ఆఁగియు, చెట్లకొమ్మలందుఁ జీరకొంగు దగులుకొనకున్నను, తగులుకొని న ట్లాకమాఱును, ముఖము వెనుకకుఁ ద్రిప్పి రాజును జూచుచు నేఁగినది- అను శాకుంతల నాటకములోని సందర్భము మనస్సునకు స్ఫురింపకమానదు. మఱియు మంజువాణి రాజునొద్ద కాకాశమార్గమున వెళ్లుచున్నప్పుడు క్రిందనుండు భూమిభాగ మెట్లు తనకుఁ గనఁబడినదో చెప్పిన పద్యములోని వర్ణనము - దుష్యంతుఁడు స్వర్గమునుండి రథము నెక్కి భూలోకమునకు దిగి వచ్చుచున్నప్పుడు భూమి యెట్లు కనఁబడుచున్నదో చెప్పిన వర్ణనమును తలఁపునకుఁ దెచ్చుచున్నది, చూడుఁడు.

......పొలంతుకలార! కార్యవేగమ్మున నంబరోత్పతనకౌశల మందిరిఁ దక్షిణంబునన్" అని మంజువాణి తాను వసురాజును జూడ నేఁగినప్పు డేమైనదో యారంభమునుండి చెలులతోఁ జెప్పుచున్నది. చెలులారా! తొందరగాఁ బోవలె నని యాకాశమున కెగిరితిని. అ ట్లెగురు నప్పుడు—

సీ॥ బడి వాయ కిల నగపఙ్క్తితితో జివ్వున నెగిరినట్లై తోఁచు మగువలార!
పైపై సమీరణార్భటి నింగి బోరన నఱచినట్లై తోఁచు నతివలార!
నిఖిలభూములు జవనిక వాప దాపున నెదిరినట్లై తోఁచు నింతులార!
చనఁజన వెడఁదయై శశిమేను గ్రిక్కి-నఁ బెరిఁగినట్లై తోఁచుఁ దరుణులార!

కొండ లచ్చనగండ్లయి నిండుచెఱువుఁ లెల్ల సద్దంపు బిళ్లలై
యేర్లు ముత్తె
యంపుసరులై యరణ్యంపుగుంపు లెల్లఁ, నారులై తోఁచుఁ
బొడుపున సారులార !

కొండలతోఁగూడ నీభూమి నా వెంబడినే ఆవ్వైన నెగిరిన ట్లయినది. మీఁదిమీఁదికిఁ బోవుచుండ గాలియొక్క తాఁకిడిచే ఆకాశము బోరు నని యఱచిన ట్లయినది. తెర దీసిన బయలుపడినట్లు సకలభూములును నా కెదురు వచ్చుచున్న ట్లయినది. మీఁదికి వెళ్లఁగా వెళ్లఁగా చంద్రునిస్వరూపము విశాలమై, క్షణములో. పెరిఁగిన ట్లయినది - క్రిందికిఁ జూతును గదా కొండ లన్నియి అచ్చనగాయలవలెను, నిండి యున్న పెద్దపెద్దచెఱువు లద్దపుబిళ్లలవలెను, నదు లన్నియు ముత్యాల దండలవలెను, అడవులగుంపులు నారుమళ్లవలెను గనఁబడినవి అని చెప్పినది. కవి తన భావనాబలమున నాకసమున కెగిరి క్రిందికిఁ జూచి యప్పటిదృశ్యమును మంజువాణినోటఁ జెప్పించినాఁడు.

కాళిదాసుకూడ - ఆకసమునుండి దిగుచున్న దుష్యంతునకు భూమి యెట్లు కనఁబడెనో వర్ణించెను.

"శైలానా మవరోహతీవ శిఖరా దున్మజ్జతాం మేదినీ
పర్ణాభ్యంతరలీనతాం విజహాతి స్కంధోదయా త్పాదపాః
సంతానై స్తనుభావ నష్టసలిలా వ్యక్తిం వ్రజంత్యాపగాః
కేనా ప్యుత్క్షిపతేవ మర్త్యభువనం మత్పార్శ్వ మానీయతే.

(కొండలు మీఁదికి లేచుచున్న ట్లుండ - ఆకొండలనుండి భూమి క్రిందికి దిగిపోవుచున్న ట్లున్నది. ఆకులగుంపులలో నణఁగి యున్న ట్లున్నచెట్లు క్రమముగా స్కంధములు బయల్పడి, కనఁబడుచుండెను. సూక్ష్మముగాఁ గనఁబడుచున్న నదులు నీటితో విశాలములై కనఁబడుచున్నవి. భూమిని జేతఁబట్టుకొని యెవఁడో విసరివేసిన

ట్లతిత్వరగముగా నావంకకు వచ్చుచున్నది.) అని. ఇందు దుష్యంతుఁ డాకసమునుండి భూమికి వేగముగా దిగుట వర్ణ్యము. మంజువాణి ముందుగా నాకసమున కెగురుట, పిదప తిర్యగ్గమనము వర్ణ్యములు.

రామభూషణుఁడు కాళిదాసు ననుకరించుటలో - తన కావ్యమున నాటకీయత చూపవలె నను వేడుకయే హేతువు. సర్వనాటకములలో మిన్నయైన శాకుంతలమునే యీకారణమున నందం దనుకరించుచు వచ్చెను, కాని యస్వతంత్రుఁడై కాదు. ఆంధ్రకవులకు సంస్కృత దృశ్య శ్రవ్య కావ్యముల ఛాయలు తమప్రబంధములందుఁ బ్రదర్శించుట యొకవినోదముగా నాకాలమున నున్నట్లగపడును. శ్రీనాథుఁడు కాశీఖండమున మయూరుని సూర్యశతకమును, అనర్ఘరాఘవోత్తరరామచరిత నాటకములను నెన్నితావులందు ననుసరింపలేదు! అంతమాత్రమున నాతని ప్రతిభకు లోపము కల్గెననవచ్చునా? అట్లే యీతఁడును బ్రాచీనుల భావచ్ఛాయల నరిగినాఁ డనఁదగును.

ఆరంభమునుండియు వసుచరిత్రమే చదువుకొనుచున్నా మను పాఠకులకు స్ఫురించునంతగా ననుకరించిన చంద్రికాపరిణయమున, జతుర్థాశ్వాస మంతయు యమకాలంకారభూయిష్ఠ మయిఁ వసుచరిత్రముకంటెఁ గొంత వైలక్షణ్యము కనఁబడుచున్నను, నా రెండిటికిని గల తారతమ్యము తెలియుటకై యొకటి రెండు పద్యములుమాత్రము చూపెదను.

మ. కమనీయాకృతి యోగ్యకీర్తనములన్ గన్పట్టు నాశ్యామ, యా
సుమబాణాంబక, యాయమూల్యమణి, యాచొక్కంపుఁ
బూబంతి, యా
సుమనోవల్లరి, యాసుధాసరసి, యాసొంపొందుడాల్దీవి, యా
కొమగుంబ్రాయపురంభ, యాచిగురుటాకుంబోఁడి నీకే తగున్.

అని వసుచరిత్రము - ఇందలి శ్యామ, సుమబాణాంబక, అమూల్యమణి, చొక్కంపుఁబూబంతి మున్నగునవి ప్రత్యేకముగా స్త్రీపర్యాయము

లగుచు - దేహము, కన్నులు, అధరము, స్తనములు, బాహువులు, నాభి, జఘనము, ఊరువులు, పాదములును స్ఫురించును. సమాన పదార్థము లగుటయే కాక శీర్షాదిపాదావధిగాఁ గల యవయవములను గ్రమము తప్పకుండఁ దెలుపుటచే గిరికయొక్క కమనీయాకృతి యెల్లఁ జిత్తరువునవలెఁ జిత్రింపఁబడిన చమత్కృతి నిరుపమము గదా!
ఈపద్యమువలె రచింపబడిన చంద్రికాపరిణయపద్యమును జూతము.

చ. అలఘు మనోభవోదయకరాంగయుతిన్ దగు నామిళింద కుం
తల, నలమీన నేత్రి, నలతామరసానన, నాపికారవో
జ్జ్వలవరమంజులాబ్జగళ సంగత, నాబిసబాహ నొప్రవా
ళలలితపాద నాచెలిఁ దలంపఁగ నీకె తగున్ నృపాలకా.

అనికలదు. వసుచరిత్రమునందు సుమబాణాంబక, అమూల్యమణీ, చొక్కంపుఁబూఁబంతి, మున్నగు సమాసములు ప్రత్యేకముగా స్త్రీవాచకము లగుచు - అంబక, మణి, పూఁబంతి - మున్నగు నేకదేశగతము లయినపదములు, స్త్రీయొక్క యవయవములను శీర్షాదిపాదపర్యంతము స్ఫురింపఁజేయుచు - పరిపూర్ణాకారము చూపినట్లే. యీచంద్రికాపరిణయపద్యమున "మిళింద" "కుంత" లాది సమాసములు ప్రత్యేకము స్త్రీవాచకము లగుచు - పూర్వపదము లగుతుమ్మెదలు, మీనములు, తామరలు, పికములు మున్నగునవి తత్తదవయవముల కుపమానము లగుటయేకాక యవి యన్నియు మన్మథపరివారమగు పదార్థము లగుటచే ఉద్దీపనవిభావములై మనోభవోదయము - అనఁగా కామమును బుట్టించుచున్నవి అని భంగ్యంతరమైన చమత్కృతికి హేతువు లైనవి. వసుచరిత్రములోని విశేషణములవలెఁగాక చంద్రికాపరిణయమందలి "పికారవోజ్జ్వలవరమంజులాబ్జగళసంగత" వంటి యితరవిశేషణములు కొన్ని వినఁగనే స్త్రీపర్యాయములే యిపి యనుసర్థముసకు ఝటితిస్ఫూర్తి లేకున్నది.

ఈపద్యమునందలి కేవలము శబ్దముల మార్పునకే మోహమొంది యవయవక్రమస్ఫూర్తి మున్నగువానికై చూడక వట్టిస్త్రీవాచక పదములతోనే కూర్చియుంచి తిమ్మకవి తన రుక్మిణీపరిణయాది కావ్యములం దొక్కొక్క పద్యమును రచించుకొనె నన వసుచరిత్రప్రశస్తి చెప్ప నెందులకు? ఇవిగోఁ బరిశీలింపుఁడు.

శా. ఆకాంతామణి, యాబుధద్విరదకుంభాంచన్మహావారోజ, యా
రాకాచంద్రనిభాస్య, యారమణి, యారాజీవపత్రాక్షి, యా
శ్రీకారోపమకర్ణ యాచెలువ, యాశృంగారవారాశి, యా
లోకస్తుత్యచరిత్ర నీకుఁ దగుఁ బల్కన్ వేయు నిం కేటికిన్.

అని రుక్మిణీపరిణయమునను—

మ. పలుకుల్ వేయు నిఁ కేల భూరమణ! యాబంగారుకీల్బొమ్మ, యా
వలికన్నింపుటనంటి క్రొమ్మొలక, యావాల్గంటి, యాశ్యామ, యా
యలివేణీజనచూళికాభరణ, మయ్యంభోజపత్రాక్షి, యా
తలిరుంబ్రాయపుఁ గల్కిరాచిలుక యావన్వంగి నీకే తగున్.

అని రసికజనమనోభిరామమునను —

మ. పలుకుల్ వేయు నిఁ కేల యాచెలువ, యాబంగారుకీల్బొమ్మ, యా
కులుకుంబ్రాయపుఁగల్కి యావలఁతి, యాగొజ్జంగపూబంతి, యా
యలరుంబోఁడులమిన్న, యాముగుద, యాయందంపురాచిల్క, యా
వలపుంగప్రపుదీవి, యామగువ యావాల్గంటి నీకే తగున్ ॥

అని అచ్చతెనుఁగుకృతి యగు 'నీలాసుందరీపరిణయమునను' రచించుకొననిదే తిమ్మకవి యంతవాఁడు తృప్తిపడలేక పోయినాఁడు.

మనుచరిత్రమున......విద్యుల్లతావిగ్రహన్, శతపత్రేక్షణఁ,

జంచరీక చికురన్, జంద్రాస్యం జక్ర స్తనిన్, నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్... అను పద్యమునకుం బ్రతిబింబముగా మూర్తికవి—

చ. తరువులపొంతం బొంచి వసుధావరమిత్రుండు గాంచె నచ్చటన్
దరుణిం దమోలినీలకచం దామరసోదరసోదరప్రభన్
దుళివిలోచనన్ దతనితంబం దటిన్నిభగాత్రవల్లరిన్
దరుణిశశాంకఫాల నొకతన్విం దరంగవళిన్ దలోదరిన్".

అని రచించుకొనినాం డని కొందఱందురు. మనుచరిత్రపద్యమున నాల్గవపాదమునం దక్క 'నేకహ'లాది పరప్రయోగము లేదు. ఇందు సంగీతమునకు సహాయపడు లయవిశేషముగూడ నుండుటయు, 'త'కారాదిపదములతోనే యాద్యంతము రచింపఁబడుటయు విశేషము. అంతియఁ కాక చంద్రికాపరిణయమును, పెద్దాడ నాగరాజామాత్యుని శకుంతలాపరిణయమును, మనుచరిత్రమునడకను విడిచి, వసుచరిత్ర యడుగుజాడలలోనే పయనించుట యరయఁగా వసుచరిత్రమే, తనపిమ్మటికవుల మనస్సుల నాకర్షించిన దన్నమాట.

వసుచరిత్రము ననుకరించుచునే తనయనుకరణమున విశేషము చూపనెంచి చంద్రికాపరిణయమున (శ్రీ) సురభిమాధరాయ ప్రభువు—

చ. హరిముఖనేత సూప వసుధాధిపచంద్రుండు గాంచె ముంగలన్
హరిసిభమధ్యమన్ హరికరాద్భుత శంఖసమానకంధరన్
హరిజయశాలివాణి హరివంశుకవైరి శరాసనుభ్రువున్
హరిణసపత్న నేత్ర హరిణాంకముఖిన్ హరినీలకుంతలన్. 3. 45.

అని "హ, రి" యను రెండువర్ణము లాదిని గలశబ్దములకూర్పుతో - చంద్రికయొక్క నడుము మొదలు శేశావధిగా నొకక్రమముగూడ నుండునట్లు వర్ణించెను. ఇందు, హరిశబ్దము - 1 గుఱ్ఱము 2 సింహము 3 విష్ణువు 4 చిలుక 5 ఇంద్రుండు అను నర్థములందుం బ్రయుక్తమైనది.

హారిదంశుక = (హరిత్ + అంశుక) దిగంబరుఁడగు శివునకు, వైరి = పగవాఁడగు మన్మథునియొక్క శరాస = విల్లువంటి, సుభ్రువున్ = చక్కని కనుబొమలుఁగలది - యనియర్థము.

'ఏకహ'లాదులగు పదముల ప్రయోగముగల యీపక్కి మనోహరము గాకున్న శకుంతలాపరిణయమున -నాగరాజామాత్యుఁడు నేల స్వీకరించును? చూడుఁడు.

చ. కనియెఁ గనత్కపోలవలఁ, గంజవిలోచనఁ గంబుకంఠిఁ, గాం
చనసుమదామఁ గర్కశ కుచద్వయఁ, గజ్జలకైశికన్, గల
స్వనఁ, గనకాభదేహఁ గరిసన్నిభయానఁ, గళాధరోపమా
ననఁ, గమనీయభూషణగణన్, గలికిన్, గరభోరుఁ, గన్యకన్"-

ఇందు 'క'కారాదియగు పదములే, వసుచరిత్రమందు 'త'కారాదిపదము లున్నట్లే యున్నవి-

ఇట్టియనుకరణములు లోపముగా నెంచుట గాదు. అంతటి మహాకవులకుఁగూడ సంమోహనమైనది వసుచరిత్రలోని పద్యము లందలి పదములగుంఫన మని తెలియఁదగును ఇట్టిచిత్రముల నెత్తి చూపుట సహృదయులు పరిశీలింపుఁడని వెల్లడించుట కనిమాత్రము తెలియఁదగును. ఈవసుచరిత్రమును గూర్చి బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు ప్రత్యేకము విమర్శనగ్రంథ మొకటి యెంతయో విపులముగా వ్రాసియున్నారు. నాయనుభవము ననుసరించి యేవియో నాభావములను గొన్నిటిమాత్రమే యిందుఁ జూపితిని. గ్రంథ మాద్యంతము విమర్శించుట కిది తావుగాదు. కావున సాహితీరసమున కాకర మనఁదగు నీగ్రంథమును బరిపూర్ణముగాఁ బరిశీలించి యానందరసతన్మయులు కండని యాభారము సహృదయులగు కవిపండితులకే వదలి హరిశ్చంద్రనలోపాఖ్యానమునుగూర్చి స్థాలీపులాకముగాఁ గొంచెము విన్నవించుకొందును.

రామరాజభూషణుడు నరసభూపాలీయమువంటి యలంకార శాస్త్రగ్రంథము రచించినను ద్వ్యర్థి కావ్యమగు హరిశ్చంద్రనలోపాఖ్యానమువంటి దుష్కరరచనము నొనరించినను, నాతని విజయధ్వజము వసుచరిత్రయే. అదియే యాతనికీర్తిపతాక, యనకతేజము. ధర్మార్థకామములను సంపూర్ణముగా సేవించి, ప్రాయము మైవ్రాలుస్థితియం దీహరిశ్చంద్రనలోపాఖ్యాన రచనమునకుఁ గడంగినట్లు - మున్ను తెలిపితిని.

ఒకనాఁడు స్వప్నమందుఁ దనయుపాస్యదైవతమగు నాంజనేయమూర్తి బ్రహ్మచారి రూపమున సాక్షాత్కరించి - (శ్రీ)రామభూషణ! వచః(శ్రీ)రసపోషణ! బళీ! హరిశ్చంద్రనలక్ష్మారమణ చరితయుగ కావ్యారంభము పూని తమపమాద్భుతశక్తిన్— అని మెచ్చుకొని యాంతని రామభక్తిని, సంతానపంచకసిద్ధిని శ్లాఘించి ఈహరిశ్చంద్ర నలకథాయుగనిబంధచిత్రబంధ ప్రబంధ, మంకిత మొనర్పు రఘుభర్తకఖిలకర్తకు, నని యానతీయఁగా మూర్తికవి రామనామాంకితముగాఁ దానిని రచించినాఁడు. "హరిశ్చంద్ర నల కథాయుగనిబంధబంధ చిత్రప్రబంధము" అని పాఠాంతర మున్నదఁట. అదియే వాస్తవమనిపించుచున్నది. ద్వ్యర్థికావ్యము చిత్రకావ్యమే కాని రసవత్కావ్యమన వీలులే దనియు, రసము మాట యటుండ - అలంకారమునకుఁ గాని, రీతికిఁ గాని, గుణమునకుఁ గాని, శయ్యకుఁ గాని యందు స్వేచ్ఛ యుండదు. అది కేవలము సర్కసులోఁ బ్రదర్శించు నలోకసామాన్యకృత్యములవంటిది యని కొంద అందురు. కావచ్చును. కాని యుభయభాషలయందు నెంత స్వాతంత్ర్యము లేనిదే యట్టిపనికిఁ గవి పూనుకొనఁడు గాదా? శ్లేషకావ్యము భాషయందలి సందిగ్ధములగు పెక్కుపదముల వాస్తవస్వరూపము కనుఁగొనుటకుఁ బెద్ద యాధారమగు నని బ్ర॥(శ్రీ) వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రుల

వారు హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికయం దెంతయో విపులముగఁ జర్చించి చూపి యున్నారు. అంతియ కాదు. విరుద్ధములగు రెండుఘట్టము లెత్తికొని యొకపద్యమున నే యేరసమున కారసమును స్ఫుటముగా చూపుట యన దుష్కరము. అట్టిపట్టు లరసినపుడు సహృదయులహృదయములు పులకింపక మానవు. మచ్చున కొక పద్యము చూపెదను.

హరిశ్చంద్రపక్షమున స్మశానవర్ణనము, నలపక్షమున అయోధ్యాపుర వర్ణనము.

సీ. శూలశయాభీల శూర దుర్వారంబు, భూరిమాయుగతి
ప్రభూషితంబు
రాజితనానాస్థిరాజిపరికరంబు, నవతరసాతి నందద్ద్విజంబు
ఘననాట్యభూతావికారవవాచాల మధికరక్తాశ్మదీప్తాడిరంబు
పాృజ్యధూమనిరంతరచితానలవితాన, మనవధికార్తస్వరాభిపూర్ణ
మలఘుభూతి యగణ్యపుణ్యజనపాణికాస మసనం బయోధ్య
ధైర్యాసమాన
మంత్రికృత్యాస్పద సుమాన మానసాబ్జ గుంభితాశ్చర్యుఁడై కనుం
గొనుచు వచ్చి 5:6.

హరిశ్చంద్ర కథయందు- శూలములందు అనఁగా కొఱ్ఱులందు, పడియున్నవారిచేత - అనఁగా కొఱత వేయబడిన వారిచే భయం కరముగాఁ గనఁబడు శూలములు గలది, నక్కల సంచారముతో నిండి నది, పెక్కురీతులయిన యెముకల గుంపులు గలది, మాంసమును దినుచు నానందించు (రాబందు మొదలగు పక్షులుగలది, నాట్యమొ నర్చుచుఁ బెద్దగా ధ్వనించు పిశాచ పంక్తులు గలది, అధికమైన రక్త ముతో నిండిన వధ్యశిలలు గలది, అధికమగు ధూమముతో నెడతెగని చితాగ్నులుగలది, హద్దులేని దుఃఖార్తుల ధ్వనులతో నిండినది, గొప్ప

బూడిదగలది, రాక్షసుల కందఱకు ఆశ గలిగించునది, అప్రతిహతమగు ధైర్యముగల మాంత్రికుల కాస్పదమైనది స్మశానము—

నల కథాపక్షమున– శూలపాణివలె భయంకరులైన వీరభటులు గలది, అధికమగు లక్ష్మితోఁ గూడినదై మిగుల నలకరింపఁబడినది, మిక్కిలి నూతనములగు దానములచేత సంతసించు విప్రులు గలది, పదను పెట్టఁబడి బహువిధములైయున్న యుద్ధసాధనములు గలది, అధికమైన నాట్యభూము లందలి తాళధ్వనులుగలది, హెచ్చగు కెంపులచే మెఱయు ముంగిళ్లు గలది, ఆజ్యధూమములచే నధికముగా నొప్పారు త్రేతాగ్నులతోడి యజ్ఞములు గలది, బంగారముతో నిండినది, అమితమగు సంపదలుగలది, పుణ్యాత్ములైనజనులకు స్థానమైనది, ధీపులైన మంత్రులయొక్క రక్షాకృత్యముల కునికిపట్టయినది, అయోధ్య– ఈ పక్షమున - శూర=శూల. అని రలయోరభేదః)

హరిశ్చంద్ర కథాపక్షమున–నాద్యంతము భీభత్సము. నల కథాపక్షమున– సకల శ్రేష్ఠవస్తువులచే మనోహరము, సుదాత్తమునగు దృశ్యము. అది స్మశానము, ఇది ఋతుపర్ణుని యయోధ్యాపురము. "యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్త్యతే" యనిన ట్లాతని యిచ్చ వచ్చినట్లు తీర్పఁగలఁడు" అని కవినిగూర్చి చెప్పిన వాక్యమున కీపద్యము దృష్టాంతము. అట్టి యఘటనా ఘటనాపటువు రామరాజభూషణుఁ డని మచ్చున కీపద్యము చూపఁబడినది.

'దార' శబ్దమునుగూర్చి శబ్దవైచిత్రి. యీద్వ్యర్థికావ్యమున 'దార' యని నిర్ధారకముగా ఏకత్వమున వాడఁబడినదనియు, పుంలింగమును, నిత్యబహువచనాంతమునునగు 'దార'శబ్దము తెనుఁగున "దారములు" అగు ననిన అహోబలపండితుని వాక్యము సరికాదని వజ్ఝల వారు వ్రాసి, సర్వశబ్ద సంబోధినిలో ఆకారాంతం దార శబ్దము గలదని

సూచించిరి. ఆకారాంత స్త్రీలింగముగా నున్నట్లు అమరవ్యాఖ్యా యగు సుధ యందు- "టాలంతోఽపి క్రోత్రికా హోరా తథా దారా త్రయ ఏతే యథాక్రమమ్। క్రోశే రేహో రేచ దారేషు శబ్దాః ప్రోక్తా మనీషిభిః" ఇతి వ్యాడి శుభాంగా" అని యుండుటచేత నీరహస్య మెఱిఁగియే రామరాజభూషణుఁడు ప్రయోగించెను. పుంలింగ దార శబ్దము నిత్యబహువచనమే. దానికిఁ దెలుఁగున అనభిధాన శుని కాని అహోబలుఁ డనినట్లు "దారములు" అని కాని యుండుననియు 'దార' యనునది సుధావ్యాఖ్యాత చూపిన యాధారమున ఆకారాంత స్త్రీ లింగ శబ్దము వేఱయున్నదనియుఁ దెలియఁ దగును.

ఇట్టిదే అప్పుబ్దమును "అప్-శబ్దము సంస్కృతమున స్త్రీలింగ మును, నిత్యబహువచనము నని "ఆప స్త్రీ భూమ్ని వార్ వారి" అని అమరము. దాని తత్సమరూపము 'అప్పు' అను నేకవచనరూపము నీ కవి "అప్పుపాలైన శుభ్రాబ్జంబు రుచి యెంత" అని నరసభూపాలీయము నను, "తన కూర్మి జేఁ నప్పున నె ముంచె" అని వసుచరిత్రమునను బ్రయోగించెను. అహోబలుఁడు నిత్యబహువచన మగుటచే 'అప్పులు' అనియే యుండవలెనని యనినాఁడు. కాని వసుచరిత్రమున నేకవచనాం తము నిర్ధారకముగా నున్నది. ఇది ప్రథమైకవచనతుల్య ప్రాతిపది కము గాకఁ సంస్కృతిక ప్రాతిపదికతుల్య మనియు, విశేష మనియుఁ గ్రహింపఁ దగును. "క్వచి న్నామ గ్రహేణైవ ప్రయోగోత్రి హీఽలో భవేత్" అను అధర్వణకారికవలన సాధు వనుకొనఁ దగును. ఈకవిచేఁ బ్రయుక్తములైన ఆచ్ఛిక శబ్దములందలి పెక్కుచిత్రములను వజ్ఝల వారు పీఠికయందుఁ జర్చించి వ్యాకరణములకు వశము కానివి గూడ సాధువే యని స్థిరపఱచియున్నారు. 'ముసలిమానులు' అనునది శ్లేషా ర్థముగల పదము. అయ్యది వసు. 1-44 లోఁ బ్రయుక్తమై యొక యర్థ మునఁ దురక లనియు, రెండవ యర్థమున ముసలిచెట్లు' అనియు

గావలెను. అప్పుడు మన "ప్రాకులు" అనినగాని సాధువు గాదు. "మ్రాకులు" అనిన రెండవయర్థము చెడును. దీని ననుసరించి "క్రొత్త, క్రొత్త – ప్రాతపాత" అని రేఫరహితరూపాంతము లున్న విధమున మ్రాను, రూ, మాను అనియు, ఏకవచనమందువలెనే 'కుజ్జ' బహువచనమునఁగూడ వికల్ప మనియు గ్రహింపవలెను. ఇట్టివి రేఫద్వయ సమ్మేళనమునను సఖండాఖండ బిందుపదముల కూర్పికయందును గాన నగును. అవి శ్లేషానురోధమునఁ గలిగిన వని యంగీకరించుట యుచితము. అను ధాతు తుమున్నంత రూపమైన అనన్ అనుపదము వసు 2–12 లో మూర్తికవి "వలగొను నిన్నగంబు హిమవన్నగ 'మన్ ద' నరారు భూవరా" అని అన్ ప్రయోగించెను. అనన్–లోని వర్ణము లోపించునాధారము గాని ప్రయోగాంతరము కాని కానరాదు. "అను" అనునది ధాతుజ విశేషణ మనుకొని దాని యుత్వమునకు లోపము చేసి తనరు. అనునది కృదంతముగాఁ జేసి అనుతనరు అనెడి గొప్పతనము" అని వ్యాఖ్యానింపఁ దగునని కొందఱు సవరించిరి. కాని 'తనరు' ధాతువే కాని 'తనరు' అను కృదంతరూపము కనఁబడదు. ఒకవేళ నట్లుసరిపుచ్చినను 'ఆరు' ధాతు వకర్మక మగుటచే వాక్యసమన్వ యము కుదురదు. కావున "చనున్" అను పదము "విప్రసతికి" నూఱు లేఁడఁ జన్ వరములు "భార, సభా 2–263 లో 'చన్' అని పరిణమించినట్లే 'అనన్' అనునదియు 'అన్'గా మార్పుచెందినది యనుకోఁదగును.

సంస్కృత శబ్దములలో–లసమాన' అని లసధాతువు పరస్మై పదమై యుండ శానచీవచ్చుట అసంగతము. ఆశబ్దమును గొజ్జెగ మంచునన్ గలపి కూర్చినపుప్పొడితిన్నె బొందలా, మజ్జకకాయమాన లసమాన విమానము క్రింద నొక్క–పూఁసెజ్జ ఘటించి. (వసు.3.168) అనుపద్యమునఁ బ్రయోగించె నని కొందఱాక్షేపించిరి. కాని

తాచ్ఛీల్యవయోవచనశక్తిషు చానశ్ (3.2.129) అను పాణినీ బరసైస్మైపదధాతువుల మీఁదనైతము తాచ్ఛీల్యమున వచ్చు 'చానశ్' ప్రత్యయాంతము, కాని శానజంతము కాదు. కావున నది సాధువే ఇట్టి సంస్కృత వ్యాకరణ రహస్యము లాతని రచనలం దెన్నో కలవు. అవి యన్నియుఁ జూపి పాఠకులను విసిగింపఁ దలఁపను.

రామరాజ భూషణుఁడు తన కవితయం దేయే కావ్యగుణము లున్నవో కృతిపతియగు నరసాలుని వాక్యములుగాఁ దానే యిట్లు చెప్పుకొని యున్నాఁడు.

సీ॥ బాణ'వేగంబును' భవభూతి 'సుకుమారత'యు మాఘు శైత్యమ్ము దండి 'సమత'
యల మయూరుని 'సువర్ణకలన' చోరుని 'యర్థసంగ్రహంబు' మురారి 'శయ్య'నేర్పు
సోము "పరిపాంచబు" సోమయాజుల 'నియమంబు' భాస్కరుని 'సన్మార్గ' ఘటన
శ్రీనాథుని పదప్రసిద్ధ 'ధారాశుద్ధి' యమరేశ్వరుని 'సహస్రముఖ దృష్టి'
నీక కల - వటుగాన ననేక వదన సదన సంచారఖేదంబు సరలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె మూర్తికవిచంద్ర 'విఖ్యాత కీర్తిసాంద్ర'

అని.

ఇందుఁ గావ్యగుణము లొక్కటియే కాదు. శ్లేషార్థస్ఫూర్తిచే రామ భూషణునియందుఁ బుంజీభవించి యున్న సుగుణములును ధ్వనించుచు నాతని సాహితీ శక్తులను ప్రస్ఫుటము లొనర్చుచున్నవి.

సోమయాజుల నియమము - అనగా కుమ్మర గురవయ్య గంట మాగిపోకుండ భారత మంతయు తిక్కన రచన చేసినకథ మనసున

నుంచుకొని యంతటి వేగముతో వెనుకకు రాకుండ నెట్టి కావ్యమునైనను హేలగా రచించుటయే కాదు, ఆహితాగ్ని యగు తిక్కన సోమయాజి తన నిత్యజీవితమున నెంత సదాచారనిష్ఠ గలవాఁడో యట్టివాఁడు రామరాజ భూషణు డనియును ధ్వనించుచున్నది. అతఁ డాంజనేయ మంత్రోపాసకుఁడు. శ్రీరామ చరణారవింద పూజాతత్పరుఁడు. ఆస్తిక శిఖామణి. అంతియ కాదు. శ్రౌతమార్గ రహస్యముల నెఱిగినవాడు. సోమయాజుల కుండు నియమములను దెలిసినవాడు. 'వసుచరిత్రమున కోలాహలగిరిని వర్ణించు సందర్భమున సూర్యరశ్మి దగిలి మంటలు లేచిన సూర్యకాంత మణులయం దప్పుడే యీని చేపువచ్చిన చమరీమృగముల చనుఁబాలు పడఁగా- దేవతలది చూచి చెంగటి మునుల గృహములందలి ప్రవర్గ్యములు (ప్రధానయాగమున కంగమగు ప్రవర్గ్యమునం దగ్నిహోత్రములో పాలు హోమము చేయఁబడును కావున) అనుకొని యాకొం డమీఁదికి వచ్చుచున్నా"రను వాక్యములను వినినపెద్ద లెవరో యీ రహస్యము నెట్లెఱింగితి వని మూర్తికవి నడుగఁగా- ఆజ్ఞ యిచ్చినచో యాగ విధాన మంతయు మీ యెదుటఁ బ్రదర్శింతు నని శాలాప్రవేశము మొదలుపెట్టి యవభృథాంశమును ప్రాయశ్చిత్తము నకుఁ దావులేకుండ శుష్కేష్టి (మంత్రములుగాని, అగ్నులుగాని, పరికరములు గాని లేకయే క్రియాకలాప మంతయు జరుగుచున్న ట్లభినయించుట) చేసి చూపెనట. ఇది వాస్తవమా? కాదా? యనునది కాదు ప్రస్తుతము. ఈకథవలన నాఁడు వేదశాస్త్ర రహస్యములు శ్రౌతమర్మములు, స్వతః దెలిసినవాఁ డని తెలియుచున్నది. కావుననే యజ్ఞములను దనకావ్యమం దెన్నితావుల స్తుతిపరముగాఁ జెప్పెనో పరిశీలించిన ప్రాజ్ఞులకు విశద మగును. "జలదవ్రాతము నాత్మ కారిత మహాసత్రాగ్ని ధూమంబులన్." అనియు "అలసత్రాంచిత చైత్ర శాలికల

రిష్టాహారతృప్తిం గుతూహలమున్ గాంచుద్విజావళుల్ శ్రుతిహితా వ్యాజానులాపంబులన్" అనియు "ఇష్టకృత్యము నిర్వహించు గాని దినంబు శుచి మలీమసగతుల్ సూప వెఱచు" అనియు "లేజవరాలి పాణి... లాజిచయంబు భావిని నిఖిల క్రమభుక్తిని మంత్రగాఢత శ్రీ జనకంబు గాఁగ" అనియు"ఇష్టార్థసంసిద్ధి నిడియె వహ్ని" అనియు శ్లేష మూలకములైన యెన్నో తావులందుఁ బ్రసంగించుచునే వచ్చెను.

యజ్ఞములు వేదములు అను ప్రసంగము వచ్చినది కావున సాహితీరసమున కిపక్కృతమైనను రామభూషణుని ధారణాబలమును గూర్చిపండితజనశ్రుతియొకటి చెప్పవలసివచ్చినది. వేదమునకుఁగల యష్ట వికృతులతోఁ (పదక్రమ జటాదులతో) వేదపండితు లవధానము లొనర్చుట యరసి రామరాజభూషణుఁడు సంస్కృతప్రాకృతాంధ్ర పద్యములతో అష్టావధానమే కాక శతావధానముగూడఁ జేసిచూపె ననియు, నతఁడే యవధాన కవితకు మూలపురుషుఁ డనియు నొకప్రథ కలదు.

ఇట్లే గానవిద్యయందును క్రొత్తగా స్వరప్రసార మొనర్చి రాగములను సృష్టించి క్రొత్త కృతులను రచించుటయే కాక అంతకు మున్ను దేశమునం దంతట నుపయోగింపఁబడు రుద్రవీణయందుఁ బరిపూర్ణత గనఁబడక పోవుటచే శ్రుతికిని, లయకును బ్రక్కతంత్రుల నమర్చి, గ్రామత్రయ యుక్తముగా సరస్వతీవీణను సృజించి యా జంత్ర మునకుఁ బూర్ణరూప మొసంగెనని సంగీత విషయమునఁ గూడ నీతవిని గూర్చి జనశ్రుతి కలదు. ఇట్టి వన్నియు దంతకథలని యనవచ్చును. కాని యిట్టికథలకును నాతని కావ్యములకును గొంత కాకున్నఁ గొంతయేని సంబంధ ముండనిదే యివి పుట్టవు. పరిశీలించి బుద్ధిమంతులు నిర్ణయింతురుగాక.

మఱియు సరసభూపాలీయ కవితకు నాయీపరిశీలన ముపలక్షణము. అందును వసు చరిత్రమం దున్నన్ని కాకపోయినను రచనా చమత్కృతు లందును బహుళములుగాఁ గలవు. ప్రథమప్రయత్న సిద్ధములగు దానిలో బీజరూపముగా నున్న శ్లేషాదిగుణములు వసుచరిత్రమునఁ బుష్పించినవి, ఫలించినవి. అందలి సాహితీరసపోషణము ప్రత్యేకము వ్రాయఁదగిన దని యిందంతగా స్పృశింపఁబడ లేదు. హరిశ్చంద్రనలోపాఖ్యానమును నట్టిదే. తరముల వెంబడి రత్నదీపములై నిలిచిన, నిలుచున్న విలువఁగల యిట్టి కావ్యములను సృష్టిచేసి "సాహితీ రసపోషణ" బిరుదమును సార్థక మొనరించుకొని శ్లేషయమక చక్రవర్తి యనఁదగిన రామరాజభూషణుని ఋణము నాంధ్రు లెన్నితరములకైనను దీర్చుకొనఁగలరా? ఆతఁడంతటి మహానుభావుఁ డన్నమాట. సెలవు.



# వసుచరిత్ర తత్త్వము :

## రామరాజభూషణుని బ్రహ్మానుభూతిరాసిక్యము.

శ్రీ వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు, M. A.

"రామరాజభూషణుడు కవి; పండితుడు; లాక్షణికుడు బహుశాస్త్రకోవిదుడు; సాహిత్యరసపోషకుడు; సంగీతకళారహస్యనిధి; సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహకుడు" — ఈరీతిగా ఆయననుగూర్చి ఎంతేని చెప్పవచ్చును. చాలమంది చెప్పిరి – ఈ చెప్పుటయంతయు నొకయెత్తు. వయస్సుతో పాటు అనుభవమును, అనుభవముతోపాటు అంతరంగమును, అంతరంగముతోపాటు ఆత్మతత్త్వమును పండించుకొన్న ప్రౌఢకవిగా ఆతడు వసుచరిత్రతత్త్వమును దర్శించిన రీతినిగూర్చి చెప్పుట మఱియొక యెత్తు.

వసుచరిత్రము నూటికి నూఱుపాళ్లు శృంగారప్రబంధము. ప్రధానమగు రసము శృంగారమే. అట్టి ఈప్రబంధమునందు ఆత్మతత్త్వమును గూర్చియు ఆధ్యాత్మికకోశమును గూర్చియు ప్రాకు లాడుట అనావశ్యక మనిపించవచ్చును. అనిపించుటకేమి ? మనయిచ్చ వచ్చినట్లు ఏదియైనను మనకనావశ్యక మనిపించవచ్చును. కాని సాహిత్యమే ఒకతపస్సుగా పెక్కేండ్లు తపించి మనస్సు పండించుకొన్న పుణ్యుడును, లోకోత్తరమయిన భావనాధారను ప్రవహింపజేసిన ప్రౌఢభావుకుడును అగు ఒకసత్కవి అంతరంగమును సౌమనస్యముతో పరిశీలింపవలెను. సౌమనస్యముతో, సహృదయతతో, సానుభూతితో పరిశీలించుచు కవివెంట పయనించినచో ఆతడు లక్ష్యశుద్ధితో అందుకొన్న మహోన్నతశిఖరము మనకును గోచరింపకపోదు.

"శృంగార ప్రబంధములో ఆత్మతత్త్వప్రపంచనమా ?" ఇట్టి సందేహము వెలిబుచ్చుట శృంగారము కేవల శరీరమునకు మాత్రమే పరిమితమనియు, ఆత్మతో సంబంధము లేనిదనియు భావించుటయే. "అసలు ఆత్మయను నదొకటున్నదా ?" ... ఉన్నదన్న గాఢ విశ్వాసముతోనే ఋషితుల్యులగు మనప్రాచీనకవులు పలువురు కావ్యసృష్టి సాగించిరి. కనుక ఆమార్గములోనె వారి కావ్యములను పరిశీలింపక తప్పదు.

రామరాజభూషణుడు కూడ ఆగ్న సంప్రదాయములో పుట్టి పెరిగిన సత్కవి. మీదు మిక్కిలి బ్రిదుకులో పెక్కుసిలుగుల కోర్చి కవిత్వమొక కలగా కాక కఠినమగు తపస్సుగా భావించుకొన్నవాడు. అందువలననే శృంగారప్రధానమగు ప్రబంధమందు కూడ గిరికా వసురాజతత్త్వముల నావిష్కరించుచు సాంప్రదాయికమయిన ఆత్మతత్త్వమునే నిరూపించి వారిని బ్రహ్మానంద రసపిపాసువులనుగా చిత్రించెను.

ప్రాచీనులగు మనకవులలో పలుమంది బహుశాస్త్రములలో తలస్పర్శిపరిశ్రమము చేసినవారు. వైదిక లౌకిక వాఙ్మయములు, ఉపనిషత్సాహిత్యము, షడ్దర్శనమీమాంస, తర్కమీమాంసాద్యనేక శాస్త్రములు, యోగసిద్ధాంతరహస్యములు చిరకాలముగా మననము చేసి ఆత్మగతము గావించుకొన్నవారు. వారికావ్యములు పరిశీలించి చూచినచో తత్తద్రసోచితముగను, సందర్భానుసారముగను అనేక శాస్త్రవిషయములను నిక్షేపించినట్లు కానవగును. నిజమునకు ఒక కావ్యమునకు ప్రౌఢినాపాదించు గుణములలో సమగ్రమగు రసనిర్వాహణ పద్ధతియేకాక సముచితమగు శాస్త్రపాండిత్యము కూడ నొకటి. ప్రతిభావ్యుత్పత్తులు సమస్థాయిలో మేళవించిన సత్కవులలో కవితా

పాండిత్యములు అద్వైతసౌందర్యముతో సాక్షాత్కరించును. రామరాజభూషణు డీకోవకుచెందిన కవి.

ఆద్యంతము లాక్షణికమయిన చూపు కలవాడగుటచే దేనిని వాచ్యముగ చెప్పు నలవాటు లేనివాడు. తనకాలము వఱకు వ్యాప్తిలోనున్న కావ్యలక్షణ విశేషముల నన్నిటిని ఆఊపోశనము పట్టెను. భరత, భామహ, ఆనందవర్ధన, అభినవగుప్తపాదాదులను ఆత్మలో పొదివికొనెను. వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వనివిశేషములను సవిమర్శముగా పరిశీలించి రసధ్వని ప్రాధాన్యమును తన ప్రబంధమున నిరూపించుకొన్న నిశితబుద్ధి. ఔపనిషదవిజ్ఞానమునుగాని, యోగసూత్ర సిద్ధాంతములనుగాని సందర్భోచితముగ కథతో ననుసంధింపవలసి వచ్చినచో ధ్వనిమర్యాదకు వెలిగాని రీతిగా వానిని నిక్షేపించుట ఈసత్కవికి వెన్నతోపెట్టిన విద్య.

గిరికా వసురాజు లోకయింటి వారైరి. అప్పటివారి దాంపత్య సౌఖ్యమును కవి ఆంతరమయిన దృష్టితో వర్ణించెను. ఆంతరదృష్టిలేని వానికి అది వట్టి సంభోగశృంగారము. గిరిక, పతివలన సంభోగరహస్యమును గ్రహించి ప్రౌఢయైనది. ఒక్కొక్క ఆభరణము మొరయుచుండ, మణితాదిగళరవములు పతికి వినబడ, ఆనందాదిశయముతో కాటుక కంటినీరు మగని మొగముపయి పడగా పురుషాయితబంధముతో పెనగినవట. ఆపద్యమిది.

సతిసాహిత్య రహస్య మీశు వలనన్ సాధించి తోడ్తోన త
త్పతికిం బ్రత్యుపదేశ మిచ్చె నతులప్రౌఢిన్ "ధ్వనివ్యక్తిఁద
చ్ఛ్రుతికిం జొన్పుచు" లోచనాంజనరస ప్రోన్మేషముల్ తన్ముఖో
ద్గతముల్ సేయుచుఁ బ్రత్యలంకరణ మాచుర్యంబు దీపింపగన్.

(6–94)

ఈపద్యమందలి సాహిత్య, ధ్వనివ్యక్తి, శ్రుతి, అంజన (వ్యంజన) ర, సాలంకరణ శబ్దముల అర్థాంతర సామర్థ్యముచే కావ్యమందలి ధ్వని ప్రాధాన్యమును సూచించుట కవి యుద్దేశ్యము. ఈయర్థప్రతీతి యింత వఱకే యైనచో లాక్షణిక దృష్టిగల ఏసత్కవియైనను ఈమాత్రము పద్య మల్లగలడు. దీనికి రామరాజభూషణకవి దిగిరానక్కఱలేదు, కాని భూషణకవి దివ్యనేత్రములతో దర్శించిన గిరికావసురాజులు సామాన్యసతిపతులవలెగాక వాగర్థముల సంయోగమనదగిన పార్వతీ పరమేశ్వరులై కవికుల గురువునకువోలె కన్పట్టిరి. "ధ్వనివ్యక్తిఁ దచ్ఛ్రుతికిం జొన్పుచు" అనుచో 'ధ్వనివ్యక్తి'ని శ్రుతిశబ్దముతో సమన్వయించుటచే ధ్వనిమర్యాదను అలౌకికమయిన వైదికార్థమునకు సమన్వయించి మహోపదేశము చేయుటయు సంభావ్యము. ఈవైదికార్థ మేది? దాని నాతడెట్లు సమన్వయించి నిరూపించెను? అనునవి విజ్ఞేయములు.

గిరికా సంభోగ సౌఖ్యమును వర్ణింపవలయుచో "బాలయిట్లు సుఖాంబుధిఁ దేలుచుండి యంతగర్భిణియయ్యె" నని ఒక్కమాటలో ముగింపవచ్చును. చమత్కార మేమనగా అంతయయిన పిమ్మటకూడ ఆమె గర్భిణియయినట్లు చెప్పబడలేదు. గిరికావసురాజుల దాంపత్యము యొక్క పరమార్థము గిరిక గర్భిణియగుట కాదేమో! వ్యాసభారత మీయనుమానమునే బలపఱుచుచున్నది.

రామరాజభూషణుఁడు వసురాజదంపతుల సంభోగాంతసౌఖ్యము "బ్రహ్మానందానుభవంబు తెల్పె" నని వ్రాసెను. ఈబ్రహ్మానందానుభవ మతిశయోక్తి సూచకమని కొట్టివేయుటకు వీలుగాకున్నది. ఆవేద్యాంతరము, నిర్లేపకలాపము, క్రమవిముక్తానేక బంధానుసంధానము, అపునర్భవప్రభవఖేదము నయిన ఆనందమది. అనవద్యమై విజృంభించెనట!

"భూనాథాగ్రణికిన్ వధూమణికి సంభోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్ప ననవద్యంబై యవేద్యాంతరం
బై నిర్లేప లాపమై క్రియావిముక్తానేకబంధాను సం
ధానంబై యపునర్భవ ప్రభవఖేదంబై విజృంభించుచున్."

(6 – 95)

పెడినసంసర్గ సమూహములు, సడలిన బహుకర్మబంధములు, పునర్జన్మమువలని దుఃఖమే లేకపోవుట — ఈమహాగ్రంథమంతయు భావించుటకు దొరకొన్న వనిత ఒక్కసారిగా నట్టి ఔపనిషద కేదారమున నడుగుపెట్టును. ఆబ్రహ్మానందానుభూతిలక్షణమే అట్టిది.

ఔను! పార్వతీపరమేశ్వరులతో పోల్పదగిన యాపుణ్య దంపతులు "ఆనందో బ్రహ్మ" అను సత్యము మనసా భావించి యనుభవించిరి. నిజమే! సర్వభూతములు నానందమునుండియే ప్రభవించుచున్నవి. ఆనందమువలననే జీవించుచున్నవి. అటునిటు తిరుగాడి ఆనందోన్ముఖముగా సంచరించి తుదకాయానందము నందే ప్రవేశించు ననిగదా తైత్తిరీయము మన కుపదేశించునది!

'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ ।
ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే ।
ఆనందేన జాతాని జీవన్తి ।
ఆనందం ప్రయన్త్యభి సంవిశంతి ॥ తై — ఆనందవల్లి

ఇట్టి యర్థమును భావించినవాడు కనుకనే మమ్మటుడు కావ్యప్రకాశికలో దానిని మఱింత స్పష్టముచేసి రసానందలక్షణము నిర్వచింపబూనెను.

"సకలప్రయోజన మౌళిభూతం సమనన్తరమేవ రసాస్వాదన సముద్భూతం విగళితవేద్యాన్తర మానందమ్" కా॥ప్ర.

ఒక్కమమ్మటుడనియేమి? రసమును నిర్వచింపబూనిన పూర్వా

చార్యులందఱును దానిని బ్రహ్మాస్వాదసహోదర మనుచు కేవలాద్వైత బ్రహ్మకల్పము చేసిరి. అంతమాత్రమున విశిష్టలక్షణ బ్రహ్మోపాసకుల కనవద్యాత్వమును శంకింపనక్కఱలేదు. జ్ఞాతృజ్ఞానజ్ఞేయత్రిపు విశిష్టత నంగీకరించుచూ జ్ఞానమునకు కూడ ఆత్మధర్మత్వము సిద్ధించు నుగదా! ఈవిశిష్టతను మాత్రము జ్ఞప్తియందుంచుకొన్న తక్కిన రససామగ్రి సర్వము ఉభయులకు సమానమే యగుచున్నది. కనుక అనుభూతిలో భేదము లేదు.

భూ ష ణ క వి నానా రుచిరాగబంధురములయిన ఆయాయీ ఔపనిషద విజ్ఞానవిశేషమును లాక్షణికశంఖమున పోసి వసుచరిత్రమున దానిని తీర్థభూతము గావించెను.

ఇచ్చటి ఈబ్రహ్మానందానుభూతి ఇంత విలక్షణమయినదిగా కనిపించును.

౨

గిరికా వసురాజులు పొందిన సంభోగాంతసౌఖ్యము పునర్జన్మము వలన పుట్టెడుదుఃఖములేని బ్రహ్మానందమును తెలిపె న ని గ దా చెప్పబడెను! పునర్జన్మమును పోద్రోలగల సంయోగశృంగారము విలక్షణమయినది. ఆదంపతుల యాత్మపరిపాకము అనన్యసామాన్య మని భావింపదగియున్నది.

బ్రహ్మశబ్దము తత్త్వ తపో యోగవాచియునగును. అనగా నాదంపతుల యానందము తత్త్వతపోయోగ సంబంధమయినదియు కావచ్చును. గిరిక వసురాజు ధర్మపత్ని; అర్ధాంగి. అతడు తాత్త్వికుడు; తపస్వి; యోగి. ఒకరాజులో ఈలక్షణములు గోచరించినచో అతనిని

రాజర్షి యందురు. వసురాజిట్టి లక్షణములు కలవాడని వసుచరిత్రములో భూషణకవి అడుగడుగునను ధ్వనింపజేసెను.

వసురాజు నిట్లు చిత్రించుటలో కవి యుద్దేశించిన దేమి?

వసురాజు కథ భారతాంతర్గతము. అందలి సారభూతమయిన కథాపరిమార్థమును గ్రహించి కవి శృంగార ప్రబంధమున కనుకూలముగా కథను వర్ణనములను ప్రపంచించెను. వ్యాసుడు వసురాజును రాజర్షిగనే చిత్రించెను. నన్నయ కూడ నట్లే చిత్రించెను. చిత్రించుట యేమి? వాచ్యముగనే చెప్పిరి.

"ఏతే తస్యసుతా రాజన్ రాజర్షేః భూరి తేజసః
న్యవాసయన్ నామభిః స్వైస్తే దేశాంశ్చ పురాణిచ"
"యః పుమా నభవత్ తత్రితం సరాజర్షి సత్తమః
వసు ర్వసుపదే చక్రే సేనాపతి మరిందమః" –ఆదిపర్వాణి–
త్రిషష్టితమోధ్యాయః

"అట్లుపరిచరవసుండు లబ్ధసంతానుండయి రాజర్షియయి రాజ్యంబు సేయుచు" (ఆది 3–26) నని నన్నయ్య.

ఇట్టి రాజర్షిని శృంగారప్రబంధ నాయకునిగా స్వీకరించుటలో నెంతటి క్లేశమున్నదో భూషణకవికి తెలియును. అందుచేతనే ప్రతిపదమునను పరమజాగరూకుడై వర్తించెను.

"కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు. ఆద్యసత్కథలు వారిరి పుట్టురత్నములు; గాలి పోగుచేసి వ్రాసినకథలు గాజుపూసలు; మఱి పూర్వరాజాదుల చరిత్రములో! – వట్టి ముడిసరకు. కనుక ఆ యాదిరాజచరిత్రములకు సత్కవి రచనాలంకారమును సమకూర్పవలెను. అప్పుడవి సానలదీరిన జాతిరత్నము లగును."—భూషణకవి నమ్మిక ఇది. వసుచరిత్రము కేవలము కల్పనాకథ కాదు. ఆదిరాజ చరిత్రమే, కాని అందులో వట్టిముడిసరుకుగా ఇతరులను భ్రమింపజేయు

విషయము చాలగలదు. అట్లని ఆముదీసనకును విడిచిపెట్టినచో వ్యాసునకును, నన్నయకును, మీదుమిక్కిలి వసుచరిత్రమునకును మహోపచారము గావించిన పాపము తనతలకు చుట్టుకొనును. అందుచే ఆచరిత్రము నొకవంక శృంగారప్రబంధముగా రూపొందించుననే, మఱొకవంక వసురాజతత్త్వములో నిక్షేపింపబడిన భారతార్థమును వ్యంగ్యముగా దీపింపజేయుచు కథను సానలదీరిన జాతిరత్నముగా మలచెను.

మహాభారతములో తత్కర్తయయిన వేదవ్యాసుని జన్మమును సవిస్తరముగా చెప్పుసందర్భమున ఉపరిచర వసు మహారాజ వృత్తాంతము ప్రసక్తమయ్యెను. ఇదలి కథ మూడు భాగములుగా విభజింపదగియున్నది.

1. వసురాజు వేటకై అడవికి పోయి నిర్వేదముతో తపస్సుచేయబూనెను. ఇంద్రుడు మెచ్చి సఖ్యమొనర్చి పెక్కువరము లొసగెను. ఒక దివ్యవిమానముకూడ నిచ్చి తనయొద్దకు వచ్చుచుపోవుచుండుమనెను.

ఇంద్రుని వరమున వసురాజున కైదుగురు పుత్రులు పుట్టిరి. ఆవాసవులు వేఱువేఱు వంశకరులై పరగిరి. లబ్ధసంతానుడయిన ఆరాజర్షి రాజ్యముచేయు చుండెను.

2. ఒకనాడు శుక్తిమతిని కోలాహలుడు బలాత్కరించెను. వసురాజు వానిని తనపాదముతో తలగ ద్రోచెను. ఆనది కాపర్వతసమాగమమున వసుపదుడను కొడుకు, గిరికయను కూతురును పుట్టిరి. శుక్తిమతి కృతజ్ఞతతో వారిని వసురాజునకు కానికగా నిచ్చెను. అతడు వసుపదుని తనకు సేనాపతిగా గ్రహించి గిరికను ధర్మపత్నిగా చేకొనెను.

3. గిరిక ఋతుమతి యయ్యెను. ఆమెకు మృగమాంసము తెచ్చి పెట్టుమని వసురాజున కాతనిపితృదేవత లాదేశించిరి. మృగవధార్థము వనమునకు పోయి అతడు గిరికా ముగ్ధసౌందర్యమును భావించుచుండ రేతస్స్యంద మయ్యెను. ఆయమోఘవీర్యమును గట్టియాకునపొదివి ఒకడేగ మెడకుగట్టి "దీనిని గిరికకి" మ్మని పంపెను. ఆవీర్యమును చూచి మాంసమేమోయన్న భ్రాంతితో మఱియొకపక్షి ఆడేగను తాకెను. ఆరెంటి యుద్ధములో ఆవీర్యము జాఱి గాలికి యమునా నదిలో పడెను. ఆనదిలోనున్న ఒక మీను వసురాజ వీర్యములోని రెండు బిందువులు త్రాగి గర్భము తాల్చెను. మీ నన గా అది మీను గాదు. బ్రహ్మశాపమున అట్లు పడియున్న ఒక అప్సరోంగన. దానిపేరు అద్రిక. చేపరూపమున నున్నదానిని పదియవనెలలో జాలరులు తెరలువైచి తీసి గర్భముకోసి అందున్న కొడుకును, కూతును తీసికొనివచ్చి దాశరాజున కిచ్చిరి.

ఆకూతురే మత్స్యగంధి, పరాశమునివలన ఆమె కుదయించిన వాడే వ్యాసుడు.

ఈపయికథలోని రెండవభాగము మాత్రమే వసుచరిత్ర ప్రబంధమున అభివర్ణింపబడినది. వసురాజతత్త్వమునకు సంబంధించి భారతోద్దిష్టములయిన పెక్కువిశేషములు తక్కిన రెండు భాగము లందును గలవు. వానిని భూషణకవి విడిచిపెట్టెనా? విడిచినచో ఆలోప మెట్లు పూరింపబడెను? — ఇట్టి ప్రశ్నములుదయించును.

భారతకథలో 1) మృగములను చంపుటకై అడవికి పోయిన వసురాజునకు నిర్వేదమేల జనించెను?

2) ఇంద్రుడు వసురాజును మెచ్చుకొనుటకు ప్రధాన కారణము లేవి?

మృగమాంసము తెచ్చి ధర్మపత్నియగు గిరిక కిమ్మని చెప్పి యుండవచ్చును.

5) వసురాజు రేతస్సునుగూర్చి మిక్కిలి జాగరూకతవహించెను. అది గిరికా ముగ్ధ సౌందర్య సంభావనమున స్ఖలనమయిన తన రేతస్సు గిరిక సత్వస్వరూపిణియగు శుక్తిమతికిని, రజోగుణ ప్రధానుడగు కోలాహలునికిని ఉదయించిన ఉదాత్తప్రకృతి. తనకు ధర్మపత్ని. అట్టి ఆమె సౌందర్యమును భావించుటచే తనవంటి రాజర్షికి స్యందమయిన రేతస్సు ప్రాధాన్యమెట్టిదో ఆత డెఱుగును.

రేతస్సు ప్రాధాన్య ముపనిషత్తులలో ప్రౌఢముగా వర్ణింపబడినది. ఆత్మనుండి పురుషుడుదయించుటకుగల అవాంతరదశలలో పురుషున కవ్యవహిత పూర్వదశ అన్నము.

ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః । ఆకాశాద్వాయుః । వాయో రగ్నిః । అగ్నేరాపః । అద్భ్యః పృథివ్యా । ఓషధయః । ఓషధిభ్యోఽన్నమ్ । అన్నాత్పురుషః । సవా ఏష పురుషోఽన్నరసమయః" ఆనందవల్లి ప్రథమోఽనువాకః అని చెప్పబడుటచే ఆయీ పురుషుడు అన్నరసమయుడని అర్థము. అన్నరసమయు డనగా అన్నరసవికారము గలవాడు. అన్నరసవికారము రేతస్సు. రేతస్స్వరూపముగ పరిణమించిన అన్నమునుండియే కరచరణాద్యవయవ విశిష్టులగు సర్వప్రాణులును, పురుషుడును జన్మించును. కనుక సర్వప్రాణి సృష్టికిఅన్నరస వికారమగు రేతస్సు ప్రధానము.

భారతకథయందు వ్యాసునివంటి పురుషు డుదయించుటకు వసురాజ రేతస్సే కారణము, ఆ రేతస్సు వలననే గదా వ్యాసునితల్లియగు మత్స్యగంధి జన్మించినది! కనుక భగవంతుడగు వ్యాసుని మాతామహమైన తేజస్సు వసురాజ సంక్రాంతము. పైతామహమగు తేజస్సు

పరాశరుడు వశిష్ఠపౌత్రుడు, శక్తిపుత్రుడు. వశిష్ఠ శక్తిసంక్రాంతత్త్వము.
అనగా వ్యాసునకు పితృస్థానీయుడై వసిష్ఠుడే స్థానమునందుండెనో మాతృ
స్థానీయుడై వసురాజా స్థానము నందుండెను. ఈరీతిగా వ్యాసజన్మము
నకు వసురాజ వసిష్ఠులు సమప్రాధాన్యము వహించుచున్నారు. ఇం
దొకడు రాజర్షి, వేఱొకడు బ్రహ్మర్షి. వ్యాసుని జీవసంపుటిలో రాజర్షి,
బ్రహ్మర్షి లక్షణములు రెండు నుండుటచేతనే విచిత్రవీర్యానంతరము
చంద్రవంశము నుద్ధరించుటకతడు యోగ్యుడయ్యెను. దేవరన్యాయము
లౌకిక తృప్తికొఱకుగాని పరమార్థమదికాదు. విచిత్రవీర్యునిపిమ్మట
చంద్రవంశము అనపత్యమై నాశము కాకుండ కాపాడిన మహానుభావుడు
వ్యాసుడేకదా! అట్టివాని జన్మమునకు ధర్మపత్ని సౌందర్య సంభావన
మున స్యందమయిన యొక రాజర్షి రేతస్సు కావలసివచ్చెను.
ఆరాజర్షి వసిష్ఠునంతటి బ్రహ్మర్షికి సమస్కంధుడు కావలెను. ఇది
భారతకథలోని గూఢార్థము.

ఈ మహార్థమును ధ్వనింపజేయుటకే షణకవి వసురాజులో
రాజర్షి లక్షణములతోపాటు దివ్యపురుష లక్షణములనుకూడ ప్రతిపా
దించెను. అట్లే గిరికను కూడ తదనురూప ధర్మపత్నిగా నిరూపించుచు
ఆమెయందుకూడ దివ్యస్త్రీ లక్షణములను ప్రతిపాదించెను.
వ. చ 2-27, 3-94, 6-56. వసురాజు అర్థాంతరముచే పలుతావుల
సూర్యునిగా వర్ణింపబడెను. సూర్యుడు త్రిమూర్త్యాత్మకుడు.
సర్వదేవతాత్మకుడు. గిరిక పద్మినిగా వర్ణింపబడెను. అంతేకాక శ్రీవాణీ
గిరిజా స్వరూపిణిగాకూడ పలుతావుల చిత్రింపబడెను. ఈదంపతు
లిట్టి దివ్యమూర్తులుగా నేల చిత్రింపబడవలెనన్న భగవంతుడగు
వ్యాసుని జన్మము తజ్జీవ సంపుటి రహస్యము వీరితత్త్వములందును
నిక్షిప్తమై యుండుటే కారణము.

రామరాజభూషణుడు పెద్దన మను చరిత్రమును చిరకాలము మననము చేసికొన్నవాడు. పెద్దన తనకావ్యములో నిక్షేపించిన గూఢములగు బహుతత్త్వార్థములను విలేచించి తెలిసికొన్నవాడు.

స్వారోచిష, మను సంభవమునకును ప్రవర, వరూధినీ సమాగమమునకు పోరానిబంధమున్నది. మనువుగా ప్రజాపతి పాలన మొనర్ప గల దక్షుని జననమునకు స్వారోచిసదేవతల సమాగమువలెనే వరూధినీ ప్రవర సమాగమమును ప్రధానమే.

వరూధినీ హృదయగతమయిన ప్రవరమూర్తి 'వివిధాధ్వర నిర్మల ధర్మకర్మదీక్షాపరతంత్రుడైన ప్రవరునిమూర్తి. ధూర్తుడగుగంధర్వుని మూర్తి కాదు, గంధర్వునకుగల సంబంధము వరూధిని దేహమునకు మాత్రమే పరిమితము. ఆమె యాత్మలో ముద్రితమయినది ప్రవరుని "మనోజ్ఞమూర్తి"యే. అట్టి యా వరూధినికి జన్మించిన స్వారోచి పుత్రుడు స్వారోచిషుడు. స్వారోచికి విజయుడు, మేరునందనుడు, విభావసుడు ననుమువ్వురు కొడుకులు మనోరమాదులయందు జన్మించిరి. కాని వారిలో నొక్కడును మనువు కాలేదు. స్వారోచి యాముగ్గురకు క్రమముగా విజయాఖ్యాది పురములను కట్టబెట్టి మృగయారతి వదలక అడవికేగెను. అచ్చట హరిణిస్వరూపిణియయిన వనదేవత అతనిని కౌగిలించుకొని మనోజ్ఞలావణ్యమూర్తి యయ్యెను. మనోరమాదులయందంతకుముందు అనేకచిత్తముతో రమించిన స్వారోచి వనదేవతయందు ఏకచిత్తముతో రమించెను. అప్పుడుదయించినవాడు. "సామ్రాజ్యైకహేతు ప్రభూతాంచల్లక్షణ లక్షితుడు" డగు స్వారోచిషుడు. ఇట్టిపుత్రుని బడయుమనియేకదా దివిజులు వనదేవతను ప్రార్థించినది!

స్వారోచిషమను సంభవ మెట్టిదో భారతకథలోని వ్యాససంభవమును అట్టిదే. రేతస్స్యంద కాలమున వసురాజ మనోగతమయిన

గిరికామూర్తి కేవల ధర్మపత్నియగు గిరికామూర్తి. శాపగ్రస్తయె మీనయోనిగా పడియున్న ఒక అప్సరోంగనామూర్తి కాదు. ఈమీన యోనికి వసురాజుతోడి సంబంధము తద్వీర్యము తనగర్భమున నిక్షేపించుకొనునంతవఱకే. కనుక తద్వీర్యమునందు గిరికావసురాజ జీవధర్మములే ఉండవచ్చును. తద్బీజమునకు మీనయోనియగు అప్సరోంగన కేవల క్షేత్రము. అందుదయించిన మత్స్యగంధి సూనుడే వ్యాసభగవానుడు. అప్సరోంగనకు మీనియోనిత్వము సంతానము పొందువఱకే యని బ్రహ్మవాక్యము. గిరికతోడి వివాహమునకు ముందే వసురాజునకు బృహద్రథమణివాహన సౌబలయదురాజన్యులను కొడుకులైదుగురు కలరు. కాని వారిలో నొక్కడును వ్యాసు నంతటివాని మాతృతేజమును సృష్టింపగల వలంతి కాదు. పరాశరుడు సత్యవతిని గూడుటకు ముందు దానిజన్మమును తనదివ్యజ్ఞానమున నెఱిగియే కూడెను. అతడామెతో "నీవు వసు వను రాజర్షి వీర్యమున పుట్టిన దానవుకాని సూతకుల ప్రసూతవుకా' వనియు స్పష్టముగ చెప్పెను. అట్టి యీయామెకు జన్మించిన జ్ఞాని వేదవ్యాసుడు, అహిమద్యుతి తేజుడు; వేదమయుడు; అఖిలమునిందాద్రిద్యుడు.

భారతమందలి గూఢార్థమయిన యీపూర్వవృత్తమును భావించియే భూషణకవి వసురాజును రాజర్షిగాకూడ గ్రహించెను. ఒక రాజర్షిని శృంగార ప్రబంధ నాయకునిగా నావిష్కరించుటలో నాతడొక గొప్ప అసిధారావ్రతము పాటించి వసుచరిత్రమును రూపొందించెను.

*రాజర్షి యనగా ఋషిలక్షణములు గలరాజు. అటు రాజ లక్షణములు ఇటు ఋషిలక్షణములు అతనియందుండును.

ప్రాచీన భారతీయ ధర్మానుసారము రాజపదవి దివ్యము. రాజు దివ్యాంశసంభూతుడు.

"నా విష్ణుః పృధీ పీపతిః"

"అష్టాభిర్లోకపాలానాం మాత్రాభిర్నిర్మితో నృపః"

ఈ వాక్యము లాయర్థమునే బలపఱుచు చున్నవి.

ప్రభువు సమ్రాట్. స్వరాట్ప్రభృతి వేదోచిత శబ్దవాచ్యుడు. రాజులనెల్లర శిక్షించి రాజసూయము చేసిన మండలేశ్వరుడు సమ్రాట్టు. ఆత్మనిగ్రహము గలిగిన జ్ఞాని స్వరాట్టు. కేవల భగవత్స్వరూపుడు విరాట్టు. ప్రభువున కింతటి మహోన్నతపద మీయబడినది. ఇంతటి మహోన్నతపద మలంకరించుటచేతనే ప్రకృతిజనుల పాపముల న్నిటికిని ప్రభు లే యుత్తరవాది కావలసి వచ్చెను. ఆర్ష వాఙ్మయమున ప్రభువున కిచ్చిన ధర్మదీక్ష అట్టిది. అంతేకాని పరదారాపహరణము చేసి తోరవలు గొట్టి భోగము లనుభవించుటకు కానేకాదు. పయిగా అట్టి ధూర్తకృత్యము లాచరించువారిని ప్రభువు యథావిధిగా శిక్షింపవలసి యున్నది.

భూషణకవి చిత్రించిన వసురాజిట్టి యుదాత్త లక్షణములుగల నాయకుడు. 'ధీరాత్ముడు, అవికత్థనుడు, కరుణోద్వేలుడు, సత్త్వాఢ్యుడు' కనుక ఆప్తులువచ్చి ధూర్తుల చెయ్దములను ప్రభువునకు నివేదించు కొందురు. వసంత మాసన్నమయినది. మధుమత్తగంధవహుడు విజృంభించెను. అర్థాంతరస్ఫూర్తిచే ఇచట కవి గంధవహుని ధూర్త కృత్యములను వర్ణించెను. గంధవహుడు తాగి మత్తెక్కిన పోగులు బోతు. అతడు చెలరేగి యువతులను పీడించెను. వారి ముంగురులను మర్దించెను. మకరికా పత్రములు చెఱిపెను. పతివ్రతల చేయిపట్టి లాగెను. అంతట నాగర గొప్పవారిండ్లలో చొరబడి దీపములు పట్టి ధనములను దోచుకొనబూనుట, పెనుగోడల ప్రాకారములు దాటి

రాణివాసమున్న అబలల వలువలూడ్చుట, త్రాగుబోతులను చేర్చి వారి పాటలకు మెచ్చి వారికి మఱింత ఆసవము పోయించి ఆనందించుట, చివరకు సేనలను గూర్చుకొని సర్వము హరింప బూనుట ఇట్టి దుష్కార్యము లెన్నియో చేసినట్లు గంధవహుని గూర్చి వనపాలురు వసురాజుతో మొరపెట్టికొనినట్లు భూషణకవి వర్ణించెను. ఆస్థానవనుడును, సత్త్వాఢ్యుడును అగు ప్రభువున కార్తులు చేసికొను విన్నములు శ్లేషసామర్థ్యముచే ఇందు నిపుణముగా సూచింపబడెను. ఆర్తుల విన్నపము లాలించి వారిని తీర్చుట రాజధర్మము. వసురాజు మనస్సులో వనసందర్శన కుతూహలము పొటమరించుటకుగల మొదటి కారణము వనపాలురు గంధవహుని ధౌర్త్యమునుగూర్చి పెట్టుకొన్న మొర. ఆరామశోభావైభవములు చూచుట తరువాతిది.

వసురాజు నాస్తానవత్త్వమునకును, ధర్మప్రతిపాలనత్వమునకు ప్రబలనిదర్శనము కోలాహలు నడుపులో నుండి శుక్తిమతి వెల్లువలో మునిగిన జనులను కాపాడుట.

కోలాహలుడు పెద్దయింటిబిడ్డ. మూర్తీభవించిన రాజసము. శుక్తిమతి అణుకువగల సాత్త్వికురాలు. మహాసౌందర్యవతి. అంచ నడకలతో అటు నిటు కదలివచ్చు నాశుక్తిమతిని వాడుచూచి గ్రుక్కిళ్ళు మ్రింగికొనెను. తమక మాపుకొనలేక ఆఉద్ధతుడు ఆమె ఎంతవలదన్నను మానక మ్రైబడెను. అట్టిసాత్త్వికు రాలిపై నెత్తివచ్చి హింసకు పూనుకొన్న ఉద్ధతు నడుపులో పెట్టుట రాజధర్మము. "కోలాహలు డామెను మనసార ప్రేమించి మైబడెనే కాని అన్యము కాదుకదా! ఆసంగతి ప్రభువు విచారింపవలదా!" అన్నచో ముందు వారింపవలసినది జనోపద్రవము. తరువాత విచారింపవలసినది కోలాహలుని ప్రేమకలాపము. వసురా జాపనియే చేసెను.

తనపై జరిగిన అత్యాచారమునకు శుక్తిమతి యెలుగెత్తి ఏడ్చెను. "ఓ వసుధామహేంద్ర! కరుణోదధి! ఈ తడవేల? ప్రోవరావే!" అని మొరపెట్టుకొనెను. ఇది తనరాజ్యములో వినవచ్చిన ఒక ఆకు కూకురు కూయి. మహోగ్రనాదము! పిమ్మట ద్విజావళి ఘోషము నీట మునగిన జనుల కలకలము! సమస్త జనపదములనుండియు, కటక స్థానములనుండియు తండోపతండములుగా వచ్చి వసురాజుతో "తోట, చేను, కోటారంబు, దొడ్డియు నెడు ఆస లన్నియు గంగలో కలిపి బ్రతికి బయట పడితి"మని మొరపెట్టుకొనిరి. ఈ మొరపెట్టు కొనుటయందే వసురాజ దివ్యలక్షణములను వారు ప్రస్తుతించిరి. ఆపదలోనున్నవా రెంతయైన పొగడవచ్చునని త్రోసివేయరాని పరిస్తుతి ఇది. (2-144)

"వసురాజు సప్తద్వీప సహితమగు భూమండలమున కధిపతి. అనగా సార్వభౌముడు; ఆతని రాజ్యమున అగ్ని యజ్ఞకార్యము నిర్వహించునే కాని ఇండ్లను, అడవులను తగులబెట్టడు. వాయువు దాక్షిణ్యము వహించునే కాని రజోగుణ చాపల్యము వహించడు." ఈరీతిగా అగ్నిని, వాయువును, సూర్యుని, మేఘుని కట్టడి సేయగల దక్షత వసురాజునందున్నట్లు వర్ణించుట యెల్ల ఆతని యందున్న దివ్య లక్షణములను నిరూపించుట కే.

వసురాజు కోలాహలు నెగమీటిన రీతి రాముడు దుందుభి దేహమును మీటినట్లుండె నని ఉపమించుటచే వసురాజరాజ్యము రామరాజ్యముతో పోల్చదగినదని వ్యంగ్యము.

లోకోత్తర సౌందర్యవతియగు గిరికను చూపుటకై నర్మసచివుడు వసురాజును తన వెంట తీసికొనిపోయెను. గిరిక తనులపండువుగా గోచరించెను. ఆమెను దర్శించునపుడుకూడ ప్రభుదృష్టి రాజసహజము

గనే యున్నదట. అతని దృష్టి ఆమె అడుగులలో పొంచి పొంచి యుండి క్రమముగా కుచములవఱకు చొచ్చినదట. నృప దృష్టిలో నిచ్చట రాజ్యాక్రమణశీలమైన ఒక మంత్రాంగలక్షణమును భూషణకవి అనుసంధించెను. నిరాశ్రయుడయిన ఒకడు ముందుగా మంచి యిరవు నేర్పఱుచుకొని క్రమక్రమముగా గ్రామ సీమాదుల నాక్రమించుకొని మెల్లగా దుర్గముసంపాదించుకొని రాష్ట్రపాలకత్వము సాధించుకొనును. గిరికయొక్క సర్వావయవములను రాష్ట్రావయవము లతో అభిన్నముగా నున్నట్లు వర్ణించెను.

కాంత పదమొంది, అట ఊరు క్రమ్మి, కాంచి
సీమ నెనసి, పయోధర శిఖరి దుర్గ
సంగతికి లాచు నృపదృష్టి చక్రశాస
నోన్నతస్థాన మపుడుగా ఒదవు తనకు. (2-64)

ఇట్లే ఎన్నో శుభారంభములు, గజారోహణములు, మిన్నుముట్టుటలు పర్వతదుర్గములు తాకుటలు, నిధులు పడయుటలు, రాజులనేలుటలు, మొదలుగా సర్వరాజ లక్షణములను, రాష్ట్రపాలనదక్షతలను వసురాజు దృష్టిలో నొదిగించి తద్దృష్టిని గిరికావయవములపై ప్రాకజేసెను. (2-67)

తాను భూపతి; గిరికకును పతికాదలచెను. కనుక భూమితో గిరికకు అభేదము భజించెను. రాష్ట్రావయవములు గిరికావయవములు అభిన్నములుగా గోచరించుటచే ఆప్రభువు పరమ ప్రేమస్థానమయిన గిరికను వరెనే – రాజ్యమును, ప్రకృతివర్గమును పరమప్రేమాతిశయ ముతో ఆదరించి పాలించెడి వాడని ధ్వని.

వసురాజు తనపట్టణమున కేట్లో పోయెను. గిరిక కావియోగము దుస్సహమైనది. ఇంతలో చంద్రికలు విరిసెను. ఆమె చంద్రుని చూడ

డిట్టినది. ఆతిట్టులలోకూడ రాజశబ్దసామర్థ్యముచే కొన్ని రాజధర్మ ములనాతఁడు పేర్కొనెను.

“రాజై పుట్టుట రశ్మిమాత్ర ఫలమే? రాజౌట దోషార్థమే?” (4–7) రాజుగా పుట్టుట పదవీగర్వముతో మండిపడుట కాదు, అధికార మత్తుడై ఎడపెడ తప్పులు చేయుటకునుగాదు. రాజున్నాడన్నచో రాష్ట్రములు సుభిక్షముగా నుండుట, సజ్జనులు సుఖించుట, స్వపక్ష భయము లేకుండుట, అతిముఖ్యములు. ఇంత జాగరూకుడై రాజ్య మేలినను “రాజ్యాంతమున నరకము తప్ప” దని హెచ్చరించిరి. అనగా రాజింకెంత జాగరూకుడై యుండవలెనో ఊహింపదగియున్నది.

మంజువాణి గిరికావసురాజుల నడుమ వలపు రాయబారము నెరపినది. గిరికయొద్ద నుండి బయలుదేరి ప్రచ్ఛన్న రూపమున వసురాజు నంతఃపురములో చొచ్చెను. ఆరాజు మంచము దాపున మండలాకృతిగా పెక్కు జంత్రపు బొమ్మలున్నవి. వానిలో తానును నొక రతనపుబొమ్మయై మంజువాణి పకపక నవ్వి జేనితో నిట్లన్నది. ‘అసలు మగవారు “మాయాశీలురు, చంచలాత్ములు, అనుకంపా శూన్యులు;” – ఏ యెండ కాగొడుగుపట్టి పనిగడపికొని పోవువారు.’ ఇక నాపయిని “మహీపాలురో! మహావైభవశ్రీయోగాంధులు” (3–90) మంజువాణి యీపలుకులు ప్రభువు మొగమున నీడ్చికొట్టి నట్లుండెను. మహాజ్ఞానియైన అంతటి వసురాజుకూడ అచ్చెరువు పడెనే కాని మాఱుమాటాడ లేదు. కేవల వియోగాగ్ని తప్తుడగుటచే మాటాడలేదన వచ్చును, ఆమాటలలో నున్న సత్యము కూడ ఆమహాప్రభువునకు తెలియును. నిజమే! తలమున్కలుగా మహా వైభవశ్రీ లెన్నియున్నను ఏరాజు కన్నుగలిగి జాగరూకుడై వర్తించునో ఆతడే నిజమయిన రాజు.

బహిరంతరుల యెడ జాగరూకత సడలినచో రాజపదవి చెదరిపోవును. దేనికి బాహ్యమయిన రాజ్యపాలనమునందు వలెనే ఆంతరంగికమయిన ఆత్మవికాసమునందును అప్రమత్తత యుండవలెను. కనుకనే రాజునందు అలౌకికశక్తులుండవలెనని ప్రాచీనులు భావించిరి. వసురాజులో లోకాతీతమయిన దివ్యలక్షణములున్నట్లు వర్ణింపబడెను. అందుచేతనే అతడు "దివ్యచిహ్నధరు" డని చెప్పబడెను. ఈదివ్య చిహ్నములు వసురాజున కింద్రునిచే నియ్యబడినవి.

మూలము ననుసరించి వసురాజున కింద్రునిచే ప్రసాదింపబడినవి నాలుగు. 1) దివ్యత్వము 2) దివ్య విమానము 3) ఇంద్రమాల యను కమలమాలిక 4) వేణుయష్టి. ఇందలి మొదటిదానిచే దివ్యత్వము రూఢము. దివ్యవిమాన ముపరిలోక సంచారార్థము. ఉపరిచరవసు సంజ్ఞ కిదియే కారణము. కమలమాలికాధారణముచే ఆయుధబాధ యుండదు. వేణుయష్టి దుష్ట నిగ్రహ శిష్టపాలనక్షమము. ఇంద్రుడు వసురాజునకు వీనిని ప్రసాదించుటకు ప్రధానకారణములు రెండు. ఒకటి—వర్ణధర్మ ప్రతిపాలనము సేయుచు భూప్రజలను మిక్కిలి దయతో చూచుట; రెండవది — రాజ్యవిభవమును త్యజించి మహా నిష్ఠతో తపముచేయుట. అనగా రాజగువానికి ధర్మనిరతియు, ఋషిలక్షణమయిన తపోనియతియు ప్రముఖ్యములు. ఇవిరెండు నొకచో గూడుట రాజర్షియందే కాననగును. అట్టివానికి దివ్యత్వము ప్రసాదింపనక్కఱలేదు. అయినను ఇంద్రుడు ప్రీతితో చూపిన గౌరవ మది. ఇంద్రుడు వసురాజున కిచ్చిన విమానము ఉపరిలోకములలో సంచరించు వేడుక తీర్చుట కిచ్చినదిగాదు. ఆత డుపరిలోకములందును దుష్టనిగ్రహ శిష్టరక్షణములు చేయగల జాణయని నమ్మి ఇచ్చినదే.

వసుచరిత్రములో ఇంద్రునిచే నీయబడిన వస్తువులు మూడే. దివ్యత్వము పేర్కొనబడలేదు. విమానాదికమందే యాదివ్యత్వ

మిమిడియున్నది కదా! వేఱె చెప్పనేల ? ఇంద్రుడు వీనిని వసురాజున కిచ్చిన సందర్భములను భూషణకవి సహేతుకముగా మార్చెను.

కోలాహలు నుపద్రవము వారించి మహాప్రతాపసౌభాగ్యము ప్రదర్శించిన సందర్భములో అభినందన పూర్వకముగా నిచ్చినది దివ్యవిమానము. కమలమాలిక వేణుయష్టి వివాహ సందర్భమున చదివించినవి. ఇందు మొదటిది ముహూర్తమునకు ముందు, రెండవది ముహూర్తము తరువాతను చదివింపబడెను.

ఆ దివ్యవిమానము త్రిమూర్తులకు తక్క తక్కిన వారి కధిరోహింపరానిది. ఇంద్రుడు జిష్ణుడై దాని నధిరోహింపగలిగెను. త్రిమూర్తులలో ఒకడు బ్రహ్మ — ప్రజాపతి; రెండవవాడు పురుషోత్తముడగు విష్ణువు. మూడవవాడు శంకరుడు, ప్రజాపతిత్వ, పురుషోత్తమత్వ, శంకరత్వ, జిష్ణుత్వము లనెడి నాలుగు గుణములును— సర్వసద్గుణగణంబుల ప్రోవగు వసురాజులో నున్నవి కనుక ఇంద్రుడు దానిని నాతని కొసగెను. కమలమాలిక సుపర్వులకయిన భరింప భారమట! అందలి పద్మములు చిత్ర చరిత్ర కలవి. వేణుయష్టియు నట్లే అరిఖండన జయసాధనమై మహామహిమాన్వితమట! "రాజర్షి కీ ఇంద్రజాల మహిమకల వస్తువులన్నియు నేల?" అన్నచో అవి వసురాజు కావలెనని కోరుకొనినవికావు. ఇంద్రుడు మెచ్చి యిచ్చినవి పైగా పెండ్లిలో చదివించినవి. వద్దనరాదు. అసలు "రాజ్యవిభవ మిది యేల!" యని భావించు త్యాగికివి కామ్యములగునా? నైష్ఠిక సుందరుడగువాని అనుదిన కృత్యములలో ఇష్టాపూర్తములు ప్రధానములు (3–18). ఇష్టాపూర్తములనగా అగ్నిహోత్ర తపస్సత్య వేదానుపాల నాతిథ్యవైశ్వదేవములును, వాపీకూప తటాకాదులును. వీనిని యథావిధిగా నిర్వర్తించు నైష్ఠికసుందరునిగా వసురాజును భూషణకవి చిత్రించెను.

౪

అట్టి నైష్ఠిక సుందరునకు తగిన ధర్మపత్ని గిరిక. మూలములో గిరికనుగూర్చి ఇట్లున్నది.

"అతీవరూప సంపన్నాం సాక్షాచ్ఛ్రియ మివాపరామ్."

ఈ భావమునే నన్నయ అక్షరరమ్యముగ నిట్లు ప్రపంచించెను.

"పలుకులముద్దును కలికి కాళ్లన్నుల తెలివును, వలుద చన్నుల బెడంగు,
అలఘు కాంచీపదస్థలముల యొప్పును, లలితానదేందు మండలము రుచియు,
అళినీలకుటిల కుంతలముల కాంతియు, ఎలజవ్వనంబున విలసనమును,
అలసభావంబున పోలువును మెలపును కలుగు అగ్గిరికన తలచి తలచి" (ఆది-3-27)

వసురాజునకు రేతస్స్యందమగుటకు హేతువయిన గిరికా సర్వావయవ సౌందర్యమునుగూర్చి నన్నయ లౌకికదృష్టితో చేసిన వర్ణన మిది. వసుచరిత్రములో నీసందర్భమంతయు పరిహరింప బడినది. గిరికా సౌందర్యము లౌకికాలౌకిక భావములతో వర్ణింపబడినది. గిరికాబుతి మతిత్వము వసురాజు మృగమాంసార్థ మడవి కేగుట, రేతస్స్యంద మగుట ఈ మొదలయిన కథయొక్క పరమార్థమును సూత్రప్రాయముగ గ్రహించి దానిని గిరికావసురాజవివాహ పర్యంతమగు కథలోనె భూషణకవి ధ్వనింపజేసెను.

నృపకోటులలో వసురాజు మేటి. పృథునరాధిపుశక్తి ఆతని గోనగోటికి చాలదు. ఇంద్రునంతటివాడు "మద్భుజాంతర పవిరేఖ నీయెడుగునం బడదే శుభలక్షణాకృతిన్" అని పలికెను. ఆనృపునకు పరిచర వసునామధేయం బంకించినవారు తపసులు. గిరికకు కూడ

ఆ పేరు (గిరిక) పెట్టినవారు మానులే. "గిరిరాజతనయ కై వడి సిరిరాజిల వెలయు నీసుశీల" యని యామెకా పేరు పెట్టిరి. అఖిలభాగ్యములు కలుగునట్లుగా తబిసి ముత్తైదువలు దీవించిరి. వనదేవత లామెకు సైరంధ్రులు, దాసులు వయస్యలు, వాణిని దాల్చు సుకవిస్తోమములు సర్వ విద్యాగురువులు — కిన్నరకోటులు సంగీతము నేర్పువారు. ఆగిరిక నెలతలలో త్రిలోకనుత నిర్మల రూపకలాపధన్య.

ఆమె తండ్రి కోలాహలుడు. అనుపమభాగ్యశాలి. అచలాధిప మాళికి పుత్రుడు, జగజ్జనని కనుంగు తమ్ముడు, శంకరుముద్దుమఱంది కుఱ్ఱ. తన భాగధేయమహిమతో మిన్నులు ముట్టివచ్చు ధన్యుడు. సుమనోధివాస భాసుర శిఖోన్నతి కలవాడు.

ఆమె తల్లియగు శుక్తిమతియో! లోకోత్తరస్త్రీరత్నము. భారతీయ స్త్రీయందుండవలసిన సర్వసద్గుణములు నామెయందున్నట్లు భూషణకవి ఆమెను తీర్చిదిద్దెను. శబ్దశక్తిమూలధ్వనిచేతను, శ్లేష సామర్థ్యముచేతను ప్రకృతా ప్రకృతార్థములను సంధించి శుక్తిమతీ శుద్ధసాత్త్విక స్వరూపమును కవి మనముందు నిలిపెను. ఆమెకు సురాలయనదీఖ్యాతికలదు. ఆమాటలోనె పవిత్రతా సౌందర్యాచ్ఛతలు గతార్థములు. 'దాని ఒప్పులు తెప్పార్పక' చూడదగినవి. సరసతా గభీరతాచ్ఛాచ్ఛ భావముల లోడి సర్వాంకషప్రౌఢితో నామె పరిపూర్ణురాలు. అనునిత్యము బ్రహ్మదేవుని కొలువునకు పోయి ఆదేవుని సేవించివచ్చు వ్రతపరిపాటి కలదు. ఇన్నిమాటలెందుకు ? ఆమె "ప్రచారములెల్ల విశ్వధాత్రీవలయ త్రికాలఫలదేశికములు"— సమస్త భూజనులకు భూతకాల పుణ్యసూచకములును, భావికాల శుభహేతుకములును, వర్తమానకాల దురిత భంజకములును నై యామె సంచారములు విశ్వశ్రేయోదాయకములై యున్నవి. ఇంతటి యోగ్యురాలు కావుననే తనహద్దుమీఱి తానెన్నడు వర్తింపదు.

మహావినయభరముతో మాటాడు నామె మాటలలో భారతీయాదర్శ స్త్రీమూర్తి సాక్షాత్కరించును. ఆమెకు కోలాహలునిపై పూజ్యతా గౌరవభావములు కలవు. అతడు తనపై ప్రేమము తెల్లము చేయు నపుడు 'పెద్దయింటి బిడ్డడగు నా మహానుభావునకు తాను తగునా!' యని వితర్కించుకొనిన ఉచితానుచితజ్ఞ. అతడు తనకడకు వచ్చి నపుడు ఎదురేగి వెంట తీసికొనివచ్చి గంధాక్షతల పళ్లెరము పట్టి, వానికి అర్ఘ్యపాద్యాది విధులతో పూజచేసి మర్యాద నెఱపెను. రత్న పీఠిపై కూర్చుండ బెట్టెను. వానికి పద్మనిధులు దొరకినంత సంతోష మగు వర్తించిన పుణ్యస్త్రీలలామ శుక్తిమతి. వినయభరముతో తన యల్పత్వమును వానికి నివేదించుకొనెను. అతని యుద్ధతి వారించుట కెన్నెన్ని ప్రయత్నములో చేసినది. వానిముందు తనమంచితనము పని చేయులేదు. వాడు తాను తలచినదెల్ల నెఱవేర్చుకొని తత్ఫలమందెను. ఆతనివలన తనకు గల్గిన తొలిచూలికి వసుపదు డనిపేరు వెట్టుటలో కూడ వసురాజునెడ ఆమెకుగల కృతజ్ఞత వెల్లడి యగుచున్నది. ఆమె కృతమెఱిగిన పుణ్యచరిత.

ఇట్టి తల్లికడుపున పుట్టిన బిడ్డ గిరిక. తనతల్లి తన అన్నగారికి వసుపదుడను పేరేల పెట్టెనో గిరికకు తెలియును. పయిగా చిన్న నాటినుండి చెలికత్తియలు వసురాజు విజయకథలతో నామె నలరించుచున్నారు (3-56). బుద్ధి తెలిసిన నాటి నుండియు నామె మనసు వసురాజుపై లగ్నమై యుండుననియే భావింపవలెను.

వసురాజు నర్మసచివుడు మాయామునియై వచ్చి మంజువాణి చేత గిరికా జన్మవృత్తాంతమును చెప్పించుకొనునపుడు గిరిక యచ్చటనే యున్నది. వసురాజును గూర్చి మంజువాణి పల్కెడు పలుకుల కామె అంతరంగములో ఆనందముప్పొంగెను.

గిరికావసువుల ప్రణయమును అలౌకిక ప్రణయముగా కవి నిరూపించెను.

వనపాలుర యాహ్వానమును మన్నించి వసు రాజుద్యాన వనమునకు వచ్చెను. అచ్చట నొకచెట్టు కొననున్న కిన్నరపిట్టలజంట అచిరకాలములో అతనికి కలుగనున్న శుభమును తమ భాషలో తెలిపి కోలాహలపర్వతము దిక్కుగా పోయెను. వసునృపాలుడు నిఖిలోక్తివేది. కలుగనున్న శుభమున కాతడు కౌతూహలము నెఱపెను. కిన్నరపక్షులు భూలోకమున కాశ్చర్యదాయకములు. విధిచోదితమై యాపక్షిద్వయము ప్రభువున కాసన్న శుభమును దెలిపినట్లు కవి సూచించెను.

వసురాజునకు క్రీడానగమయిన కోలాహమును నర్మసచివుడు చూపి వర్ణించెను. ప్రభువు దాని నధిరోహించి ఒక చంద్రకాంత శిలావితర్దికమై విశ్రమించెను. అప్పుడాతని కొక కలస్వనము వినవచ్చెను. దానిలక్షణ మిట్లున్నది.

"వీనులవిందై యమృతము
సోగలపొందై యమందసుమచల దళినీ
గానము క్రిందై యారన
మానందబ్రహ్మ మయినది." (2-14)

అవ్యక్తమధురమయిన యానాదము ఆమతుమ్మెదల గానాలాపముగా నున్నది. అంతేకాదు, ఆనందస్వరూపమయిన పరబ్రహ్మముగానున్నది. అనగా కేవలబ్రహ్మానందము. వసురాజంతకు ముందెన్నడు నట్టి యానందము పొందలేదు. తా ననేకగాయనీమణుల గానము విని యుండెను. స్వర్గములోకూడ గంధర్వాప్సరోగీతము లనేకములు వినెను. అందైన నిందైన విందై యానందసందోహోపాదకమయిన నాదము వినిపింపలేదు. అనగా ఆనాదము లోకాతీతమయిన ఆనందము నొడగూర్చినది.

ఆనాదము గిరిక వాయించు వీణనుండి వెడలిననాదము. ఒక వైణికి పలికించు నాదము ఆమె ఆత్మసంస్కారమున కనుగుణముగా నుండును. తదనురూపమగు నాత్మసంస్కారముగల సహృదయున కానాదము మహానందదాయకమగును. అట్లు ఆనందము కలుగుట ఒక వాసనావిశేషము. ఇట్టి వాసనావిశేషముచే వసురాజునకు బ్రహ్మానందమయినది. అప్పటికాతడు గిరికమొగమయిన చూడలేదు. ఆమె వీణానాదమహత్త్వమే యత డెఱుగును.

ఆనందస్వభావము విలక్షణమయినది. అందు మానుషానందము మొదటి సోపానము. యువకుడును, అధీతవేదుడును, ఆశిష్ఠుడును (భోగ్యవస్తువులను సకాలములో ననుభవించువాడు) దృఢబలిష్ఠుడునై జగమంతయు నేకచ్ఛత్రాధిపత్యముగ నేలు సార్వభౌమున కొదవు నానందము మానుషానందము. అంతకంటె 1 మనుష్యగంధర్వానందము, 2 దేవగంధర్వానందము, 3 చిరలోక లోక పిత్రానందము, 4 ఆజానజదేవానందము, 5 కర్మదేవానందము, 6 దేవానందము, 7 ఇంద్రానందము, 8 బృహస్పత్యానందము, 9 ప్రజాపత్యానందము, 10 హిరణ్యగర్భానందము క్రమముగా నుత్తరోత్తరము శతాధికమైన యానందము నొసగును. ఈచివరిమెట్టగు హిరణ్యగర్భానందమే బ్రహ్మానందము. ఇది పరమమయిన యానందము. అట్టియానందము గిరికావీణానాదశ్రవణముచే వసురాజునకు కలిగినది.

---

1. మనుష్యుడయి యుండి పుణ్యకర్మయోగాది బలముచే గంధర్వత్వము పొందినవాడు మనుష్య గంధర్వుడు. సుఖవిశేషాభివ్యక్తిమూలకమయిన చిత్తప్రసాదముచే నాతడు పొందునానందము మనుష్యగంధర్వానందము.
2. సృష్టికాలమునందే దేవలోకమున గంధర్వుడై పుట్టినవాడు.
3. చిరకాలముండెడి లోకమునందెడి పితరుడు.

ఇచ్చట ప్రయుక్తమయిన బ్రహ్మానందము అతిశయోక్తి సూచకముగాదు. కారణమేమనగా గిరికావీణానాదశ్రవణ సుఖము వంటిదే వసురాజు ఆమెతోడి సంభోగము నంతమునందును పొందెను. ఆమెయునట్టి యానందమే పొందెను. వివాహానంతరము వారి సంభోగాంతసుఖము బ్రహ్మానందానుభవమును తెల్పెనని చెప్పబడెను. (6–95). వీణానాద శ్రవణముచే బ్రహ్మానంద మయినది. సంభోగాంత సుఖము బ్రహ్మానందానుభమును తెల్పెను. "బ్రహ్మానందమయిన" అనుదానిలో "అగు" ధాతువు అనుభవార్థద్యోతకమే అయినను భూషణకవి సంభోగాంత సుఖవ్యక్తీకరణమున ప్రయోగించిన 'అనుభవ' శబ్దమును వీణానాదశ్రవణసుఖమున ప్రయోగింపలేదు. ప్రారంభదశలోని ఆయనుభూతి అవ్యక్తము. పరిణతదశలలో వ్యక్త స్వరూపము. వీణానాదము విన్నప్పటికంటె వసురాజునకు గిరికను కనులార చూచినప్పుడు కలిగిన యానందము అధికతరము.

అంతటి రాజర్షియు తీవలమాటుననుండి, పొదలమాటున నుండియే చూచెను. ఇది ప్రాబంధికమయిన లౌకికప్రపంచము. అట్లే చూడవలెను. వసురాజు దృష్టి గిరిక నెమ్మున ప్రసరించెను. గిరికాసౌందర్య మాతని కాశ్చర్యము గలిగించెను. ఆతడారూప మాత్మలో నభినుతించెను. అని తరాయత్తమై ఆతని యాత్మ అవాఙ్మనస గోచరాద్వైతరాగ జలధిలో తేలియాడినది.

"వాఙ్మనసగోచరేతరాద్వైతరాగ
జలధి నవ్వు డోలిఁ దేలి రాజన్యమౌళి
ఘనతరాశ్చర్యశాలియై వనితరూప
మనితరాయత్తమగు నాత్మనభినుతించె." (2–23)

తొలుదొలుత అవ్యక్తమధురమ్మై (కలస్వనము) వినబడిన గిరికావీణా నాదమువలని బ్రహ్మానందము తద్రూపసందర్శనమున 'అద్వైతరాగమై

తత్సంభోగాంతసౌఖ్యము బ్రహ్మానంద – అనుభవమును తెలుపుటలో శ్రుతిప్రతిపాదితమై బ్రహ్మసంబంధమయిన ఒక ఆనందక్రమము పాటింపబడినది. అంతేకాని ఈ బహ్మానందానుభూతి కేవల ప్రేమాతిశయ సూచకమని త్రోసివేయరానిది.

నిర్దిష్టమైన యొక సంప్రదాయార్థమును ధ్వనింపజేయుటకే రామరాజ భూషణుడు అద్వైత – బ్రహ్మానంద – అనుభూత్యర్థక శబ్దములను జాగరూకుడై ప్రయోగించెను.

అగుచో తత్సంప్రదాయార్థమేది ?

మాయతపసియగు నర్మసచివుడు మంజువాణితో "ఇదిగో వసురాజును దప్పింతు" నని "మజ్ఝా" యని వింతగా అఱచెను. ఆగుఱుతు తెలిసికొని వసురాజు తీవెగుంపులను తొలగ త్రోసికొని చిఱునవ్వు నవ్వుచు అచ్చటకు పోయెను. నారీమణులు బంగరుపీటనైచిరి.

---

4. పితృలోకముకంటె పైనున్న ఆజానజ దేవలోకమునందుత్పన్నుడయినవాడు ఆ జా న జు డు స్మార్తకర్మ విశేషాచరణముచే దేవలోకమునందు పుట్టినవారని శంకరభాష్యము.
5. ఆజానజదేవభోగముకంటె అధికభోగము పొందుటకై వైదికమగు అగ్నిహోత్రాదిక మనుష్ఠించినవాడు కర్మదేవుడు.
6. హవిర్భుక్కులగు ముప్పదిముగ్గురు దేవతలు.
7. దేవతలకు ప్రభువింద్రుడు.
8. ఇంద్రునకాచార్యుడు బృహస్పతి.
9. త్రైలోక్యశరీరుడగు విరాట్పురుషుడు ప్రజాపతి.
10. వ్యష్టిసమష్టిరూపుడును, సూత్రాత్మయునగు బ్రహ్మ(ము) — తైత్తిరీయానందవల్లి అష్టమానువాకము.
తత్తదానందములు తత్తన్నామాంకితములు.

అతడు కూరుచుండెను. 'అనుపమకాంతి వైభవసమన్వితుగా వసురాజును గిరిక చూచినది' ఆమెఅంతరంగములో 'అఖండవాసనలు' విలసిల్లెను. వాసనయనగా సంస్కారము. అది జన్మసిద్ధము. సత్త్వ సంబంధి, సాత్త్వికభావములు జన్మసిద్ధమయిన సంస్కారము వలననే కలుగును. సాత్త్వికభావములకును, అఖండ వాసనలకును జన్యజనక సంబంధము. కాని ఇచ్చట నారెంటికి నభేదము. వాసనా విశిష్టమయిన సాత్త్వికభావోదయము నాయికానాయకులకు అద్వయరాగ హేతువు. గిరికారూప బ్రహ్మము వసురాజునాత్మకు ఆనందసంధాయకము. ఆమెకు కాంతి వైభవసమన్వితుడగు నావసురాజు సూర్యుడై గోచరించెను. ఆసూర్యునిముందామె పద్మిని.

వసురాజు సూర్యుడుగా పలుతావులందు శ్లిష్టము. రామరాజ భూషణుడు సహజముగా గిరికావసురాజులను వర్ణించునపుడు సీసపద్యములోని మొదటిమూడుపాదములలో దేవీమూర్తి సహితమగు మూర్తిత్రయముతో పోల్చి నాలుగవపాదములో పద్మినీ సూర్యులతో పోల్చుచుండును. సూర్యుడు త్రిమూర్త్యాత్మకుడగుట ఇందుకుకారణము కావచ్చును. వ్యస్తముగా కూడ వసురాజు సూర్యునితో అభిన్నుడుగా వర్ణింపబడుచుండును.

ఆర్ష వాఙ్మయములో సూర్యుడు కర్మసాక్షి. త్రిమూర్త్యాత్మకుడు అంతేకాదు సర్వదేవతామూర్తియు. ఆదిత్యపురుషుని సర్వాత్మకత్వ లక్షణము నుపనిషత్తు లెంత గంభీరముగనో వర్ణించెను.

"ఆదిత్యో వై తేజ ఓజోబలం యశశ్చక్షు శ్శ్రోత్ర మాత్మా మనో మన్యు ర్మను ర్మృత్యు స్సత్యో మిత్రో వాయు రాకాశః ప్రాణో లోకపాలకః కః కిం కం తత్సత్య మన్న మమృతో జీవో విశ్వః కతమస్స్వయంభు బ్రహ్మైతదమృత ఏషపురుష ఏషభూతానా

మధిపతి (ర్బహ్మణ స్సాయుజ్యగ్ం సలోకతా మాప్నోత్యే తాసామేవ దేవతానాగ్ం సాయుజ్యగ్ం సార్షితాగ్ం సమాన లోక తా మాప్నోతి య ఏవం వేదేత్యుపనిషత్."

వైవస్వతాది మనుస్వరూపుడును, సకలపాలుడును, ప్రజాపతియు(కః) పంచభూతములు, సర్వదేవతలు నాతడే. సమస్త జీవకోటియు నాతడే, స్వాయంభువగు బ్రహ్మము నాతడే.

వసురాజిట్టి ఆదిత్యపురుషునితో నభిన్నుడుగా వర్ణింపబడెను. సామాన్యమగు శ్లేషార్థము కిరణప్రకాశము కలవాడనియే. (వసువు = కిరణము; రాజు = ప్రకాశించువాడు) ఇంతకంటె ఉదాత్తమగు నర్థము పరమాత్మస్వరూపుడగు సూర్యునితో పోల్పబడుట.

ప్రభువు ప్రజాపతి; లోకపాలకాంశములతో జన్మించువాడు. సమస్తజీవకోటిని పాలించుట కాతనియందు మనులక్షణము లుండవలెను. ఈలక్షణములన్నియు సూర్యునిలో గలవు. అందువలననే వసురా జాదిత్యపురుషునితో నభిన్నుడుగా వర్ణింపబడెను. గిరికపద్మినిగా వర్ణింపబడెను. ఆదిత్యుడు త్రిమూర్త్యాత్మకుడును గనుక వసురాజు కూడ త్రిమూర్తులతో పోల్పబడెను, తదనుగుణముగా గిరిక శ్రీవాణి గిరిజలతో పోల్పబడెను. అట్టి లోకోత్తర దంపతుల యద్వైతభావమే 'వాఙ్మనసగోచరేత రాద్వైతరాగము'గా నిరూపింపబడెను. ఆయద్వైతరాగఫలమే ఆదంపతులు పొందిన బ్రహ్మానందానుభవమని భూషణకవి ధ్వనింపజేసెను.

❧

వీనులవిందుగా వినవచ్చిన కలస్వనము వలన వసురాజునకు బ్రహ్మానందమయినది. "ఇది షట్పదీనాదమో, కలకంఠనాదమో,

నురున్నారీమణీవల్లకీ నాదమో వివరింప వీలుగాకున్నదే!'' అని పరమా నందముతో పలికెను. మంత్రి అదివిని "ఎవరో వీణపై పాడుచున్నారు" అని పారవశ్యముతో చెప్పెను. "పోయి తెలిసికొనివచ్చెదరా" అని ప్రభువనెను. అతడు పోయి తరువులపొంత పొంచి చూచెను. వీణ వాయించుచు చెలికత్తెల నలరించుచున్న మహాసౌందర్యవతి కనిపించెను. మంత్రి ఆసౌందర్యమునకు అద్భుతంపడి ఇట్లనుకొనెను.

"తనకప్పు నెఱికొప్పుననె పూని గౌరీ స
మాఖ్య మించ జనించినట్టి యార్య
తనచాపలము చూపులనె చూపి సిరులెల్ల
కడఁజల్లవచ్చిన కమలపాణి
తనపాండిమము నవ్వులనెయుంచి గాంధర్వ
మనవికిఁదెచ్చిన హంసయాన". (2-27)

గిరిక యాతసదృష్టికి పార్వతి (ఆర్య) వలెను, లక్ష్మి (కమలపాణి) వలెను, సరస్వతి (హంసయాన) వలెను గోచరించెను. పార్వతీ, లక్ష్మి, సరస్వతీ సమాహారమూర్తియై పరమసమ్మోహన విద్యగా సాక్షాత్కరించెను. వెంటనేపోయి మావనురాజున కెఱింగించి యాతని తెత్తునననెను. కాని వసురాజును తెత్తుననలేదు. ఆమహేశుని (శివుని), ఆనగోద్ధారకుని (విష్ణువును), ఆప్రజాధినాథుని (బ్రహ్మ) ఆజగన్మోహ నుని తీసికొనివత్తుననెను. వసురాజును జగన్మోహనుడగు త్రిమూర్త్యా త్మకునిగా భావించెను. అనగా గిరికను త్రిమూర్తులదేవీమూర్తిగా భావించి వసురాజును త్రిమూర్త్యాత్మకుని భావించుట జరిగినది.

ఈభావమే పలుతావుల సంఘటింపబడుట గమనింపదగిన విశేషము.

వసురాజునకు గిరికతోడి వియోగము ఘటిల్లెను. అంతరంగ ములో నామెవైభవమును స్మరించుకొనుచు పురమునకు పోయెను.

అచ్చట నాతఁడు పొందిన నిర్వేదమును భూషణకవి ప్రౌఢముగా వర్ణించెను.

"గిరికన్య మేన సేకీభవించినఁగాని
తియ్యవిల్తుని నిరోధింపరాదు
సింధుజ నెదనుంచి సిరుల మించినఁగాని
మిహికాంశు కనుసన్న మెలపరాదు
శుభవాణి అభిముఖస్ఫురణఁజూపినఁగాని
పజమటంచలఁ గ్రిందుపఱుపరాదు." (3-94)

ఇది వసురాజు పొందిన నిర్వేదము. గౌరీ లక్ష్మీ సరస్వతీ రూపిణియగు గిరికయొక్క సంయోగము పొందవలెనన్న తాను అర్ధనారీశ్వరుఁడు గావలెనట! సత్త్వగుణస్వరూపుడగు విష్ణువు కావలెనట! పద్మభవుడగు బ్రహ్మకావలెనట! ఇంతవఱకిది సీసమందలి మొదటి మూఁడు పాదములలోని భావము, నాల్గవపాదము చూడుడు.

"పద్మినిఁ గరముఖప్రౌఢిఁ దేల్చినఁగాని
రేలుముమ్మరము వారింపరాదు." (3-94)

వసురాజిచ్చట గిరికను పద్మినిగా భావించి తన్ను సూర్యునిగా రూపించుకొనుచుండెను. సూర్యునిలో త్రిమూర్తులుండనేయున్నారు. ముగ్గురు మూర్తుల అవతారము లెత్తుటకంటె తత్సమాహార రూపమయిన సూర్యునితో నభేదము భజించుట లెస్సగదా! వసురాజిట్లే భావించెను. పార్వతి ఈశ్వరు నర్ధదేహము. లక్ష్మి విష్ణువు వక్షమునందున్నది. సరస్వతి బ్రహ్మ ముఖము నందున్నది. ఆయాది జంపతీ త్రయముయొక్క అద్వయభావము అటువంటిది. అట్టిఅద్వైతభావమునే గిరికా వసురాజులయెడ కవి భావించి ప్రబంధమును తీర్చిదిద్దెను.

గిరికా వసురాజులకు వియోగము సంప్రాప్తమయ్యెను.

'వియోగముకూడ నొక యోగమే'యని భోజుడు. అత డీమత మును సప్రమాణముగ నిరూపించెను.

యోగ సూత్రములకు "రాజమార్తాండ" మను వృత్తి కలదు. అది భోజరాజ కృతము.

వియోగమే యోగమని నిరూపించుటకు భోజాదులు లోక సాధారణులయినవారి వియోగమును భావింపలేదు. వారు భావించి నది ప్రకృతి పురుషుల వియోగము. దానినే వారు యోగముగా నిరూ పించిరి.

భూషణకవి ప్రబంధములో గిరికా ప్రకృతియెడ వసురాజ పురు షుఁడును, వసురాజ పురుషునెడ గిరికా ప్రకృతియు సమాకృష్టములు. వారి వియోగము నొక యోగముగా భావించి భూషణకవి వర్ణించు చున్నాడాయను నల్లనేక వర్ణనములున్నవి. వసురాజు పొందిన గిరికా వియోగమువలని నిర్వేదములో తపోనురక్తి యోగాసక్తి మొదలగు విలక్షణ భావములు వ్యక్తమగుచున్నవి.

"గిరిక వెనువెంటఁ దిరుగఁ గనిన హంసలు, మోవి రుచిచూడ గనిక రాచిలుకలు మోము తాలి కొసరగనిన మత్తమధుపములు, కంకణ నినాదగర్జ వినగనిన మత్తమయూరములు, తొలుదొలత నెట్టి శుచివృత్తితో నుండితీర్థసంవానము చేసి, వరఫలములంది, మహోసవములు చేసి తపోనివృత్తి నున్నవో! ఆమె సామీప్య వర్తనఫలము గనినవి!" అనుకొన్నాడు.

"శుచివృత్తి నెన్నాళ్లుపచరించెనో
 తీర్థసంవాస మిచటి హంసవ్రజంబు
సురసాలముల నెన్ని వరఫలంబులఁజెంది
 నిలిచెనో యిచటి రాచిలుక చాలు

సుమనోనురక్తి నెట్టి మహోత్సవంబుల
  సందెనో యిచటి మత్తాలి సమితి
అదన నెంత తపంబు తుదిమీఱ నోచెనో
  ఇచటి గంధాంధ బర్హిణగణంబు." (3-85)

ఈ హంసవ్రజ ప్రసక్తి, శుచివృత్తులు, తీర్థసంవాసనములు, మహోత్సవములు, తపస్సులు– తపోనురక్తి గలవారికిగాని శృంగార పురుషుల కుండవుగదా! వియోగియైన వసురాజ చిత్తమియ్యెడ మున్యుచిత తీర్థసంవాసాదికమునిచ్ఛయించుట విలక్షణమైనది. ఈ రాజపురుషుడా గిరికా ప్రకృతి నుపాసించుటలోని మహార్థము నిట్లు భూషణకవి ధ్వనింపజేసెను. అంతేకాని మహోత్సవనాదిక నిర్వాహణము కేవల సామాన్య ప్రేమికులకు సుదూరమయిన విషయము.

గిరికకు వసురాజ వియోగము దుస్సహ మయినది. క్షణ మొక యుగముగా నున్నది. "ఈ వియోగాంబుధిని గడచుటెట్లో!" యని శృంగారవనికి పోయినది. విప్రయోగినీ సహజమయిన మరణోద్యోగమామెయు భావించినది. ఇంతలోనామెకై చెలులెల్ల పరువెత్తివచ్చిరి. వారి దృష్టికి చంద్ర మన్మథ గంధానిల మహామధుపములతో నెయ్యము పాటించు పిక[స్వర]ము పంచమహాపాతకిగా గోచరించెను. చంద్రుడు గురుతల్పగతుడు; మన్మథుడు బ్రాహ్మణహంత; గంధానిలములు కాంచనస్తేయులు; తుమ్మెదలు త్రాగుబోతులు – పికముతో గూడిన వీరు పంచమహాపాతకులని చెలులు దూషించి, సుజ్ఞానులట్టి పంచమహాపాతకు లున్నచోటికి రారాదని గిరికను మందలించిరి (3-124) ఆ సందర్భమున మంజువాణి అనులిన ధోరణిలో గిరికతో పలికిన మాటలెట్లున్నవో చూడుడు. ఆమె దృష్టిలో ఆ మధుపములు, చిలుకలు, కోకిలలు, హంసలు సన్మార్గ మధిగమించి మెసగు ముముక్షు మార్గగాములై కనిపించినవి. వసు చరిత్రములో మంజువాణి యనగా రామరాజభూషణుడే.

"సకలాగమాంత వాసనలు గాంచి విముక్త
కాంచనంబగు మాధుకర కులంబు
వర్ణిత్వమున దృఢావాప్తి సంయమములై
శౌరిఁ బేర్కొను శుకసంతతులును
కన్న పెంచినవారిఁ గలయక మాధవా
శ్రిత సూక్తిమను వనప్రియచయంబు
పద్మాసనాభ్యాస పారవశ్యమున బ్రి
హ్మాధీన గతులయిన హంసతతులు
పుష్పఫల పత్రజల మాత్రముల శరీర
యాత్ర గడపుచు సన్మార్గ మధిగమించి
యెసఁగు నివియెల్ల నీకేల యెగ్గొనర్చు
వసిత యావంత యావంత వలవదమ్మ!". (3-128)

ఇచ్చటి మంజువాణీ భాషణము గిరికకు మనశ్శాంతి దాయకమై విలక్షణమయిన యోగవాసనలను గుబాళించుచున్నది. వేదాంత వాసనలు, కాంచన విరక్తి, భిక్షుకవృత్తి, బ్రహ్మచర్యము, సంయమము, శుక[ర్షి] లక్షణములు, విష్ణు సంకీర్తనము, వానప్రస్థలక్షణము పద్మాసనాభ్యాసము, పరమహంసవ్రజము, బ్రహ్మాధీనగతులు– ఓహో! ఏమి తాత్త్విక దర్శనము! ఏమి యోగిక సంధానము!

తాను రచించునది శృంగార ప్రబంధము. అందును విప్రలంభమును వర్ణించు ఘట్టము. రత్యనుకూలమయిన శుకపిక శారికాదులను వర్ణించి ఉద్దీపన విభావమును గలిగింపవలసిన సన్నివేశములో వైరాగ్య జనకమయిన ముముక్షుయోగ మార్గమున కవి యేల వర్ణనము సాగించెను? ఇది రసభంజకము కాదా?... అని ప్రశ్నింపవచ్చును.

అవును! ఇందలి ప్రధాన రసము శృంగారమే. విప్రతిపత్తిలేదు. అది అంగిరసము. అంగిరస మదియైనపుడు అంగరసము మఱియొక

యుండరాదా? అట్టి యుంగరస మిందు శాంతము. కనుక శమము స్థాయి. భూషణకవి ఈ శృంగార కావ్యమునందు శాంతభావనా నిబద్ధమయిన యోగమార్గమును ప్రపంచించి గిరికా వసురాజ లోకోత్తర దివ్య జంపతీ ప్రేమాద్వైత తత్త్వమును పోషించెను.

మన్మథుడు గిరికను కీడ్పఱిచెను. అత డామె కొక పెనుభూత మయ్యెను. గిరికా వియోగిని విరక్తచిత్తముతో పంచభూతాత్మక మయిన తన దేహమును విసర్జించుట మేలని భావించెను. శరీరము పృథివీ భూతము. కనుక దానిని పృథ్వీవికారమయిన రజస్సుతోనే (కలువపుప్పొడి) కలుపజూచినది. అశ్రువులు అబ్వికారము. కనుక వానిని అబ్వికారమయిన పూదేనెయందే కలుపజూచెను. వేడి వాడిమిగల చూపులు తేజోవికారము. వానిని మదనాగ్ని ప్రభాసదనమై తేజోవికారమే యయిన మామిడి చివురునందే ప్రసరింపజేసెను. ఊర్పు వాయు వికారము. తద్వికారమే యయిన మలయానిలునందు ఊరువు సంధింపజూచెను. శబ్దము ఆకాశవికారము. తద్వికారమే యయిన అళులమ్రోతవంక శబ్దేంద్రియమును నిలిపెను. పంచ భూతాత్మకమయిన దేహమును ఆపంచభూతములందే కలుపుటకో యనునట్లు ఆమె "పంచశరభూత పరిభూతయై" మరణోద్యోగినిగా గోచరించెను. ఇట్టి విరహాలక్షణమును వియోగమనవలెనో ! యోగ మనవలెనో ! అవును ! ఆమె అచ్చముగు వియోగిని.

(వి)యోగిని కనుకనే మన్మథుడు కూడ యోగియై రసవాదము సేయసాగెను. (2)"ప్రసవశరాఖ్య యోగి"యగు నాతని సంకల్పములు పెక్కుతీరులు. అతడు తలచినచో సర్వేంద్రియ సమ్మూర్ఛనము కలిగింపగలడు. వాని తాకిడి కోర్వలేని గిరికకు దేహజ్ఞానమే సన్నగిల్లినది. ఇక అలంకారములమాట యెందుకు? బాహ్యదృష్టి సన్నగిల్లి విలక్షణమయిన మౌనమెుదవినది.

ఈ మన్మథుడు కేవల రసవాదయోగీశ్వరుడే కాని మహాయోగి కాడని ఆమెకు తెలియును. అయినను పెనుభూతము వంటి వానిని వదలించుకొనుటకు వానిని ప్రసన్నుని చేసికొనవలెను. చెలులాపనియే చేసిరి. వారు మన్మథుని ధ్యానించిన తెఱగు విప్రయోగినిని తేర్చురీతిగా కాక కేవలము భగవత్సాక్షాత్కారముకయి చేయు భక్త్యుపాసనా రీతిగా నున్నది.

"ధ్యానంబు హృదయవాస్తవ్య కుటుంబికి
ఆవాహనము జగద్వ్యాపకునకు
అర్ఘ్యపాద్యములు నారాయణప్రియసూతి
కభిషేక మబ్ధి కన్యాంకశాయి
కలువదోయిళ్లు పువ్వులవింటి దొరకు గం
ధము గంధగిరిమరు ద్బాంధవునకు
ధూప మపరిమిత పరితాపోష్మసురభికి
దీపంబు తిమిరభయావహునకు.
మధురస ఫలోపహారంబు మధుపకీర
పరిజన పరాయణున" కంచు భక్తి నొసఁగి
'మానమథనాయ! మదనాయ! మధుసఖాయ!
మనసిజాయ! నమోనమో' యనుచు మ్రొక్కి." (3- 70)

ఇట్లు ధ్యానావాహనార్ఘ్య పాద్యాభిషేక పుష్పగంధ ధూపదీప ఫలోపహారముల సమర్చనముచేసి 'నమోనమో' యని మ్రొక్కెడు తెఱగు భక్త్యుపాసనా లక్షణముగా భాసించుచు వియోగాంతర్గతమైన భక్తి యోగముగా గోచరించుచున్నది. ఇచ్చట భూషణకవి భక్తియోగమే వియోగినియగు గిరికా భక్తియోగముగా పరిణమించినదేమో!

1) వసుచరిత్రము (?-118) (2)-వ.చ 3-106)

మొదలు మన్మథునిట్లేల ధ్యానింపవలసివచ్చె ననగా అతడసాధ్యుడు (1) లోకత్రయీరాజయోగాత్సేకము తెలుపు నాతని పడగ నారాయణ ప్రథమమూర్తి. ఇరువుర నొకచో చేర్చు వాని బాణప్రయోగ చాతుర్యమునకు వామార్ధజాని యాద్యనిదర్శనము. బ్రహ్మయంతవానిని తన బాణముపయి నిలిపిన జాణ, ఇన్నిమాటలెందుకు? త్రిమూర్తులే వానిధాటి కోడిరి. త్రిమూర్త్యాత్మకుడగు సూర్యుడొక లెక్కయా? పద్మినీకాముకుడై యాతడు వాని యాజ్ఞదాటలేడు. అట్టి మహానుభావునకు కాంత లనగా నెంత? మూడుపాదములందు త్రిమూర్తి దంపతుల నభివర్ణించి నాల్గవపాదములో పద్మినీ సూర్యులను వర్ణించుట వసుచరిత్ర మందలి పలుపద్యముల (సీసములు)లో కానవగును. సర్వసృష్టిమయాత్మకుడగు సూర్యునితో నభిన్నుడుగా నభివర్ణింపబడు వసురాజు బ్రహ్మతేజోమయుడు. గిరికా గతమగు తత్ప్రణయోపాసనము లోకోత్తరముగా భూషణకవి నిరూపించెను. ఆతడు ప్రణయోపాసనాత్మకమయిన తత్ప్రేమయోగము ఏకాగ్రస్థితి నందుట కెన్ని దశాభేదములును వర్ణింపవలెనో వానినన్నిటిని ధ్యాన, ధారణ, మననాదికముగా వర్ణించి సమాధ్యవస్థను పొందునట్లు నిరూపించెను. ఒక్కమాటలో చెప్పవలెనన్న గిరికా వసురాజయోగమును ప్రకృతి పురుషయోగముగా భావించి వసుచరిత్ర తత్త్వమును భూషణకవి ప్రౌఢముగా నావిష్కరించెను.

౬

వసురాజ చరిత్రము సంస్కృత భారతములో సుమారు డెబ్బది శ్లోకముల వఱకు విస్తరించి యున్నది. భూషణకవి అందలి ఒక్క అయిదారు శ్లోకములలోని కథాంశమును మాత్రమే గ్రహించెను. అనగా "శుక్తిమతీ కోలాహల సమాగము వసురాజు కోలాహలోద్ధతి వారించుట, వసుపదగిరికా జననము, వసురాజు వసుపదుని తనకు సేనా

పతిగను, గిరికను పత్నిగను స్వీకరించుట" అను నీముఖ్యాంశమునే విపులార్థవంతముగ ప్రబంధీకరించెను.

కథోపక్రమము ప్రబంధసాధారణముగా నున్నట్లు కనిపించినను అంనొక ప్రత్యేకత కలదు. 'పూర్వ మేరాజేంద్రుఁడు దివ్యచిహ్నధరుడై ధాత్రిని పాలించెనో ఆ రాజేంద్రుని కథ మాకు తెలుపవలసిన" దని శౌనకాది ముని రాజులు సూతునడిగిరి. ఇచ్చటి ప్రత్యేకత ఏమనగా ఋషులలో రాజులనదగినవారు రాజులలో ఋషియనదగిన వాని వృత్తాంతము వినవలచుట. ఇచ్చట "రాజేంద్రు" డనుసమాసమందలి ఇంద్రశబ్దము కేవల శ్రేష్ఠవాచకము కాదు. ఆరాజు దివ్యచిహ్నధరుఁడు, ఊర్ధ్వలోకప్రభునయిన ఇంద్రునితో సమానుడని భావము. ఈమాటలో నుత్తరకథార్థ సూచనముకూడ కలదు.

వసురాజు చేదిదేశప్రభువు. మూలమందును నట్లేయున్నది.

"సచేది విషయం రమ్యం వసుః పౌరవనన్దనః
ఇన్ద్రోపదేశాజ్జగ్రాహ రమణీయం మహీపతిః" వ్యాసభారతము

చేదిదేశమునకు రాజధాని యేదో వ్యాసుడు చెప్పలేదు; నన్నయ్యకూడ చెప్పలేదు. కాని రామరాజభూషణుఁడు చేదిదేశాధిపతికి "అధిస్థానము" ముఖ్యపట్టణమని చెప్పెను. అమూలకమయిన యీ అధిస్థానము భూషణకవి స్వతంత్రసృష్టి.

ప్రబంధమంతయును అంతరదృష్టితో పరిశీలించినచో వసురాజ తత్త్వము ననుసరించియే భూషణకవి యీరాజధాని కీపేరు పెట్టెనని తోచును. వసురాజందఱు రాజులవంటివాఁడు కాఁడు. రాజ్యము వేఱు, తానువేఱు నను భావమాతనికిలేదు. బ్రహ్మానంద సంధాయకమయిన గిరికావయవములను దర్శించునపుడుకూడ నాతనికి రాష్ట్రావయవము లే

1. వసు చరిత్రము (3—177)

కనిపించె నన్నచో గిరికతో వలెనే రాష్ట్రముతో కూడ నాతని కద్వైత రాగమే కలదని యూహింపనగును.

దేహమునకు హృదయమెట్టిదో రాష్ట్రమునకు రాజధాని యట్టిది. రాష్ట్రముతో నభేదము భజించు పాలకునకు రాజధాని ఆత్మసన్నిభము, అనగా అధిష్ఠానము వసురాజున కాత్మసదృశము. అధిష్ఠానమును వర్ణించుట యనగా వసురాజు నాత్మను వర్ణించుటయే. ఋషికల్పుడగు నొకరాజున కాత్మసదృశము కనుకనే యాపట్టణము నకు అధిష్ఠానమని భూషణకవి పేరుపెట్టెను. "స్వారాజ్యంబును బోలె నింద్రున కధిష్ఠానం బధిష్ఠానమై యారాజన్యున కింపుసొంపెసగు నని వర్ణించెను.

"వర సుమనో భవ్యతరుల కావాల మ
త్యాలఘు కలాపాలి కలరు భరణి;
సరిలేని తెలిముత్తెసరుల కొటారు; క
ల్యాణ పరంపరల తొలుదీవి;
సురుచిరమణుల కాకరసీమ; శ్రుతిహిత
భాషిత ద్విజ కోటి పట్టుఁగొమ్మ
సరసుల కారామ సరణి; శ్రీరంగ గే
హక్రోడనాసిని కాటపట్టు;
వెలయు నావరణాంబు సంవీత హాట
కాండమోహాద పరిఖాద్భుతాంఘ్రి; వజ్ర
దంతురప్రాంత, గంగానిరంతరాగ్ర
భూరివరణం బధిష్ఠాన పురవరంబు." (1-93)

ఆపట్టణమున మంచి పూలచెట్లున్నవి; మహాభరణములున్నవి. కమ్మని ముత్తెసరివస్త్లున్నవి; కావలసిన కాంచనమున్నది. చక్కని రత్నములున్నవి; సుస్వరశుకపికాదు లున్నవి. సరస్సులున్నవి;

(శ్రీ) దేవి యున్నది — ఈమాత్రపుసౌభాగ్యము ఏపట్టణమునకైన నుండును, అధిష్ఠానవిశిష్టత యేమి? అదికొంతవఱకర్థాంతరమున సాధింపబడినది. అచ్చట మహనీయ హృదయులు, సకలకళాశోభితులు, సుందరస్త్రీలు, వేదవిదులు, రసజ్ఞులు, మహానాట్యకోవిదులును కలరు. శుభపరంపరలకు లోటేమి? ... ఇంతమాత్రమేయయిన నదియు నసాధారణము కాకపోవచ్చును.

సీసపద్యమందలి పైనాలుగు పాదములలో ప్రపంచింపబడిన భావమునకు ప్రాణభూతమయిన యర్థము ఎత్తుగీతిలో నిక్షేపింప బడినది. ఇందు పయికి కనిపించునర్థము సామాన్యముగనే యుండును.

అందలి బంగారుకోట, కోటక్రింది యగడ్త జలము, జలమునకు ప్రక్కల తెలిసీరునలెనున్న వజ్రకాంతులు, ఆకాంతులు గంగాజలము వఱకు ప్రసరించుట, అందువలన ఆబంగారుకోట మహాజలముచే నావరింపబడిన హిరణ్మయబ్రహ్మాండమువలె కనిపించుట — ఇత్యాదిక మయిన ఈ బ్రహ్మాండభావనము విలక్షణము. నిగూఢార్థ బంధురము.

ఇందలి 'ఆవరణ' 'అంబు' 'హాటకాండ' 'మోహద' శబ్దములు 'అధిష్ఠానం' శబ్దముతో విడదీయరానివి. అద్వైత సిద్ధాంతము ననుసరించి వీనికి సంప్రదాయార్థస్ఫూర్తి కలదు. ఏతదర్థము ననుసరించి చూచిన భూషణకవి తాత్త్వికదృష్టి గోచరింపగలదు.

ఆవరణము లనగా ఆవరణాష్టకము, పంచభూతములు, అహంకార మహత్తత్త్వములు ప్రకృతితో కూడిన ఆవరణాష్టకమగును. అంబుశబ్దము లక్షణార్థముచే మాయార్థద్యోతకము. హాటకాండమనగా హిరణ్యగర్భమగు బ్రహ్మాండము. అది బ్రహ్మపర్యాయము. మోహశబ్దము భ్రాంత్యర్థస్ఫోరకము. ఈ శబ్దము లధిష్ఠానశబ్దముతో విడదీయరాని పరిభాష.

ఆవరణాష్టకమనెడి మాయచేత నావరింపబడిన బ్రహ్మమును భ్రాంతిని కలుగజేయు అధిష్ఠానము ఇచ్చట భావింపబడెను.నిజమే! పృథివ్యప్తేజోవాయు రాకాశములును, అహంకారమహత్తత్త్వములును ప్రకృతితోఁగూడి మాయావరణమై బ్రహ్మము నాఛ్ఛాదించుట సహజమే. అట్టి బ్రహ్మమును భ్రాంతికలిగించెడు అధిష్ఠానము వసురాజునకు ఆత్మసదృశము. అనగా వసురాజు బ్రహ్మమయుడని భావము.

మఱికొంత దూరము పోయిచూచిన ఈవిషయము స్పష్టము కాగలదు. అధిష్ఠానశబ్దమునకు 'ఆవాస' 'ఆక్రమణ' 'ప్రభావము' లనునవి కేవల నిఘంట్వర్థములు. సంప్రదాయార్థము వీనికంటెభిన్నము; మహార్థవంతము. వేదాంతశాస్త్రప్రకరణ గ్రంథములు పెక్కింటిలో నీశబ్దమునకు ప్రసక్తి కలదు.

శంకరభగవత్పాదులు ప్రస్థానత్రయములో శ్రుతిప్రతిపాదిత మయిన అద్వైతసిద్ధాంతమును స్వసిద్ధాంతపోషణ ప్రతిపక్ష నిరసన పూర్వకముగా అతిప్రౌఢపద్ధతిని నిర్ణయించెను. సర్వజన సంవేద్యముగా నుండుటకో యనునట్లు ఆసిద్ధాంతమునే ఉపదేశసాహస్రి సర్వవేదాంత సంగ్రహాది గ్రంథములలో అతిమనోహరముగను సుగమసుందర ముగను ప్రతిపాదించెను. అదేసిద్ధాంతము జిజ్ఞాసు గమ్యమగు మనోజ్ఞపద్ధతిలో మహావాక్య దర్పణమందును గోచరించును.

అధిష్ఠానశబ్దము మహావాక్యదర్పణములో నేప్రకరణార్థములో ప్రయోగింపబడెనో గమనార్హము.

"విజ్ఞాతే సత్యధిష్ఠానే పరేబ్రహ్మణి కేవలే
అతీత మఖిలం విశ్వం బ్రహ్మమాత్రం భవేత్స్వయమ్" — 
"విశ్వం బ్రహ్మభిన్న మేవ స్వయం భవితు మర్హతి

అధిష్ఠానానతిరిక్త స్వరూపత్వాద్గుణాహివత్." — ౧౧౭

"అధిష్ఠానే పరిజ్ఞాతే సచ్చిదానందలక్షణే

బ్రహ్మైవ సకలం విశ్వం భోక్తృభోగ్యాది లక్షణమ్." —౧౧౮

"ప్రపంచమునకు అధిష్ఠానమయిన (ఆరోపించుట కాధార మయిన) కేవల పరబ్రహ్మము నెఱిగినచో ఈప్రపంచమంతయు బ్రహ్మరూపమే యగును.

సర్పము దాని అధిష్ఠానమగు (ఆశ్రియమగు) రజ్జువుకంటె వేఱుకానట్లే ఈప్రపంచముకూడ స్వాధిష్ఠానమగు బ్రహ్మముకంటె వేఱుగాదు.

పప్రంచభ్రాంతికి అధిష్ఠానమై (ఆధారమయి) సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమును బాగుగా గుర్తించినచో ఈ ప్రపంచ మంతయు బ్రహ్మమేయగును. భోక్తృభోగ్యభోగాత్మక సర్వభేదములు బ్రహ్మముకంటె భిన్నములుకావు." — ఇది దీనియర్థము.

ఇట్లీఅధిష్ఠాన శబ్దము 'ప్రపంచమున కాధార భూతమయిన బ్రహ్మము' అనునర్థములో అద్వైతసిద్ధాంతమున పరమప్రిహితము.

'విశ్వం బ్రహ్మభిన్నం అధిష్ఠానానతిరిక్త స్వరూపత్వాత్ రజ్జు సర్పవత్' అనునది అనుమాన వాక్యస్వరూపము. బ్రహ్మవివర్తమయిన ఈ ప్రపంచము బ్రహ్మముకంటె వేఱుకాదు. కాని బ్రహ్మముకంటె వేఱైనట్లు కనిపించును. అట్లు కనిపించుటయే భ్రాంతి; మోహము; అది మాయాజన్యము.

'దీర్ఘీకుర్వన్'– అన్నట్లు కొంచెము దూరమయిన స్పష్టతకై యింతగా చెప్పవలసివచ్చెను. ఇక ప్రకృతము.

వసురాజు నధిష్ఠానదుర్గము హిరణ్మయ బ్రహ్మాండము కాదు. బ్రహ్మాండమేయను భ్రాంతి కలిగించుచున్నది. రజ్జువు సర్పభ్రాంతి

౭

'మంజువాణి' '**మాయతపసి**'— భూషణకవి సృష్టించిన మహా ద్భుత పాత్రములు. వాఙ్నైపుణ్యములో ఇరువురును ఒకరికొకరు తీసి పోనివారు. గిరిక వృత్తాంతము తొలుత రాజునకు నివేదించినవాడు నర్మసచివుడు. కలస్వనము వినవచ్చిన దిక్కుగాబోయి తద్వృత్తాంతము తెలిసికొనివచ్చుటకై అతడుప్రభువుతో "జపివేషమునపోయెద"ననెను. కాని ప్రభువు "ఏగతి యోగి రూపము వహించెదో! ఏగతి ప్రోధి మించెదో!" అని తద్వేష నిర్దేశము చేయువాడువోలె భాషించెను. జపి కేవల జపతత్పరుడు. వానికంటె యోగతత్పరుడగు యోగి గొప్పవాడు. నర్మసచివుడు గడిదేటి ఒక జడదారి యయ్యెను. నియమ స్థేమాయుతు డయిన తపసి యయ్యెను. జరజరపోయి మంజువాణి యంతటి మహా మేధావినినిగూడ ఊపిరి సలుపని స్థితిలోనుంచి గ్రంథము నడపెను. వినీతయై గిరిక అతనికి మ్రొక్కెను. "అనన్యకన్యా సామాన్య లావణ్యా ప్రభావసువల్లభుం బెండ్లియాడు" మని మనోహరమగు అర్థాంతర స్ఫూర్తితో దీవించెను.

ఈ మాయ తపసి మనుచరిత్రలోని సిద్ధుని తలలో దూటిపోయిన వాడు. కన్యాజనమునకు తన వృత్తాంతము వివరించుచు "ఉద్యానగతు డయిన తనస్వామితో తాను వచ్చినట్లు చెప్పెను. శ్లేషశక్తిచే వసు రాజే తన స్వామియని స్ఫురింపజేసెను. తదీయ రహస్యమంత సంభా వనచే అనాదిముని మార్గము గాంచితిననియు చెప్పి వారికి నమ్మిక పుట్టించెను. తెలివిగా రాజును వారి నడిమికి తెచ్చు నుపాయము పన్ని కృతకృత్యుడయ్యెను. పని గడచిన తరువాత అవ్వలికిపోయి వేసము మార్చుకొని అచ్చపు మంత్రియై రాజు నరయుచు వచ్చెను. మంజు వాణి యంతటి మేధావిని గూడ తన తెలివితక్కువకు సిగ్గుపడి చూచు

నట్లు వాడు చాలగడుసుగా నటించెను. వాడు 'అతుల ప్రౌఢవచోనుభావముల ప్రోవు'.

గిరికను చూచివచ్చుటకై నర్మసచివుడు వచ్చినట్లే మంజువాణియు నటుపిమ్మట వసురాజును చూచిపోవుటకై అధిష్ఠానమునకు వచ్చెను. వసురాజ వృత్తాంత మరసిపోయి గిరిక నూరార్చుట ఈ ప్రయాణ పరమార్థము. దానిని సాధించుకొని తిరిగి గిరికయొద్దకుపోయి ప్రభు వృత్తాంతము వివరించి చెప్పుచు అధిష్ఠాన పట్టణమును వర్ణించెను. అర్ధరాత్రిమున నది యెట్లున్నదో వర్ణించెను. 'ప్రోలు ప్రశాంత ఘోషమై పూర్ణసమాధి' నున్నట్లు తోచెనట!

మంజువాణి భూషణకవి నోటినుండి యూడిపడిన మంజులవాణి సమంజసవచన చాతురీ రంజితయగు నెరజాణ.

మంజువాణి ప్రయాణ కథనము మిగుల మనోజ్ఞముగానున్నది. ఆకసమున కెగసిపోయినదట. నేలనుండి నింగి కెగురునపుడు వస్తుజాల మెట్లు గోచరించునో తద్రీతి ననుసరించి వర్ణించెను. వసురాజ రాజధానిని గుర్తింప గలిగెనట. నిరతిశయ సౌభాగ్యోపేతమయిన యా పట్టణములో ఘనసారాది వాసనలు గుబాళించెను. మనసు తీర మూర్కొని గగన గమన శ్రమము పోపికొనెను. మెల్లగా నొక మేడ మీదిభాగమున వ్రాలెను. అదె ఇదె వింత నీడ యని ఆరెకు లారక సంభ్రమించిరి. పావురములు బెదరి చెదఱి కోణిగ చేరక నింగి కెగుర సాగెను. నెమిలిచానలు నిదుర లేచి అెక్కలు విదుర్చుచు రొదచేయ సాగెను. నెమిలిచాన లనుట స్త్రీజనసంచారమున కుపలక్షకముగా వచ్చెను. అది అర్ధరాత్రము. అధిష్ఠానము కనిపించెను. వసురాజును భావించుచు చూచిన మంజువాణికి అధిష్ఠానము పూర్ణసమాధి యందున్నట్లు గానబడెను.

మంజువాణికి పట్టణమందలి వేశ్యావాటిక కనిపించెను. కాముకుల కంఠసీమలు బిగ్గకవుంగలించుకొని రతిశ్రమము తీర్చుకొనుటకుముంగి ళ్ళలో నున్నవారు కొందఱు, కోపించిపోవుచు ప్రియులు నిలిపినను నిలువక ఉరగాంగనలవలె కెరలువారు కొందఱు, మదనమంత్రి రహస్యములు పెంపుడు చిలుకలకు నేర్పువారు కొందఱు - అందఱు భోగినులే!- కొందఱు అంకుటాంద్రము తెగించి, పండు వెన్నెలలను గాని, చంద్రకాంత శిలాంబువుల వెల్లువలనుగాని, రత్నదీప కాంతులను గాని, తలారుల సందడినిగాని సరకుసేయక విటుల సంకేతస్థలములకు నిర్విచార ముగా పోవుచుండిరి.

మంజువాణికి ఇట్టి వేశ్యావాటిక కనిపించినది. అది అధిష్ఠాన పట్టణ వేశ్యవాటికయే.

ఇంతటి మహాభోగ లక్షణముగల వసురాజు పోలు ప్రాజ్ఞ సమాధి నిష్ఠమైయుండెననుట అచ్చెరువు గొలుపును. గిరికా సంలగ్న మానసుడై యున్న వసురాజుమనస్సంయమస్థితికి అధిష్ఠాన ముపలక్షకమై యుండునా?

మంజువాణి నృపుని మంగళధామము చూచెను. ఆమెదిగ్భ్రాంతి చెందెను. ఆ మంగళధామము ప్రహరి చుట్టును తిరుగుచు ప్రభువును సేవించు యక్షచారణ నాగగంధర్వ కాంతలు కనిపించిరి. యక్షాంగనల పుష్కరవాద్య ధ్వనులు, చారణ కన్యల పటువాక్చమత్కృతులు, నాగకన్యల మహామణిదీపకాంతులు, గంధర్వభామినుల సుస్వరకంఠ ధ్వనులు- వసురాజేంద్రుని దివ్యమైభవమునకు మంజువాణిప్రమోన్పడెను.

ఆమె యా రాజేంద్రుని చూచెను. 'చెంగల్వ మొగడలు జాలు సేసకొప్పుతో, తెలికప్పురపు పాలకాయకుండలముల కాంతితో, తమ్మినూలి జందెముతో, పలుచని వలిప దువ్వలువతో, పుష్పాడి

పఱుపుపై నొత్తిగిల్లి ముఖారవిందము తలాడపై మోపి చిత్రఫలక మీక్షించుచు - అంతర్ముఖుడై యున్న ప్రభువు గోచరించెను. ఆ చిత్ర ఫలకము గిరికదా? వేఱొకరిదా? అను సందేహముతో మంజువాణి సౌధదీపిక మాటున డాగి తిన్నగా చూడసాగెను.

మహారాజు మేడలో మదన దేవతలవంటి ముగ్ధసుందరీమణు లున్నారు. వారు వసురాజ సమీపమున ఒక వంక చనుమొనలు పయికి కనబడునట్లు ఒత్తిగిలి పరుండి నిదురించు చుండిరి. వారు ఉడిగపు చదురులు తెలిసిన జాణలు. నిద్రాపారవశ్యమునందుండియు ప్రభుసేవలోని మెలకువలు మఱువరు. చన్నులమీది బంగరు కిన్నర గాలికి మొరయుచుండ నిదురమత్తులోనే ఒక తెనట్టి బయలు మీటుచు చేయాడించునట. ఇట్లే ఎంద ఱెందఱో వాసనాబలమున వసురాజ సేవలు విస్మరింపరు.

అనంగ దేవతలవంటి ఇందఱు స్త్రీల నడుమ అగ్రరాత్రమున నిశ్చలధ్యాన మగ్నుడై గిరికా వియోగ మనుభవించు వసురాజును మంజువాణి దర్శించెను. వలపు రాయబారము సఫలీకృతమయ్యెను. ఱెక్కలుగట్టుకొని గిరికయొద్దకు వచ్చివాలి తద్వృత్తాంత మామెకు వివరించెను. ఆ సందర్భమున అధిష్ఠానమును వర్ణించుచు ఆమె ఆప్రోలు ప్రశాంత ఘోషమై పూర్ణసమాధి నిష్ఠయందుండెనని వివరించెను.

నిజమున కాపట్టణము ప్రశాంతఘోషముగా లేదు. విచ్చలవిడి విటులతో వెలయాండ్రవర్తనము, అంకుటాండ్రి నిర్భయ సంచార ములు, తఱచైన తలవరుల హెచ్చరికల అడావుడులు మొదలుగా నగరములో ఘోషమున్నది. అయినను మంజువాణి కది ప్రశాంత ఘోషముగా గోచరించుట వసురాజ మనస్స్థితి దాని కన్వయించుట

కలిగించునట్లు— సర్వప్రపంచము ఎట్లు బ్రహ్మవివర్తమో వసురాజ దుర్గమును అట్లే బ్రహ్మవివర్తమే. కాని బ్రహ్మముకంటె వేఱైనట్లు కనిపించుటకు కారణము ఆవరణాంబు సంవీతమగుటయే. మాయావరణాచ్ఛాదితమయి బ్రహ్మము యథారూపముతో గోచరింపక బ్రహ్మమను భ్రాంతిని మాత్రమే కలిగించును. మాయావృత బ్రహ్మలక్షణమిదియేకదా!

భూనివరణ స్వరూపాత్మకమగు అధిష్ఠానము వసురాజున కాత్మభూతము అనగా అతడు బ్రహ్మమయుడని ఫలితార్థము. శ్రుతి ననుసరించి చెప్పదగిన యర్థమిదియే. కనుక "శ్రుతిహిత భాషితద్విజకోటి పట్టుకొమ్మ" యగు అధిష్ఠానము బ్రహ్మమయుడగు ప్రభువున కాత్మభూతమగు ననుటలో ఆశ్చర్యము లేదు.

శబ్దములకు నిగమాగమ రహస్య సంకేత యూఢి యౌగిక తత్త్వార్థము లనేకములుండవచ్చును. సంప్రదాయార్థములను సంప్రదాయదృష్టితోనె యవగతము చేసికొనవలెను. ఆ దృష్టి కొఱవడిన యర్థము అనర్థము.

అధిష్ఠాన మారాజున కాత్మభూత మనదగినది. అది ఆత్మ నిత్యము. నిత్యమయిన ఆ యాత్మవలన అవ్యక్తము. దానివలన మహత్తత్త్వము, దానివలన అహంకారము. ఇవి బింబ ప్రతిబింబ క్రమానుగతములు ఆత్మనిర్గుణము. అయినను తజ్జన్యమయినఅవ్యక్తము సగుణము అనగా సత్త్వరజస్తమోగుణ సంవలితము. అట్టి అవ్యక్తజన్యమయిన మహత్తత్త్వము వ్యక్తావ్యక్తరూపము. తజ్జన్యమయిన అహంకారము వ్యక్తరూపము. అహంకారమునుండియే ఆకాశాది పంచభూతములు. అవి శబ్దస్పర్శాది గుణ సహితములు. వీనినుండి అనేక వస్తువులుత్పన్నములు. ఇవి యన్నియు తిరిగి అవ్యక్తమందే లీనములగును.

అవ్యక్తము ఆత్మయందు లీనమగును. ఈ అవ్యక్తాత్మలనే యుపనిష త్తులు ప్రకృతి పురుషులని పేర్కొనెను. ఆత్మపురుషుడు; పరిపూర్ణుడు. ²అవ్యక్తము ప్రకృతి. అది పరమేశశక్తి. ఆపరమేశశక్తి పార్వతి. గిరిక యనగా పార్వతియనియు అర్థము. మునులామెకు ఆదృష్టితోనె నామకరణము చేసి రనవచ్చును.

ప్రకృతి పురుషుల వియోగమునే దార్శనికులు ఒక యోగముగా దర్శించిరి.

భూషణకవి గిరికావసురాజుల వియోగము నట్టిదృష్టితోనె వర్ణించెను.

3) యోగమనగా చిత్తవృత్తి నిరోధము. చిత్తవృత్తులనగా జాగ్రన్నిద్రాస్వప్నములు. ఈమూటిని నిరోధింపకలుగుట యోగము. నిరోధించుట యనగా నిర్మూలించుట యనిఅర్థముకాదు. ఆమూడవస్థల నధిగమించి చిత్తము నేకాగ్రము చేయకలుగుట. ఈ ఏకాగ్రత నిర్వికల్పమై పూర్ణమగుచో అది పూర్ణసమాధి. దానికి యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణ మననములు అవ్యవహిత క్రమ పూర్వావస్థలు. ఇట్టి సమాధిస్థితిలో నిరతిశయానందముకలుగును.

వసు పురుష గతమయిన గిరికా ప్రకృతి యందును గిరికా ప్రకృతి గతుడయిన వసురాజునందును వియోగ రూపమయిన ఒకానొక యోగ సంసిద్ధిని భూషణకవి దర్శించెను. తదనుగుణ దశావిపరిణామమును వారి మనోవాక్కాయములలో నిరూపించెను.

గిరికా వియోగ తప్తుడగు వసురాజు శయ్యాగృహమున పరుండియుండెను. వసురాజు వృత్తాంత మరసివచ్చెదనని గిరికయొద్ద

---

1. పురుషశ్చ అధిదైవతమ్ 2. అవ్యక్తనామ్నీపరమేశశక్తి
3. యోగఃచిత్తవృత్తినిరోధః

నుండి బయలు దేరి మంజూవాణి అధిష్ఠానమునకు ప్రచ్ఛన్నరూపిణియై వచ్చెను. మెల్లగా వసురాజు శయ్యామందిరము సొచ్చెను. వియోగతప్తుడగు నాతని కంఠమున గిరికా ముక్తాహారము నుంచెను. అతని కాముక్తాహార స్పర్శ విలక్షణమయిన అనుభూతినికలిగించెను. "నిర్వేల మూర్ఛాపనోదన దివ్యామృతధార" యైనది. అది తన భాగ్యాక్షర పంక్తి యనుకొనెను. తన కంఠమునందెట్లు పడెనో తెలియదు. ఆ హారమునుద్దేశించి ఇట్లనెను.

> శుక్తి క్రోడకుటీ గుహావసతియై సూర్యాగ్నిసంస్థాయియై
> ముక్తాహారమవై భజించితిగదా ముగ్ధాకుచద్వంద్వ సం
> సక్తిన్, ద్వాదృశభూతి తావక కృపాసంసిద్ధి లేకబ్బునే
> ముక్తాహారత నున్నయంతనె తలంపుల్ నింపు నాకింపుగన్.
>
> (4-105)

గిరికాకుచసీమ నధిష్ఠించు భాగ్యమున కాముక్తాహారము ఎంత తపస్సు చేసినదో తానును అంతటి తపస్సు చేసినగాని అట్టి మహావైభవము రాదు. గుహలందువసించి సూది మొనపై నిలిచి నిరాహార దీక్షతో నుండుట తపశ్శీలి లక్షణము. ఇట్టి భావనము వసురాజున కేల రావలెను? అతని ఆత్మ గిరికా ప్రకృతి గతసమాధినిష్ఠ కాంక్షించు చుండెనా? కావచ్చును. ఆలక్షణమే అధిష్ఠాన పట్టణమున కన్పించి మంజువాణి గిరికయొద్దకు తిరిగి వచ్చిన పిమ్మటగంభీరముగ వర్ణించి చెప్పినది.

> "సాలము యంత్రపీఠము, విశాలకవాటిక ఘట్టనంబు ద్వి
> జ్మీలన మైందవామృత సమేత పతాకిక జిహ్వ; చంద్రికా
> జాలము భూతిపూత, నవచంద్ర శిలాంబువు లశ్రుధారగాఁ
> బ్రోలు పరిశాంత ఘోషమయి పూర్ణసమాధిఁ జెలంగె
>
> నయ్యెడిన్. (4-64)

అర్ధమరేయి సద్దుమణగిన వసురాజ రాజధానీ స్వరూప మిట్లుండెను. స్వాధిష్ఠాన స్వరూపము తెలిసిన రాజయోగియగు వసురాజునాత్మ ప్రతిబింబ మిది. ఆ విశేషము నసిపట్టి మంజువాణి పలికిన మాట ఇది.

ఈ పద్యమున వర్ణింపబడిన సమాధి పూర్ణ సమాధియే. నిండయిన లంబికా యోగసమాధి. శబ్దాదివిషయములందు శ్రోత్రాదులు వర్తించువరకు చేయునది ధ్యానము. శబ్దాదులనుండి పూర్తిగా నివర్తించి మనస్సు ఆత్మతో లయించుట సమాధి. సమాధినిష్ఠుడు యంత్రపీఠము వైచుకొని కనులు రెండు మూసికొని సహస్రార కమలచంద్రునినుండి అమృతము నాలుకయందు స్రవింపగా సద్దులేక శాంతుడై యుండును.

మంజువాణి చూచివచ్చిన అధిష్ఠానము అర్ధరాత్రిమున నిట్లుండెను, పట్టణమునకు ప్రాకారము, మూయుటకు వీలయిన కవాటములు, ధ్వజము, వెన్నెలకాంతులు, కరగిపాఱెడు చంద్రకాంత శిలలు, అర్ధరాత్రిమున నిశ్శబ్దత– ఇవి సహజములు కావచ్చును. సమాధినిష్ఠునకు యంత్రపీఠము, నేత్రనిమీలనము, సహస్రారకమలమునందలి చంద్రమండలము వలన స్రవించెడు అమృతముతో గూడిన నాలుక, విభూతిపూత, ఆనంద బాష్పధారలు, అడగినప్రాణఘోషము సహజములు. పట్టణమునకును పూర్ణసమాధినిష్ఠునకుగల సామ్యమును భావించి భూషణకవి మంజువాణిచేత అధిష్ఠానము పూర్ణ సమాధినిష్ఠ యందున్నట్లు వర్ణింపజేసెను.

నిజమునకు అధిష్ఠానము సమాధినిష్ఠయందు లేదు. అధిష్ఠానగతుడగు వసురాజు మనస్స్థితి కిది ఉపలక్షకము.

మంజువాణి పలుకుటచే ఈమాటలు మిక్కిలి సారభూతములు; మహార్థవంతములు.

వలననే కావలయును. ఇక్కడనొక ఆశంక. "మంజువాణి మున్ముందు అధిష్ఠానమును చూచి అటుపిమ్మటకదా సౌధాంతర్గతుడగు వసురాజును చూచినది! ముందే వసురాజువలె నున్నట్లు అధిష్ఠానమెట్లు కనిపించును?—" అని. మంజువాణి పట్టణమును చూచిన వెంటనే గిరికకువర్ణించి చెప్పలేదు. ప్రయాణమంతయుముగించుకొని గిరికదగ్గఱకు వచ్చి చూచిన విశేషములు భావనాలోకమున సమీక్షించుకొనుచు ఫలితార్థము నివేదించుచు పలికిన సందర్భములోని దీవర్ణనము. ఆ పలుకుటలో వియోగియై సమాధినిష్ఠునివలె గోచరించిన వసురాజ మనస్థితిని ఆ ప్రభున కాత్మభూతమయిన అధిష్ఠానమున కన్వయించి చెప్పెను. అనగా ప్రభుసమాధినిష్ఠ పట్టణమునకు అతిదేశింపబడినదని భావము.

అసలు వలపురాయబారమునకు పోయివచ్చిన మంజువాణి వట్టివలపుసుద్దులుచెప్పి గిరికను తేర్పక ప్రాణసమాధి నిష్ఠాదికమయిన యీ యోగభావనా ప్రపంచనమెందులకు చేసెను? ఇట్టిభావనారీతి మోక్షకారకమగు శాంతమున కుపలక్షకమగు చున్నదే? ఇట్టివైరాగ్య భావస్ఫూర్తి శృంగారరసమునకు భంజకము కాదా?....కాదు...... కాదు సరికదా ఆ శృంగారమున కిది పోషకమే యగును. ఎట్లన, వసురాజసంబంధియగు సమాధినిష్ఠ గిరికావియోగ సంప్రాప్తమే కదా! తత్సమాధినిష్ఠలో తొరగిన అశ్రుధార గిరికా సంభావనా సిద్ధమయిన ఆనందాశ్రుధారయేకదా! కనుక తదాలంబన విభావన మయిన శృంగారమున కవి పోషకమే. ఈ రహస్యము తెలిసియే మంజువాణి సంభాషణ మట్లుపక్రమించినది.

గిరిక వసురాజునకు కానున్న కులాంగన.

భూషణకవి ఈ కులాంగనా ప్రసక్తి యోగపరిభాషలో మంజువాణీ ముఖమున ధ్వనింప జేసెను.

*కులాంగన యనగా యోగ పరిభాషలో కుండలినీ స్వరూప పరాశక్తి. అద్వైత (శ్రీ) విద్యా సంప్రదాయములో కుండలినియనునది సుషుమ్నా నాడికిగల పేరు. మానవ దేహమునం దీనాడి సర్పాకార ముతో నుండునట. కనుకనే దీనికి కుండలిని యని పేరు. అధోముఖ మయిన యీ కుండలినీ శక్తిని సాధకు డభ్యాసవశమున ఊర్ధ్వగామిని చేసి దేహమందలి మూలాధార, స్వాధిష్ఠాన (స్వ + అధిష్ఠానము) మణిపూర కానాహుత విశుద్ధాజ్ఞాచక్రములపై గమింపచేసిన, వానిపై నున్న సహస్రారకమలము నందలి అమృతబిందు స్రావముచే నిగతిశ యానందము పొందునని వామకేశ్వర, తంత్రసార, సమ్మోహతంత్ర, హఠయోగ దీపికాదులు ఘోషించు చున్నవి.

సహస్రారకమలము బ్రహ్మరంధ్రమున కధోభాగమున కలదు. ఆ సహస్రారకమలమునందే చంద్రమండలము కలదు. అది శివ స్వరూపము. తేజోమయము. మూలాధారకమలము కటి ప్రదేశము నందు కలదు. అచ్చటినుండి సహస్రారము వఱకు వ్యాపించియున్న సుషుమ్నయను పరానాడి విద్యుల్లతవలె మహాకాంతిమంతమై సూక్ష్మా కారము కలిగి స్వాధిష్ఠానమునందున్న ఊష్మలతను సహస్రారమువఱకు వ్యాపింపజేయును. సహస్రారాంతర్గత చంద్రమండలమందలి ఘనీభూతా మృతము ఈ ఊష్మలతచే ద్రవించిస్రవించును. ఇట్లు స్రవించు నమృత మునే భూషణకవి అధిష్ఠానపురవర్ణనములో "ఐందవామృతము" అని పేర్కొనెను. (వ.చ. 4–64) పూర్ణసమాధిలో దేహమునం దూర్ధ్వ ముగా పయనించు కుండలినికి కులాంగన యను పేరు గలదు.

---

* కులాంగన:– కుః పృథివీ తత్త్వం యత్ర లీయతే తత్కులం మూలాధారం తత్రస్థితా కులాంగనా సజాతీయానాం మూలాధారాది ఆజ్ఞాంతానాం కమలానాం సమూహో వా కులం, తత్రస్థితా వా, కుండలినీ పరాశక్తి.

"తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ
శివార్కమండలం భిత్త్వా ద్రావయంతీందుమండలం.
తదుద్భూతామృతస్యంది పరమానందనందితా
కులయోషిత్కులం త్యక్త్వా పరం సద్మ గణమేతి సా.
కులాంగనైషాప్యథ రాజవీథిం ప్రవిశ్య సంకేతగృహాంతరేషు
విశ్రమ్య విశ్రమ్య వరేణపుంసా సంగమ్య సంగమ్య రసం
ప్రసూతా" — వామకేశ్వర తంత్రే.

కులాంగనా నామక కుండలినీ పరాశక్తి సంకేత గృహములయిన అనాహతాది కమలములందు విశ్రమించుచు సహస్రారమునందలి చంద్రమండలములోని సుధావృష్టివలన సర్వనాడీమండలము బ్రహ్మానందము ననుభవించునట.

ఈ కులాంగనా పురుషుల సమాగమమే సమాధియోక్క పరమ ఫలము.

మూలాధారమునుండి సహస్రారము వఱకునుగల షట్చక్రములలో రెండేసి చక్రములు ఒక్కొక్క స్థానముగా విభజింపబడినవి. 1) మూలాధార స్వాధిష్ఠానోపరి భాగము వఱకు బ్రహ్మగ్రంధి స్థానము 2) మణిపూరక అనాహతక మలోపరిభాగ పర్యంతము విష్ణుగ్రంధి స్థానము 3) విశుద్ధా జ్ఞాక మలోపరిభాగ పర్యంతము రుద్రగ్రంథిస్థానము, బ్రహ్మగ్రంధి అగ్నిమండలము, విష్ణుగ్రంథి, సౌరమండలము, రుద్రగ్రంథి సోమమండలము, బ్రహ్మరంధ్ర వఱకుగలమండలమును తురీయస్థానమందురు. తురీయమనగా నాలుగవయది యనియు బ్రహ్మమనియు నర్థము.

బ్రహ్మగ్రంధి స్థానము నుండియు ఈతురీయ స్థానమువఱకునున్న బయనించు కులాంగనా మార్గములో మూలాధారకమునకు సన్నిహి

తమై స్వాధిష్ఠానము (స్వ+అధిష్ఠానము) కలదు. బ్రహ్మగ్రంథి స్థాన మయిన ఇచ్చటినుండి కేవల బ్రహ్మమని జెప్పదగిన తురీయస్థానము వఱకు కులాంగనాయానము జరిగి బ్రహ్మానందము కలుగుచున్నది. ఈ యానందమునకు కారణభూతమై కులాంగనా మార్గములో మూలాధారముపై అధిష్ఠానమున్నది. సమాధినిష్ఠలో అధిష్ఠాన ప్రాధాన్యమిట్టిది.

మంజువాణి అధిష్ఠానమును సమాధినిష్ఠునితో పోల్చుటలో నింతటి మహార్థ మిమిడియున్నది.

ర

అంతర్ముఖుడగు వసురాజ పురుషునకు గిరికాకులాంగనా సమాగమ మెట్లు బ్రహ్మానందదాయకమో మంజువాణీ ముఖమున భూషణకవి ప్రౌఢముగా సూచించెను. ప్రకృతి పురుషులనదగిన గిరికా వసురాజుల సమాగము మహాసుఖమునే కవి కావ్యాంతమున

"సతిసాహిత్య రహస్యమీశు వలనన్ సాధించితో డ్తోన త
త్పతికిన్ ప్రత్యుపదేశ మిచ్చె" ననియు. (6-94)
"భూనాథాగ్రణికిన్ వధూమణికి సంభోగాంత సౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబు తెల్పె" ననియు (6-95)

స్పష్టముగా వర్ణించెను, ఇచ్చట ప్రయుక్తమయిన బ్రహ్మానంద మీరీతిగా నిర్దిష్టమయిన సంప్రదాయార్థమును సూచించుచున్నది కాని అతిశయోక్తి సూచకము కానేకాదు. కనుకనే తత్సంభోగాంత సుఖము" క్రమ విముక్తానేక బంధానుసంధానంబై అపునర్భవ ప్రభవ ఖేదం" బగుచున్నది.

స్థూలదృష్టితో పరిశీలించినచో ఇట్టి వర్ణనములలో భక్తి శృంగారములు ఏకాకృతి వహించినట్లు గోచరించును. ఇహాపరములు పరస్పర మెంత సన్నిహితములో శృంగార భక్తిభావములు నంతే.

విచిత్రమేమనగా లోకములోవలెనే కావ్యమునందును శృంగారములో భక్తియు, భక్తిలో శృంగారమును తలయెత్తుచుండును. భూషణకవి వర్ణింపదలచినది ఇచ్చటి కేవల శృంగారము. అందును సంభోగ శృంగారము. తాను సహజముగా యోగాభ్యాసియై భక్తితాత్పర్యములు కలవాడగుటచే ఇట్టి శృంగార సన్నివేశములందుకూడ భక్తిభావప్రపంచసమే చేసినాడు. అందును నొక విశిష్టమైన అద్వైతరాగమును నిరూపింపదలచియే యిట్లు వర్ణించెను.

ధూర్జటి యీ యుగమువాడే. పరవల్లి తొక్కెడు శివభక్త్యావేశములు కలవాడు. వ్రాసిన కావ్యము భక్తికావ్యమే. కాళహస్తిని వర్ణించెను. అచ్చటనున్న మత్తేభములు అతనికంటికి తురీయావస్థలోనున్న అవధూతలవలె గోచరించినవి. కామినీజనులు యోగిజనమువలె గోచరించుట విలక్షణము. అచ్చట లీలారతినుండు మానవుల లక్షణములు మఱియు చిత్రములు.

ఎలదోటల్ వనముల్; వధూకుచము లందీ్రిందప్రింబు; లాఁకంటికిన్
ఫలముల్ వాతెఱ; లంగజాగమకళాబంధంబు విచ్ఛాసనం
బులు; కోపంబునఁ బాయుటల్ తపము; సంభోగంబు కైవల్య;మం
దుల లీలారతినుండు మానవుల; కెందుంగాన మీచిత్రముల్

కాళహస్తిమాహాత్మ్యము 1–21

లీలారతినుండు మానవులకు సంభోగము కైవల్య మనిపించుటయు విలక్షణము. అట్టి పూర్ణభోగులకు కైవల్య మాపాదించిన ధూర్జటికవి మోక్షాపేక్ష యెంతటి యుత్కటమో ఊహింపదగియున్నది.

భూషణకవికూడ గిరికావసురాజుల సంభోగాంత సౌఖ్యమును బ్రహ్మానందానుభవంబు తెల్పెననుటలో కవికిగల ఆత్మపరిపాకము, బ్రహ్మానుభూతి రాసిక్యము మెచ్చతగినది. భోగరతియో, యోగ

రతియో, సంగరతియో ఏదైననేమి బ్రహ్మమునందెవని చిత్తము రమించునో వాని ఆనందమునకు మేర లేదుగదా! భూషణకవి ప్రబంధ కవిగా నెంతటి భోగరతుడో ఆత్మతత్త్వవిదుడుగా నంతటి యోగ రతుడు. ఔను! బాగున్నది! అసలీ యోగికమయిన భావన భూషణకవికి కలదా? వ్యాసకర్త కవికి పులిమిన అనులేపమా? అని కొందఱ కనుమానము కలుగవచ్చును. ఇట్టి యౌగిక దృష్టి కవికి కలదనుట వసుచరిత్రకథాగర్భము భేదించి చూపనక్కఱలేదు. కృత్యవతారిక యందే నిదర్శనములు కలవు.

రామరాజు నిజాము నోడించెను. రామరాజుచే నిజామునకు కలిగిన యీ అపజయ వృత్తిని (శ్రీ)రామ కృతమయిన అపవర్గవృత్తిగా కవి అర్థద్వయమును పాదుకొల్పి వర్ణించెను. పర (బ్రహ్మ) బుద్ధి మానక నిజాము డపవర్గమార్గవృత్తి

'సరవి ప్రాణాయామ సంసిద్ధికై సారెసారెకు కుండలిస్థానమంటు'

నట. (1-47) కేవలమొక నిజాముని విషయములో నిట్టి యౌగిక భావమును ప్రపంచించిన కవి రాజర్షియైన వసురాజ విషయములో ప్రమత్తుడగునా? ఈపద్యమవతారిక యందలిదికదా? కథతో దీనికి సంబంధము లేదందురేమో! కథయందే ఒకసన్నివేశము చూడవచ్చును. వసురాజునకు గిరికనిచ్చి పెండ్లి సేయుమని రాయబారము చేయుటకై ఇంద్రుడు కోలాహలు నొద్దకు వచ్చెను. పెండ్లికూతురు తండ్రిగా బరువు బాధ్యతలుగల కోలాహలుడు ఇంద్రునితో పలికిన తీరు అచ్చెరువు గొలుపును. కోలాహలుడు అక్షరముల కోలాహలుడే, యనుకొనుచున్న మనకు ఆతడట్లుకాక ఆత్మపరిపాకము పొందిన సంయమివలె పలుకుచు మర్యాద నెఱపెను.

మహనీయ యోగసన్నహ సాధకుండనై
యనఘాపగాంబు గాహనము కనుట

వసురాడఖర్వ తీవ్రతరాంఘ్రి సహుండనై
గాఢ సంతాపాగ్నిఁ గ్రాగుచుంట
బహుదూరగత భూరి పక్షగౌరవుడనై
పరమ నిశ్చలివృత్తిఁ బాదుకొనుట
అనవాప్త గురు బాంధవ నిబంధనుండనై
గిరికాననరసైక పరతఁగనుట
ఇది మదీయాపదానంబు; కృపనపార
తర తపోరచనంబుగాఁదలచి నన్ను
గావవచ్చితో? అహహా! వెంగలికిఁదోడు
వేల్పులనుమాట నిజముగా విబుధవర్య! (5-19)

అహా! ఏమి యీ యౌగిక భావనా సంపత్తి! అర్థాంతరమున కుదురు కొలిచిన తపోరచనాదిక మయిన భావనము తత్త్వ తపోయోగ వాచకమయిన బ్రహ్మార్థమును స్ఫురింపజేయుచున్నది. ఇందలి మహనీయయోగము (అష్టాంగ యోగము) తీర్థస్నానములు, తాపాతిశయము, కాంచనవిరక్తి, నిశ్చలమానసము, నిస్సంగస్థితి, వనవాసము ఈ మొదలయిన భావమంతయు భూషణకవి సాధించిన మహనీయ కవితా యోగ సన్నహనము కాక మఱేమి?

కావుననే కోలాహలునంతటి యుద్ధతస్వభావుడుకూడ భూషణ కవి యోగభావనలో పరమ సత్త్వమూర్తిగా సాక్షత్కరించెను.

ఇట్టి సత్వసంయమిత రజోమూర్తియగు, కోలాహలుని చేతను కేవల సత్త్వమూర్తి యనదగిన శుక్తిమతిచేతను పెంపబడిన బిడ్డ గిరిక. కడుముద్దరాలు. ఆమెతో వసురాజవివాహము జరుగుచున్నది. వధూవరుల నడుమనున్న తెర తొలగింపబడినది. దంపతుల చెఱగులకు బ్రహ్మముడి పడియున్నది. పెండ్లిపీటపై హోమవేదికముందు కూరు

చున్న వసురాజు ఆజ్యము వేల్చుచుండెను. అగ్ని ప్రజ్వరిల్లుచుండెను. ఇది సాధారణమయిన దృశ్యము కాని వసురాజునంతటి మహా పురుషుని వివాహము వర్ణించునప్పుడు భూషణకవి యింతమాత్రమే యయిన భావనతో తృప్తిపడడు. అతని మనోనేత్రము తెప్పలు విప్పుకొన్నవి.

వసురాజు యథార్థముగా సూర్యుడయ్యెను, గిరిక పద్మిని యయ్యెను. కాని సుముహూర్తము రాత్రియందు. అయినను సూర్యకిరణముల కాంతి తామర రేకులకు సోకినదట. ఆకాశపీఠమున వెలుగొందు నా సూర్యుడు అగ్నిహోత్రునకే అధికప్రకాశము కూర్చెనట.

ఆతఁడె నమ్మహానిధి నిరావరణస్ఫురణంబుతోఁ బరి
ద్యోతిత పద్మినీసుమమృదుచ్ఛద సంగ్రథితాంశు కాంతుఁడై
యాతత దీప్తివైభవ కృతాంబరపీఠికఁ బొల్చి ప్రాజ్యయో
గాతిశయప్రకాశము హుతాశికిఁ గూర్చె మహాద్భుతంబుగన్.
(6_30)

రాత్రివేళ సూర్యుడు తమోరూపమగు ఆవరణము లేకుండ మెత్తని తామర రేకులతో గూడిన కిరణకాంతులతో ఆకాశపీఠిపై ప్రకాశించుచు అగ్నిహోత్రునకు అధికప్రకాశము కూర్చుట వింతయే. సూర్యుడస్తంగతుడై తన తేజము నగ్నియందు బోనుపు ననెడి శ్రుతిప్రసిద్ధ విషయ మిచ్చట అనుసంధించుకొనవలసియున్నది. అది అట్లుండ — రాత్రివేళ సూర్యుడు ప్రకాశించుటెట్లు ? ప్రాజ్య (మహా) యోగము వలని అతిశయ ప్రకాశము సూర్యు (వసురాజు) నందున్నది. అతనియందు మహాయోగి లక్షణములున్నవని భావము.

సమస్త జీవుల కేది రాత్రియో యోగియగు వానికదియే పగలు, అనగా అతడప్పుడు మేలుకొనియుండునని గదా గీతాసూక్తి !

యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ (గీత 2-69)
సామాన్యజనులకు ఏపరమార్థతత్త్వము అగోచరమై యున్నదో దాని
యందు సంయతచిత్తుడగు యోగి జాగరూకుడయి యాత్మావలోక
నము సేయుచుండును. ఇదియే ప్రాజ్యయోగాతిశయ ప్రకాశలక్షణము
ఇట్టి పరికాశము కలవాడు అగ్నిహోత్రునకుకూడ వెలుగు ప్రసాదింప
గలడు. అట్టి యోగికి తమోరూపముయిన ఆవరణ బాధలేదు. ఆతడు
నిరావరణ స్ఫురణుడు. 1 సప్తావరణ సహితమగు అవ్యక్త ప్రకృతి వాని
నాచ్ఛాదింపనేరదు. పయిగా తత్ప్రకృతి యేవానియందం తర్లీనమగును.
అట్టి ప్రకృతినే సమాధినిష్ఠుడగు పురుషునందు బ్రహ్మరంధ్రస్థానమున
అమృతవృష్టికి కారణమగు కులాంగన (కుండలినీ శక్తి) యని
పేర్కొందురు.

వసురాజ పురుషునకు కులాంగనయగుచున్న గిరికతో డివివాహ
సందర్భమున ఈమహార్థమునే ధ్వనింపజేయుచు భూషణకవి ప్రాజ్య
యోగాతిశయ ప్రకాశమును వెల్లివిరియించెను.

ఔను! ఈచేసిన వివరణమంతయు గిరికావసురాజుల "యద్వైత
రాగ" మును రూపించునే కాని భారత కథాంతర్గతమగు మహార్థము
నిదియెట్లు నిరూపించు నని ప్రశ్నింపదగి యున్నది. భారతకథలో
వ్యాసుని జన్మవృత్తాంతము చెప్పవలసిన యావశ్యకములేనిచో
వసుకథా ప్రసక్తియే లేదు. కనుక వసుచరిత్రములో వాచ్యముగనో
వ్యంగ్యముగనో వ్యాసజన్మ ప్రసక్తి రావలెను. లేదా వ్యాసునంతటి
మహానుభావుని జన్మప్రసక్తియైన రావలెను. రానిచో వసుచరిత్ర
లక్ష్యమే చెదరిపోవును. భారతకథా పరమార్థమును భూషణకవి
విస్మరించిన వాడగును.

---

1 పంచభూతములు, అహంకార మహత్తత్త్వములు

గిరికా సౌందర్యమును సంభావించుటచే వసురాజునకు రేతః స్యందమై తన్మూలమున నాతడు వ్యాసజన్మమునకు కారణభూతుడగు చున్నట్లు స్పష్టము. మఱి యీ ప్రబంధమునకూడ అట్లే గిరికయు వసురాజును కారణముగా వ్యాసునంతటి మహాత్ముని యుదయము భావింపబడెనా? భావింపబడినచో అది వాచ్యముగ నున్నదా? వ్యంగ్యముగ నున్నదా? భూషణకవి యిట్టి మహార్థములను ఎన్నడును వాచ్యము సేయడు. ధ్వనిమర్యాద తెలిసిన ప్రోడగదా!

మంజువాణి వసురాజు నంతరంగమరసి అధిష్ఠానమునుండి తిరిగివచ్చెను. గిరికకు చల్లని తియ్యని శుభవార్త నొకదానిని వినిపించెను. మహేంద్రుడు మునీంద్రకోటితో కూడి గిరికావసురాజుల వివాహార్థమయి కోలాహలునితో రాయబారము సేయవచ్చు చున్నాడు. గిరిక కంతకంటె శుభవార్త యేముండును? పయిగా మంజువాణి అధిష్ఠానమునుండి తెచ్చిన వసురాజు నంగుళీముద్రికకూడ చూపినది. అది అచ్ఛమయిన రవితేజము. వసురాజ తేజమున కాముద్రిక నిదర్శనము. ఇట్టి రవి తేజముగల భూమి భృద్వతంసమగు వసురాజునకును వధూటీ తిలకమనదగిన గిరికకును వివాహము నిశ్చిత మయినట్లే. మంజువాణీ భాషణము వలన నిది తెలియనగును. వసురాజు ఉదయభూధరము వలెను గిరిక ప్రాగ్వధూటివలెను కవి అంతర్నేత్రమునకు గోచరించిరి.

అప్పుడు తెల్లవాఱ వచ్చెను. తామ్రచూడములు త్రిభంగిగా మొరసినవి. ఆ మ్రోత త్రికాలీ విబోధకము. ఔను! సమయ మహర్షి బోధగుణ శాలికదా!

సమయ మహర్షి బోధగుణశాలి మహోదయ భూమి భృద్వతం
సమునకుఁ బ్రాగ్వధూటియెడఁ జక్రపీఠితుండు, నశేష దేవతాం

శమునగు సూనునిందలంచి సాంధ్యమహోమయహోమవహ్ని దీ
ప్తముగ నొనర్చెఁ బారచరుభక్తశతాహుతిపూర్వకంబుగన్.
(4-135)

మహోర్థమయిన భావనా వైశిష్ట్యమొట్లుండు ననగా ఇట్లుండును.ఇచ్చట 'సమయ' శబ్దము కేవలప్రాతఃకాల సూచకమే యయినను అది అనంతమయిన కాలమునకు ఉపలక్షకము. అట్టికాలము మహర్షితో పోల్చబడుటలోనే యున్నది చమత్కారము- ఋషులు లౌకిక సాధు జనులకంటె గొప్పవారు. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి." మహర్షుల విషయమున అర్థమెప్పుడును వాక్కులనే యనుసరించు చుండును. కారణమేమనగా వారు బోధ గుణశాలులు. సమస్తలోకము నిదురగూరియున్నను వారు మాత్రము పరమజాగరూకులై యుందురు. వారిసంకల్పము అప్రతిహతము, అవశ్యం భావి. అనంతమగు కాలములలో జరుగు నెల్ల విశేషములు వారి క్రాంత దృష్టికి సుగోచరములే. గిరికా వసురాజ వివాహప్రసక్తి వచ్చునరికి సమయమహర్షి సంకల్పము అనంతమగు కాలములో అవశ్యం భావి యగు భారత కథార్థము స్ఫురించినట్లు భూషణకవి ఇచ్చటభావించెను.

అది ప్రాంతఃకాలము. ఉదయ పర్వతము మహోభ్యుదయ శాలి యగు రాజశ్రేష్ఠుడుగా గోచరించెను. ప్రాగ్దిశ వానికి ధర్మపత్ని. ఆదంపతులకు సూనుడుదయింపవలెనని సమయ మహర్షి సంకల్పము. సూనుడనగా వాడు నట్టి కొడుకుకాడు. చక్రహితుండును అశేష దేవతాంశము నగు సూనుడుదయింపవలెనని సంకల్పము.

ఇచ్చటి సూనుశబ్దముచేతను తద్విశేషముల చేతను సూర్యుడుద్దిష్టుడు. అతడు చక్రవాకహితుడు కనుక చక్రహితుడు. ఆదిత్య హృదయాదిక మనుసరించినచో సూర్యుడు 1 సమస్త దేవతాత్మకు డనుటయు స్పష్టమే. కాని ఇచ్చట రూపకాలంకారముచే రాజపరము

యైన యర్థములో ఒక మహారాజునకు ధర్మపత్ని వలన నుదయింపవలసిన పుత్రుడెట్లుండవలెనో కూడ భావింపబడినది. చక్రమనగా రాష్ట్రము. చక్రహితుడనగా రాష్ట్రహితుడు. రాష్ట్రపాలనా దక్షుడగు వాడుదయింపవలెను. అట్టివాడు సమస్త దేవతాత్మకుడు. రాజు అష్ట దిక్పాలకాంశములు కలవాడుగదా!

అటు సూర్యలక్షణములు ఇటు రాజలక్షణములు రెండునుగల పుత్రుడు ఉదయపర్వతరాజోత్తమునకు ప్రాగ్దిశాధర్మపత్ని వలన నుదయింపవలెనని సమయమహర్షి సంకల్పము, అది నెరవేరుటకు ఆతడొక మహాయజ్ఞము తలపెట్టెను. అనగా అది పుత్రకామేష్టి. ఆ యజ్ఞమునందు ప్రాతఃసంధ్యారాగము హోమాగ్ని, నక్షత్రములు హవ్యాన్నశతములు.

ఈ పద్యమున వ్యాసోదయము ధ్వనింపజేయుట కవి యుద్దేశముగా గోచరించును. వ్యాసుడు రాజు కాకున్నను రాష్ట్రహితుడు. తల్లి ఆనతిచే వ్యాసుడు అంబికాంబాలికలయందు భారతచక్రము నేలగల ప్రభువుల నుదయింపజేసి తత్సామ్రాజ్యహితుడయ్యెను. ఈరీతిగా అతడు చంద్రవంశము తెగిపోకుండ కాపాడిన మహానుభావుడయ్యెను. చంద్రవంశము నుద్ధరింపగలవానికి సూర్యతేజము విధిగా నుండవలెను. 2 సూర్యసంగమము లేకున్నచో చంద్రప్రకాశము లేను. సూర్యకిరణములే చంద్రసంబంధముచే చంద్రికలగుచున్నవి.

వ్యాసుడు నారాయణ స్వరూపుడు. నారాయణుడు సదా సవితృమండల మధ్యవర్తి. కనుక వ్యాసునకు సూర్యునకు అభేదము భావింపతగియే యున్నది. కనుక సూర్యునివలె వ్యాసుడును సమస్త దేవతాత్మకుడే. ఆ భారతమునందును వ్యాసుడు 'అహిమద్యుతి తేజుడు'గ వర్ణింపబడుటలోని పరమార్థమిదియే.

గిరికా వసురాజ వివాహ సందర్భములో సమయమహర్షి సంక ల్పించిన యజ్ఞముయొక్క ఫలము వ్యాసునంతటి మహాత్ముని ఉదయమే కావచ్చును.

ఇచ్చట సమయమహర్షి "తారా చరుభక్త శతాహుతిపూర్వకంబు"గా హోమవహ్నిని దీప్తముగావించెనని చెప్పబడినది. చరుభక్తమనగా హవ్యాన్నము. ఈ యజ్ఞమున నక్షత్రముల నెడి హవ్యాన్న శతములు వేల్వబడినవి. వ్యాసోదయ భావన జరిగిన పిమ్మట సమయమహర్షికి 'శతాహుతి' భావము వచ్చినది. ఈ ఒకటి రెండు మాటలతో భారత మహాసంగ్రామ హోమకుండమున ధార్తరాష్ట్ర శతాహుతి యెట్లు జరుగనున్నదో సర్వము వ్యంగ్య వైభవముచే భాసించు చున్నది.

ఇచ్చట నొక్క ఆశంక. వ్యాసుని జన్మమునకు వసురాజ గిరికా సౌందర్యమును భావించుట మాత్రమే కారణము కాని గిరికా సంభోగము కారణముకాదు. అనగా వసురాజ భావన గిరికయెడ మాత్రమే లగ్నమయినది. ఈ భావమును రామరాజ భూషణుడు పరమ ప్రౌఢముగా ధ్వనింపజేసెను. ఉదయభూధరము వసురాజు. ప్రాగ్వధూటి గిరిక.

"మహోదయ భూమి భృద్వతంసమునకు ప్రాగ్వధూటియెడ" సమయ మహర్షి ఒక సూనుని దలచెను. ఇచ్చట "ఎడ" అనునది ప్రత్యయము. అధికరణార్థకమగు సప్తమి.అందును కేవలవైషయికము. వసురాజ రేతస్సు గిరికావిషయకముగా స్యందమైన దేకాని గిరికయందు స్యందమైనదికాదు. 'గిరికయందు' అను చెప్పినచో ఔపశ్లేషికమో అభివ్యాపకమో అయి భిన్నార్థము వచ్చును. కనుకనే కవి ప్రాగ్వధూటి 'యెడ'- అని వైషయికార్థమే ఉద్దేశించెను.

1 "ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః
మహేంద్రో ధనదః కాలో యమః సోమోహ్యపాం పతిః" –
రామా॥ యుద్ధ.

2 సలిలమయే శశిని రవే ర్దీధితయో మూర్ఛితా స్తమో నైశమ్
భిన్దన్తి దర్పణోదర నిహిత ఇవమన్దిరస్యాన్తః – వరాహమిహిరుడు.

3 సద్యోగర్భంబున అహిమద్యుతి తేజుడు వేదమయుడఖిలమునీం
ద్రాద్యుడు వేదవ్యాసుం డుద్యజ్జ్ఞానంబుతోడ నుదితుండయ్యెన్.
(ఆది 3.44)

మహాభారతకథలో గిరిక గర్భిణియగుట పరమార్థము కాదు. అందువలననే భూషణకవియును గిరికావసురాజ వివాహగృహప్రవేశముతోనె కథముగించెను. వ్యాసునంతటి పుణ్యచరితుని జన్మమునకు గిరికావసురాజులు హేతుభూతులను విషయము నీరీతిగా కవి వ్యంగ్యదృష్టితో ధ్వనింపజేసెను. వ్యంగ్యమెప్పుడును వాచ్యము కాదుగదా! అందువలననే వసురాజనామము చెప్పక ఉదయభూమిభృద్వతంసమనియు, గిరికానామము చెప్పకుండ ప్రాగ్వధూటి యనియు, వ్యాసుని పేరు చెప్పక చక్రిహితుడగు సూనుడనియు, కౌరవశతనాశమని చెప్పక "శతాహుతి" అనియు ఇట్లు భారతకథాపరమార్థమును భూషణకవి ఎంతో ప్రౌఢముగా సూచించెను.

ఔను! ధ్వనిసంప్రదాయ మాపోశనము పట్టిన లాక్షణికకవిగదా రామరాజభూషణుడు!

---

తుది మాటగా రామరాజభూషణుని వ్యక్తిత్వమునుగూర్చియు ఆత్మీయతను గూర్చియు ఒక కొంత చెప్పవలసి యున్నది.

లోకములో కర్మశూరులు కొలదిమందియే యుందురు. వాచా వేదాంతులు వేనవేలు. అంతఃశుద్ధిగల ఆచరణదక్షులు అభినంద నార్హులు; పూజనీయులు. ఆచరణదీక్ష లేని ఆడంబరజీవులు అత్యంతము గర్హింపదగినవారు.

జీవితములో వలెనే కావ్యమునందు కూడ కొందఱు కవులు ఈకోవకు చెందినవారుందురు. కొందఱేమి? ప్రాచీనులలో కూడ సగానకు సగ మీజాతివారే. ఈలక్షణమునకు వెలియైన పుణ్యులు పోతనవంటివారు కొందఱు సహృదయహృదయములందే కాక సర్వమానవ హృదయములందును శాశ్వతపీఠములను నిర్మించు కొన్నారు. భక్తకల్పద్రుమ మనదగిన భాగవత మహాకావ్యకథకూడ ఆభక్తశిఖామణికి చేదోడు వాదోడైనది.

ధూర్జటి రామకృష్ణుడు మొదలగు సత్కవులు కొందఱు స్థల పురాణకథలను స్వీకరించి భక్త్యావేశమును, ప్రౌఢకవితారామణీయక మును మేళవించి మనోజ్ఞ కావ్యములను సృష్టించిరి.

మూర్తీభవించిన వైష్ణవమనదగిన రాయలు రసార్ద్రీభూతచే తస్కుడు. వైష్ణవభక్తి ప్రపాతమనదగిన ఆముక్తమాల్యద ఆకాశ గంగా నిర్ఝరిణి.

పెద్దన మనుచరిత్రము కావ్యలక్షణములు ప్రధానముగా గలిగి భక్తితత్త్వము గౌణముగా గల రసవత్కావ్యము. భూషణకవి వసుచరిత్రము కూడ ఈమార్గముననే నడచి అంతకంటె ఒక్కడుగు ముందునకు వైచిన సలక్షణ ప్రబంధము.

ఈరెండును శృంగారకావ్యములే. రెంటియందును శాంతము అంగరసముగా గోచరించును. భూషణకవి ద్వ్యర్థి నియమము

కావలెనని తెచ్చిపెట్టుకొన్న సంకెల. అవ్యుత్పన్నుడగు సామాన్యుని పాలిటి మున కది సంకెలకాని మహా వ్యుత్పన్నుడగు భూషణకవి కది క్రీడాహేతువైనది. సవిలాసముగా నాతడు కావ్యమాద్యంతము శృంగారమును ప్రధానరసముగా నిర్వహించి శ్లేష సామర్థ్యముతో శాంతమును గౌణముగా భాసింపజేసి అంగరసముగా పోషించెను. ఈ శ్లేషప్రతిబంధకములు తెచ్చిపెట్టు కొనకపోవుటచే పెద్దన కవిత సామాన్యునకుకూడ సుప్రసన్నమై హృదయంగమముగ నుండును.

భూషణకవి కవిత్వ మట్లుకాక హృదయముకంటె ముందు బుద్ధిపై ప్రభావ మతిశయింపజేసి క్రమముగా హృదయంగమమగుచు చర్వణాసహామగు చుండును. ఈకవి తనకావ్యములో గౌణముగా భాసింపజేసిన శాంతము కవియొక్క ఆత్మీయతకును వ్యక్తిత్వమునకు ప్రబలనిదర్శనముగా గోచరించును.

త్రికరణశుద్ధి కల కవి కావ్యమునందు ప్రపంచించిన నీతి సార భూతమై యుండును. అది నానారుచిరార్థబంధురము. అంతశ్శుద్ధిలేని ఆడంబరుడు పలికెడు నీతులు వట్టి శ్రీరంగనీతులు.

వసుచరిత్రప్రబంధమంతయు సానుభూతితో చదివినవానికి భూషణకవి అంతశ్శుద్ధి అద్దములో వలె కనిపించును.

వసుచరిత్రము నీకవి ప్రౌఢవయస్సులోనె వ్రాసెను. పండిన ప్రపంచానుభవము, ఆత్మానుభూతియు అడుగడుగునను కాన వచ్చును. అతడు మహాపండితుడు కావచ్చును; లాక్షణికుడు కావచ్చును; సంగతప్రవీణుడు కావచ్చును. సాహిత్యవేత్త కావచ్చును. కాని రసజ్ఞత, మహామనస్వితా అనునవి పాండిత్యమునకు దివ్యపరిమళ మును సమకూర్చును. అట్టి రసజ్ఞతయును, మహామనస్వితయును ఈపండితకవిలో పుంజీభూతమై యున్నవి.

మంజువాణీ నర్మసచివులు గిరికావసురాజులయెడ ప్రదర్శించెడి నిర్వ్యాజ స్నేహధర్మము, ఏతద్ధర్మ నిర్వహణముకై వారు ప్రదర్శించిన ప్రచ్ఛన్న వేషధారణాది నటనాకౌశలము, అతిలోకవాక్నైపుణము, శుక్తిమతీ స్వభావములో ప్రతిబింబితమయిన భారతీయాదర్శస్త్రీమూర్తి, వయఃపరిపాకముతో పాటు ఆత్మపరిపాకముకూడ పొందిన కోలాహలుని సత్త్వవిస్ఫూర్తి, గిరికావసురాజుల బ్రహ్మానందానుభూతి ... ఇవి యన్నియు భూషణకవి రసజ్ఞతకును, మహామనస్వితకును, బ్రహ్మానుభూతిరాసిక్యమునకును పరమనిదర్శనములై యున్నవి.

రాజర్షియైన వసురాజపాత్రము నడ్డము పెట్టికొని తత్త్వతపోయోగాత్మక మయిన బ్రహ్మవిద్యారహస్య విజ్ఞానమును ఒకశృంగార ప్రబంధములో నిక్షేపించిన ప్రౌఢకవిగదా రామరాజభూషణుడు!

స్వయముగా తాను రామభక్తుడు. అందును అచ్చమయిన ఆంజనేయోపాసకుడు. ఆత్మతత్త్వమెఱిగిన జ్ఞాని. యోగవిద్యారహస్య విజ్ఞానఖని. కేవలాద్వైత బ్రహ్మమునే కాక విశిష్టలక్షణ బ్రహ్మమును గూడ విస్పష్టముగ తెలిసికొన్నవాడు.

కళానియమము నెఱిగిన సత్కవి కథాతత్త్వము ననుసరించి మతసిద్ధాంతములను ప్రపంచించునేకాని తనసిద్ధాంతములను బలవంతముగ పులిమి కథకనుచితమయిన మోలాము పట్టింపడు. పట్టించుట పాపకార్యము. భూషణకవి గిరికావసురాజుల అద్వైత యోగము నిరూపించెను. అంతమాత్రమున నాతనిని అద్వైతియన నక్కఱలేదు. భూషణకవి సౌమనస్య ముభయతారక మయినది. విశిష్టలక్షణ బ్రహ్మము నతఁడెచ్చటను కాదనలేదు. కాదనకపోవుటయే కాక ఎడనెడ సందర్భోచితముగ తద్విశిష్టతను నోరూర, నోరూర పాడి వినిపించెను.

ప్రబంధకథోపక్రమమందే, అధిష్ఠాన పురవర్ణనమునందు అనంత కల్యాణగుణ పరిపూర్ణుడయిన రంగనాథుని దేవేరిని స్మరించినాడు. "కల్యాణపరంపరల తోలుదీవి" యగు అధిష్ఠానము" శ్రీరంగ గేహా క్రోడ వాసినికాటపట్టట !

శ్రీరంగనాథునకు లేనిది వైష్ణవమే లేదని చెప్పవచ్చునందురు. ఔను! శ్రీవైష్ణవుల పాలిటికి తిరుపతి 'సిరియరంగ' మగుచో శ్రీరంగము "పెరియరంగము" కదా! అందువలననే కాబోలు భూషణకవి అధిష్ఠానవర్ణనములో శ్రీరంగమే మందిరముగాగల, విష్ణుమూర్తియొక్క వక్షఃస్థల వాసిని యైన లక్ష్మికి ఆపట్టణ మాట పట్టని చెప్పెను. అంతేకాదు. వివాహానంతరము గిరికావసురాజులు గృహప్రవేశము చేయు దృశ్యమునందు వైష్ణవమహాతేజమును రాశీ భూతము చేసి వర్ణించెను. వసురాజు సద్మము నెట్లు వర్ణించెనో చూతుము.

"అచ్యుతరముక్తాలంకృతంబై, ద్విజప్రవరాధిష్ఠితమై, యనంత మణి శోభా నిత్య నీరాజనోత్సవదంబై తెలిదీవిఁ" బోలి యున్నదట. అయ్యవనీ భర్త తరంగిణీప్రియ సుతాహస్తావలంబియై నిజసద్మము ప్రవేశించెను. (6-70)

వసురాజు సద్మము శ్వేతద్వీపము. పరిశుద్ధులగు ముక్తపురుషుల చే అది చెన్నొందుచున్నది. అందు గరుత్మంతు డధిష్ఠించి యుండెను. ఆదిశేషుని ఫణామణిచ్ఛవులచే ఎల్లప్పుడు నచ్చట ఆరతులెత్తినట్లే యుండునట. అర్థాంతర స్ఫూర్తిచే వసురాజచ్చట విష్ణువుగను, గిరిక లక్ష్మిగను వర్ణింపబడిరి. ఆభూభర్త ఆతరంగిణీప్రియ తనయ కేలుదామర నూదివచ్చెను. వైష్ణవమహాన్ను కుప్పవోసినట్లున్న ఇట్టి తైజస మహా భావనకు కవి ఆత్మతత్త్వము పండినవాడు కావలెను.

భూషణకవి సంచరించిన కాలము విలక్షణ మయినది. ఒక విధముగా వైష్ణవులును, వైష్ణవాభిమానులును ఎక్కువమంది. ఆవైష్ణవులందును, తదభిమానులయందును కొందఱు విస్రంభ సంచారులు. విచ్చలవిడిగా సంచరించు నిట్టివైష్ణవులన్నచో భూషణకవికి గిట్టదు. అట్టివారిని మందలించుటకో యనునట్లు ఒక సందర్భమును పురస్కరించుకొని చిత్రముగా అర్థాంతర న్యాసము చేసెను.

గిరికా వసురాజుల పెండ్లికి పెద్దలందఱు విచ్చేసిరి. కోలాహలుని వైపు వారైన పర్వతాధిపులలో మహాధురంధరు లందఱును వచ్చిరి. ముఖ్యముగా భూభారము వహించు కులపర్వతాధిపులు వచ్చుచు ఆ భూభారమంతయు శేషుని తలపైననే మోపి వచ్చిరి. శేషుడు వచ్చినలేదు. నిజమున కతనికి కూడ వసురాజు పెండ్లిసంబరము చూడ వలెననియే యున్నది. కాని బరువు బాధ్యతలు తెలిసిన పెద్దకనుక అందఱవలె తానును రాలేదు. ఆసందర్భమున భూషణకవి "శేషవృత్తి కగునే విస్రంభసంచారముల్ ?" (5-39) అని అర్థాంతర న్యాసము గావించెను.

విస్రంభ సంచారములనగా ప్రణయవిహారములు. సరదాగా తిరుగుటలు ! శేషవృత్తి యనగా శేషశబ్దవృత్తిగల ఆదిశేషుడనియు దాసవృత్తిగల విశిష్టాద్వైతి యనియు నర్థము. విశిష్టాద్వైతమునందు జీవునికి శరీరముతో గల సంబంధమే పరమాత్మకు సర్వముతోను గలదు. ఆయన సర్వాత్మ; సర్వాధారము; సర్వనియంత; సర్వశేషి,— తానుకాక తక్కినదెల్ల ఆయనకు శరీరము; ఆధేయము; నియామ్యము; శేషము. ఆయన స్వామిభావముగల శేషి. జీవుడు తద్దాసభావము గల శేషము. ఇట్టి శేషవృత్తిగల విశిష్టాద్వైతికి విస్రంభసంచారములు కూడవు.

ఇట్టి విస్రంభసంచారులు కొందఱు భూషణకవికి తప్పక తారసిల్లి యుందురు. వారికి మెత్తగా బుద్ధి చెప్పువాడు వోలె ఆదిశేషున కన్వయించి ఇట్లు పలికి యుండవచ్చును. వైష్ణవ ప్రాభవమహాత్మ్యములు వెల్లి విరిసిన యాకాలములో వైష్ణవులనే యీరీతిగా హెచ్చరించి మందలింపగల ధైర్యసాహసములు అంతశ్శుద్ధికల వానికి మాత్రమే సహజములు. భూషణకవి ఇట్టి అంతశుద్ధికల శిష్టుడు.

నిజమున కీసందర్భములో విస్రంభ సంచారులగు వైష్ణవులను మందలించుట అప్రసుత్తము. వసురాజు పెండ్లికి శేషుడు ఏల రాలేక పోయెనో చెప్పుట మాత్రమే ప్రస్తుతము. ఇది అర్థాంతరన్యాసము కనుక ఇబ్బంది లేదు. కాని సాధారణముగా శ్లేషకావ్యములలో అప్రకృతార్థము ప్రకృతార్థమునకు భిన్నమై ప్రధానకథను పెడ మార్గము పట్టించు ప్రమాదము కలదు. అందువలననే శ్లేషకావ్యములలో రసభంగము జరుగుట కవకాశము లెక్కువ యందురు. కాని వసుచరిత్రను మాత్రము దీనికి అపవాద మని ఘంటాఘోషముగా చెప్పవచ్చును. నిర్దిష్టమయిన ఒక మహాతత్త్వమును నిరూపించుటకే అప్రకృతార్థమును పాదు కొలిపెను. ప్రకృతార్థము శృంగారమును పోషించుచుండ అప్రకృతము తదంగమయిన శాంతమును పోషించుచుండును. కారణమేమనగా మూలకథ యందు వసురాజు రాజర్షి సత్తముడుగా చిత్రింప బడియుండెను. వట్టిశృంగార ప్రబంధనాయకునిగా మాత్రమే వసురాజు నావిష్కరించిన అటు వ్యాసుడు, ఇటు నన్నయ ఇరువురును మొగము చిట్లించు కొందురు.

అస లట్టి రాజర్షి చరిత్రముపై రామరాజభూషణుని మనసు లగ్నమగుటలోనే ఆతని వృత్తి రసికత వెల్లడి యగుచున్నది. తత్త్వతపోయోగ నిరతి లేనివానికి ఇట్టి రాజర్షికథపై మనసుపోదు. ఇక చేపట్టిన కథను తీర్చిదిద్దుటలో పట్టినదెల్ల బంగార మనిపించు

నట్లు చేసెను. తాను స్వీకరించిన కావ్యపాత్రములలో ఒకటి వాగు, వేఱొకటి కొండ. ఇట్టి జడ పరికృతులలో మానవ ప్రకృతి నిరూపణము దుస్సాధ్యము. మనుచరిత్రాది ప్రబంధ కథలలో ఈక్లేశము లేదు. ఆవాగునే సరసాగ్రిగణ్యయగు శుక్తిమతిగను, ఆకొండనే శుక్తిమతీ ధ్యాన నిశ్చలాత్ముడగు కోలాహలుని గను చిత్రించుటలో భూషణకవి భావనాప్రౌఢియు ఆత్మపరిపాకమును వెల్లడి యగుచున్నవి. ఇక గిరికా వసురాజుల బ్రహ్మానందాను భూతిని నిరూపించు పట్టులు పరిశీలించినచో ఆతడెంతటి బ్రహ్మాను భూతిరసికుడో స్పష్టమగును.

కావ్యాంతమున నాయికానాయకుల సంభోగాంత సుఖ స్వరూపము నిరూపించుచు బ్రహ్మానందానుభవమును దెలిపెనని కవి వర్ణించెను. కావ్యమందలి శృంగారమున కీసందర్భమున పరకాష్ఠ. రసమును నిర్వచింపబూనిన యాలంకారికు లెల్లరును దానిని బ్రహ్మాస్వాదాసహోదర మన్నారు గాని కేవల బ్రహ్మానంద మని అనలేదు. కాని భూషణకవి నాయికానాయకుల సుఖమును పునర్జన్మ భేదములేని బ్రహ్మానందాను భూతిగనే చెప్పెను. ఈ వైగుధ్యమేమని ప్రశ్నింపవచ్చును. భూషణకవి చెప్పినది ఆలంబనవిభావమయిన నాయికానాయకులకు బ్రహ్మానందానుభూతియని మాత్రమే. సామాజికున కైనచో ఆయనుభూతి బ్రహ్మాస్వాద సహోదరమే. ఈ సిద్ధాంతమునకు విప్రతిపత్తి లేదు.

అదేమోకాని రసలక్షణ నిరూపకులెల్లరు రసమును కేవలాద్వైత బ్రహ్మముగనే నిరూపించిరి. అంతమాత్రమున విశిష్ట లక్షణ బ్రహ్మోపాసకులకు రసానందము లేదందుమా? జ్ఞానమునకు కూడ ఆత్మధర్మత్వము కలదను విశేషము తెలిసిన వారెవ్వరును అట్లనరు. అందును వేదాంత దేశికుల న్యాయసిద్ధాంజనమును కన్నులకద్దు కొన్న రామరాజ భూషణుని దృష్టి సువిశాలమనుట నిస్సంశయము.

కావుననే ఆతడుభయతారకముగా సర్వరసజ్ఞులకు, పరమాస్వాద్యమానమగు ధోరణిని వసుచరిత్రమును సృష్టించెను. కావ్యకళయాధారముగా ఒకవంక భోగరతి, వేఱొకవంక యోగరతి పెంపొందించుకొని బ్రహ్మానుభూతి రసికుడై వెలుగొందిన భూషణకవి కృతార్థుడు; మహాసుకృతి.

"యోగరతో వా సంగరతో వా భోగరతో వా యస్యబ్రహ్మణి
రమతేచిత్తం నందతి నందతి నందతి నందతి నందత్యేవ."



# వసుచరిత్రలోని కబ్బపు తెలుఁగు

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, M. A.

కావ్యభాషకును లోకములో వాడుకొను భాషకును సంబంధమున్నది. సంబంధము లేదు. లోకము లేకుండ భాష లేదు. దీని కపవాద మొక్కటియే. అది వేదము. లోకము లేకుండ వేదమున్నదని చెప్పవచ్చును. ఈమాట అసంగతముగా కనిపించవచ్చును. శాస్త్రములలో "సంసారస్య అనాదిత్వాత్" అని చెప్పుదురు. సంసారము 'అనాది' అనగా మొదలు లేనిది అని అర్థము. ఎప్పటికప్పుడు క్రొత్త క్రొత్త కల్పములు, తత్పూర్వకల్పముల యందలి భేదములను మహర్షులు స్మరించుట జరుగుచుండుటచేత వేదము లెప్పుడు నిర్మింపబడినవో చెప్పలేము. అందుచేత లోకమనాది. వేదము లనాదులు. వేదము లేకుండ ధర్మము లేదు గనుక, ధర్మము లేకుండ లోకము లేదు గనుక—విత్తుముందా చెట్టుముందా? అన్న ప్రశ్న వచ్చును. అదియంతయు నెందులకు? లోకమునకు సంబంధించినంతవఱకు మఱియు దేశభాషలకు సంబంధించినంతవఱకు లౌకికభాష మొదలు, కావ్యభాష తరువాత. తెలుగులో నిస్సందేహముగా నిదియే సందర్భమని చెప్పవచ్చును.

అయినచో కావ్యభాష లౌకిక భాషనుండి పుట్టినదని చెప్పవలయును. లౌకిక భాషనే సంస్కరించి కావ్యభాషగా చేసిరని చెప్పవలయును. లౌకిక భాష బహువిధములుగా నుండును. వృత్తి చేయువారి యందొక భాషయుండును. భిన్నవృత్తి కలవారి యందలి శబ్దములు భిన్నభిన్నములుగానుండును. సాంఘిక భాష వేరు, రాజకీయ భాష వేరు. ఒక్కొక్క వృత్తిభాష ఒక్కొక్కటి. ఒక్కొక్క శాస్త్రముయొక్క భాష మరల దానిది దానిదే. అట్లే కావ్యభాష కావ్యముది.

అయినను వీని యన్నింటికి సామ్యముండును. ఆసామ్యము వాక్యనిర్మాణము నందుండును. భిన్నత శబ్దముల యందుండును. పరిభాషల

యందుండును. కావ్యభాషయొక్క భేదము పలువిధములుగా నుండును. ఆంధ్రములో లౌకిక భాషలోలేని సమాసగ్రథన ముండును. రెండవది కావ్యమునందు కవి సమయములుండును. ఈ కవి సమయములు సంఖ్య చేత నధికమైనవి. భిన్న రసములయందు భిన్నభిన్నములైన కవి సమయములున్నను శృంగార రసము నందవి యెక్కువ. అలంకారములు క్వాచిత్కముగా లౌకిక భాష యందుండును. వాని స్వరూపము లోకమునందుండి యుండనట్లుండును. కావ్యమునందవి విస్తృతములై విశాలత్వము పొందును. లోకమునం దుపమాలంకార ముండును. రూపకాలంకార ముండదు. రూపకాలంకారము కావ్యమునందే కనిపించునని వచ్చును. చాల యలంకారములిట్లే యుండును. వానిస్థితి లోకమునందు లేదనుటకు వీలులేదు. కాని కావ్యములందు వాని సంపూర్ణావతారము భాసించును. ఇది కావ్యభాషకు, లౌకిక భాషకుగల మొదటి భేదము.

శబ్దము లన్నియు లోకములోనివే. అయినను కావ్యములో గ్రంథములలోనున్న శబ్దములువచ్చును. నిఘంటువులలోని శబ్దములు వచ్చును. సంస్కృత శబ్దములు మనము తెలుగుభాషలో సగానికిపైన వాడుదుము. వానినిబట్టి వాని పర్యాయ శబ్దములనుకూడ వాడుదుము 'అన్నము' అన్న శబ్దము సంస్కృతము. ఎంతో తఱచుగా వాడుదుము. ఈ అన్నమునకు సంస్కృతములో 'అంధస్సు' 'భుక్తి' 'భోజనము' 'జగ్ధి'– ఇట్టి మాటలు కలవు. వానిని కావ్యము వాడును. ఇట్లు కావ్య భాష పెరిగిపోయినది.

వాడుక భాషలో సమాసములు వాడరు. వాడినను రెండుమూడు శబ్దములు కలిసిన దానికంటె నెక్కువ వాడరు. 'వానికి భోజనాపేక్ష' లేదు. 'ఇప్పటికే కాలాతీతమైనది.' 'పూర్వజన్మ సంస్కారము' ఇట్టి ఈ మాత్రపు దైర్ఘ్యముగల సమాసములేగాని "నిజమంజీరాగ్ర రత్న

స్వలీలాభివ్యక్తి” మొదలైన సమాసములువాడరు. ‘మంజీరము’ కాలి-అందె. మంజీర, నూపుర శబ్దములను లోకములో వాడము. కావ్యములందు వాడుదురు. ‘కాలి యందె’ అన్న తెలుగు మాటతో కూర్చు న్నచో కావ్యము సాగదు.

సంస్కృత భాషకు, తెలుగు భాషకు సమాసాది విషయము నందు చాల భేదమున్నది. సంస్కృతములో నున్నంత చాలపొడుగైన సమాసములు అచ్చ తెలుగు మాటలతో కూర్చుటకు సాధ్యము కాదు. అందుచేత తెలుగులో అనగా తెలుగు మాటల కూర్పులో దీర్ఘ సమాసగ్రథనము పొసగదు.

తెలుగు మాటలలో నేది కావ్యగతమైన శబ్దమో! ఏది లోకమునందు వాడబడెడు శబ్దమో! తెలియుట కొన్నిచోట్ల కష్టము. సిద్ధి లోకమునందు చూడదగినదన్న సూత్రము చేత సర్వశబ్దములు లోకమునందే యున్నవి. కాని లోకము కాలము చేత, దేశము చేత విభిన్నమై కొన్ని శబ్దములొక కాలమునందు వాడబడి తరువాతి కాలమున వాడుకలోనుండి తొలగిపోవును. ఆశబ్దము నిఘంటుగతమైయుండును. లేదా యొక కావ్యములో కనిపించును. ఇది కాలగతమైన విషయము. దేశగతమైన విషయ ముండును. కొన్ని శబ్దము లొకప్రాంతమునుండి వాడబడి మరికొన్ని ప్రాంతములందు వాడుకలో నుండవు. “అరమర లేక”– ఈమాట తెలంగాణములో వాడుక భాషలోని మాట. కృష్ణా గోదావరీ నదులమధ్య గ్రాంథికమైనమాట.

రసములు తొమ్మిది. అందులో శృంగార రసము మొదటిదిగా చెప్పుదురు. ఆ శృంగార రసమునకు మన పూర్వులు కల్పించినంత హంగామా మరి యే రసమునకు లేదు. కవి సమయములని వందయున్నచో వానిలో తొంబది శృంగార రసమునకు సంబంధించినవే.

యాకారము దానికున్నది. నుడికారములు, బలుకుబళ్లు, సామెతలు, విలక్షణమైన వాక్యనిర్మాణ వైఖరులు, దేశాచారములు, పండుగలు, సభలు, గృహములు మొదలైనవానిని గూర్చిన బహుశబ్దములుకలవు. ఒకపాక యున్నది. దానికొక వైపున వసారా దింపుదురు. ఈ వసారాకు 'కుఱుమాడు' అనివాడుదురు. ఇది యేవృత్తికిసంబంధించినది కాదు. ద్వారబంధము గోడలో నిలబెట్టగా పైకిరింది కఱ్ఱల చివళ్లు గోడలోపెట్టి కట్టెడివి యుండును. వీనిని 'చిమ్ము' లందురు. ఇట్లనంత శబ్దములుండును.

కబ్బపుతెనుగనగా వీని యన్నింటి కంటె భిన్నమైనది. వసుచరిత్రము ప్రధానముగా శృంగారరస కావ్యము. శృంగారరసము నకు తగ్గెడంత సామగ్రికలను. అంతసామగ్రికి సంస్కృతములో నెన్ని శబ్దములు కలవో, తెలుగులో నన్ని కలవని చెప్పవచ్చును.

ఈ సామగ్రిని తీసికొని నిరూపించుట యెందులకు? సామగ్రి సామగ్రిగా నుండగా వంటజేసెడి వాని నేర్పుండును. గొప్పపాకశాస్త్ర నిపుణుడు కనిపించిన సామగ్రినే పరమ రుచిమంతముగా సిద్ధము చేయును. అట్టి గొప్ప సూదకుడున్నచో వానికి శిష్యులుందురు. వాని ననుసరించెడి వారుందురు. అట్లే వసుచరిత్రకారుడొక పాకముచేసినచో దాని ననుసరించిన వారెంతమంది! అతని శిష్యులెంతమంది!

వసుచరిత్రమునకు పూర్వము కావ్యములున్నవి. ఒక విధముగా చూచినచో పెద్దన్నగారి కావ్య మొకమార్గదర్శకమైనట్లే, రామరాజ భూషణుని వసుచరిత్రమొక మార్గ దర్శకము. తత్పూర్వము క్వాచిత్కముగా నున్నను వానిలక్షణములు గాలికో గలవు. కొన్నింటికి రూపము కల్పించినవారు మనుచరిత్ర, వసుచరిత్ర గ్రంథకర్తలు.

వసుచరిత్రము వ్యోమచారియైన విమానముకలిగిన వసురాజు కథ. అందుచేత నతని కావ్యమంతయు వ్యోమసంచారము చేయునని

చెప్పవచ్చును. ఏమో ఏమో కల్పనలు, కవి సమయములలోని సూక్ష్మాంశములను తీసికొని ప్రతివిషయమును బ్రహ్మాండముగా పెంచి చూపించుట! అసలు ప్రబంధ మనినంతనే వర్ణనా ప్రధానమైనది. ఇందులో నిన్ని వర్ణనలుండి తీరవలయునన్న నిబంధనమున్నది. ఆధునికు లీవిషయమును మఱచిపోయి, కథ, కథ చెప్పెడితీరు, పాత్రపోషణము, కవి కాలము నందలి విషయముల కీగ్రంథ మెంతవఱకు ప్రతిబింబము, ఈగ్రంథము మనకు జేసెడి హితోపదేశ మేమి? మొదలైన బహువిషయములను తెచ్చి ఎంతెంతటి పూర్వకవులను 'టుప్' మని ఎగురగొట్టు చున్నారు.

వసుచరిత్ర మున్నది. ఇందులో శృంగారరసమున్నది. శృంగార రస మెట్లు పోషింపబడవలెనో యట్లు పోషింపబడినది. అది యంతయు సంప్రదాయానుసారముగా చేయబడినది. వసుచరిత్రమునందు పద్య రచనా శిల్పమొకటి భవిష్యత్కవులకు మార్గదర్శకముగా నిరూపింప బడియున్నది. అతడు పలుచోట్ల పూర్వకవుల ననుసరించినవాడే. కాని తానుకూడ బహునూత్న పద్యరచనా సంధాన శిల్పమును స్వతంత్రముగా చూపించిన వాడే!

అదికాక యీయన తెలుగుమాటలు, తెలుగుమాటల కూర్పు, కొన్ని తెలుగు సమాసములు చేయుట, పద్యములలో తెలుగుమాట లెచ్చట పెట్టినచో నందము వచ్చును? ఎంతవరకు పెట్టవచ్చును? అవి పెట్టినచో నెట్లు పెట్టవలెను? మొదలైన విద్య సర్వాంకషముగా నేర్చినవాడు. తరువాతి కవుల కందఱకు నతడు మార్గదర్శి. తరువాతి కవులందఱు వానిమాటలనే, వానికూర్పులనే యథాతథముగా తీసి కొన్నవారు. అతడును శ్రీనాథాదులనుండి కొన్ని గ్రహించెను.

"చివురుంగైదువుజోదు వైద్యముపదేశించెన్ శచీభర్తకున్"

అని శ్రీనాథుడు 'చివురుంగ్రొదువుజోదు' అన్న శబ్దము వాడెను. ఆయనయు తీసికొనెను.

అచ్చ తెలుగులలో కొన్ని కబ్బపు మాటలున్నవి. అవి స్వాతంత్రములు. వానిని తెలుగు కవులే కల్పించిరి. "లేఁగౌను" లేత + కౌను లేఁగౌనైనది. ప్రాతాదుల తొలియచ్చుమీఁది యక్కర మునకు లోపము కలిగినది. అరసున్న కూడ వచ్చినది. ఈ శబ్ద మెక్కడిది ? 'కౌను' పదము సంస్కృతములో 'కౌను' నను 'మధ్యము' అంటారు. 'ఉదరము' అనికూడ నందురు. 'శాతోదరి' యందువలె. లేతయన్న యర్థమునిచ్చు శబ్దము సంస్కృతములో మధ్యోదర శబ్దములకు తగిలించరు. లేగౌను, లేనడుము తెలుగులోననే యున్నవి. తెలుగు శబ్దముల సంతరింపులో నిర్మాణములో పూర్వకవులు చూపించిన స్వాతంత్ర్యము కొంతకలదు. ఇట్టి శబ్దములు కబ్బపు తెలుగు గాని లోక భాష కాదు.

ఇంక తెలుగు మాటలను సమాసము చేయుట. ఇది యొక పెద్ద విద్య. ఇందులో శబ్దములు కలియును. కలియవు. తద్ధర్మార్థక క్రియా జన్య విశేషణములతో కలిసి సమాస ముండును. తక్కిన క్రియాజన్య విశేషణములతో పరిమితముగా నుండును. 'తోడ' అన్న తృతీయా విభక్తి ప్రత్యయము 'తోడి' యగును. ఇట్లు చాల మార్పు లుండును.

'ఉడివోని మిన్కు లీనెడి పేరులు' 1-6

'నెఱిమించు చిఱుతవన్నియ చేలము' 1-6

ఈ రెండును సమాసముల క్రిందనే లెక్కయా ?

అలరారు సిరి తన యడుగునఁగూర్చి గ

ట్టిగనీగి చేయి మాటికొసఁడేని" 1-34

ఇది సమాసము కాదు, కాని కూర్పులో నొక విశేష మున్నది. ఇట్టి కూర్పు తరువాతి కవులకు జీవగఱ్ఱయైనది.

'ధరయే యఃపాంసుల' 'కనులయే నిశ్చల' సతియే అచండిక' 1-36
ఈ తెలుగు కబ్బపుఁ తెలుగు కాదు. నుడికారపు సొగసు.

'ఎదలపై పొదలు పయ్యెదలు జాఱఁగ' 1-46

ఇది యమకముతో కూడి తరువాతి కవులు సులభముగా నేర్చికొనుటకు వీలైన రచన.

'కప్పువాటింపదు' 'నలత నొందదు' 'తడవాటు పూనదు' 1-60

ఇట్లు క్రియలను సీసపద్య చరణారంభముల యందుంచుట పద్య రచనలోని నేర్పేగాని కబ్బపు తెనుఁగనుటకు వీలులేదు.

'సరిలేని తెలిముత్తె సరులు కొటారు' 1-94

ఇది కబ్బపు తెలుగు. ఇందులో ముత్తెపు సరులనుటకు ముత్తె సరులన్నాడు. ఇట్లు చేయవచ్చునని వసుచరిత్రకారుని నిర్ణయమేమో!

'రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పుర విడెము' పెద్దన్నగారి చాటువు - కపురాల బోతు - నరస భూపాలీయకర్త వాడినాడు.

'పులిగూడు' 'పొన్నపూవాడి' 'మిన్నులబావి' 'మొగడ తమ్ములు' మొదలైన మాటలు చమత్కారముగా కబ్బపు తెనుగు క్రిందికి వచ్చును.

"వీటన్ మీటగు జోటులేటి వరలన్ వేమాఱుఁ గ్రీడింప" 1-110
వృత్త్యనుప్రాస రామణీయకముచేత నితర కవులను మోహపెట్టుకూర్పు.

ఇతడు మున్ను చెప్పినట్లు మొదటి చరణమంతయు తెలుగులో వ్రాయును. ఒక్కొక్కప్పుడు రెండు చరణములు వ్రాయును. మరియు మూడు చరణములు వ్రాయును. ఎక్కడనో ఒకచోట సంస్కృతము లోనికి హఠాత్తుగా దిగును. ఎక్కడి కక్కడనే సౌందర్యము. అన్ని సౌందర్యములను కొలబోసి చూపినట్లుండును. ఒక్కొక్కప్పుడు సంస్కృత శబ్దమును తీసికొనివచ్చి నడుమ నిరికించును.

"చెన్నగునన్నదీపులిన సీమల దాగిలిమూఁత లాడుచున్
వెన్నెల జేలు కప్పురపు విప్పొటనంటుల నీడ నీగు రా
కన్నెల రోయు నన్నులకు కన్నులమ్రోయు తదీయ వాసనల్
మన్నన గాంచి కప్రపుదుమారము రేచు సమీరడింభముల్."
1-112

పద్యమంతయు తెలుఁగే. 'నదీపులినసీమలు' 'తదీయవాసనల్' 'సమీరడింభముల్' ఈమూఁడే సంస్కృతపు మాటలు.

ఈమూఁటిని తొలగించినచో నచ్చ తెనుఁగు పద్యమగును. ఆయన కది యిష్టములేదు. తెలుఁగు సంస్కృతములకు భేదము లేదు. 'సమీరడింభముల్' అన్నమాట తీసివేసినచో నొకసొగ్గు పోవునని యతని యూహయేమో! దాగిలిమూఁతలన్న శబ్దము లేనిచో బాలికల యొక్క హేలారమణీయతయే పోయినది. — కప్రపుదుమారము - సమీరడింభకుల యొక్క కార్యములోని బిగువే పోయినది. కనుక దుమారమన్న శబ్దముండియే తీరవలయును. ఆయన పద్యరచన యిట్లుండును.

అటునిటు తెలుఁగు శబ్దములుండును. నడుమనొక్క సంస్కృత శబ్దముండును. అందుచేత దాని నీవచ్చ తెనుఁగనుటకు వీలు లేదు.

"పగడపుంజిట్టలన్ మనికిపట్టుగఁ గట్టిన పట్టు జీనువుల్
జిగిబిగిమించు చంచువుల చించినచో రసపూరవాగ." 1-114

చంచువు, రసపూర సంస్కృత శబ్దములు. ఒక శ్రవణసుఖ ధారలో చంచువులుకూడ తెలుగుమాట యేమోయనిపించును.

ఇదియంతయు కబ్బపు తెనుఁగు. 'కప్పురపు విప్పొటనంటులు' 'కన్నులరోయునన్నులు' 'పగడపుజిట్టలు' ఇట్టి మాటలన్నియు కబ్బపు తెనుఁగని చెప్పవలెను.

'చివురుంగైదువుజోడు', 'అలరుంగైదువుజోడు - ఒక విధము సమాసములే.

'అలరుం గైదువుజోదు' 'కూర్మి సయిదోడై' — 'తేనె నీరాల్చి'
"పెందెలిపూజొంపపు పొత్తులంబొదివి" 1-128 ఒకటి, మూడుచరణముల
లోని యతిస్థానమువరకు పెట్టిన తెలుగు సమాసములు. తక్కిన పద్య
మంతయు సంస్కృత శబ్దమయము. ఇదియొక పద్యము సేత. పద్యము
నందుగల రెండుసగములలో మొదళ్లు తెలుగులతో గుంపించుట-యి ది
యొక క్రమముగా రామణీయకమునకు హేతువగుచున్నది.

"నాథ! చివురులు రంజిల్లె, ననలు మొలిచె
అలరె విరులెల్ల పూపలు తలలు చూపె
పసిమి నిరవొందె పిందియల్ బలసె నవశ
లాటువులు సాంద్రరుచుల ఫలంబు లెసగె." 1- 36

ఒక్క చివరిచరణమే సంస్కృతము. ఒక క్రమమును చెప్పి యీ
క్రమమంతయు తెలుగు మాటలలో చెప్పి చివరి ఫలితమును మాత్రము
సంస్కృతములో చెప్పుట- బంగరు కిరీటముపెట్టి మణులు పొదిగినట్లు.

ఎంత మేర చూచినను ఇట్లేయుండును తెలుగు మాటల కూర్పం
తయు.

"బలుక పరింపుటనంటి కప్పురపు తిప్పల్ గప్పి యుప్పొంగుజాల్
గలగొజ్జంగుల నీరు సజ్జకపు కేళాకూళికిం డిగ్గి" 1-139

తక్కిన రెండు చరణములలో సంస్కృత శబ్దములు తగినన్ని
యుండును.

కొన్ని సీస పద్యములలో నితడొక చమత్కారము చేయును.
సామాన్యముగా సీస చరణములయందు పూర్వార్థము తెలుగు రచన
చేయును. ఒక్కొక్కప్పుడొక్క చరణమునందే చేయును.

'ముత్యాల లవిరె కెంపుల చట్టము' 1-144

'పగడాల కంబాల జిగిమించు' ..

ఇవి సీసపద్యములోని చివరి రెండు చరణముల మొదళ్లు.

'చనువొప్పన్ నగి, పల్కి, పాడి, కని, ఆశ్వాసంబునొందించి. చే
కొని, మోమిచ్చి, కవుంగిలించి, తరులన్ గొన్నింటిమన్నించి అం
గన లయ్యో మము నెంత చేసిరనుచున్ కంకేళియున్ కేసరం
బును భూజానికి మొ్రక్కగుచ్ఛవినతిన్ బూదేనె కన్నీటితో!

ఇది చాలచమత్కారమైన పద్యరచన. కంకేళి, కేసర శబ్దములు సంస్కృతములు. అంగనలు వానినెంతో చేసిరి. ప్రతిక్రియ చేయలేవు. బాధపడినవి. ఇవియన్నియు దోహదా క్రియలు. వానివలన నా వృక్షములు బాధ పడినవని చమత్కారము. పడిన బాధకు కారణములు తెలుగు మాటలతో చెప్పుట. ఇందులో కొంచెము బాధ తక్కువ వ్యవహారము. 'ఆశ్వాసంబు నొందించి' యని సంస్కృత శబ్ద ముపయోగించుట, అంగనలకు ప్రతిక్రియ యేల చేయరాదు? ఉపయోగించిన సంస్కృత శబ్దములచేత, వారు వారు సమాన స్కంధములోనున్నారు. దుఃఖములు చెప్పుటకూడ తెలుగు మాటలలోనే. కన్నీరుకూడ తెలుగు మాటలే. ఇది యొకగొప్ప పరమ సూక్ష్మమైన వ్యంగ్యరచన.

ఇట్లు గ్రంథము నందంతట నితడు సమకూర్చిన తెలుగు చమత్కారముగా నుండును.

"నను నువ్వెత్తుగ పాలిమీటితివి నానార్థైర్య సామగ్రి మ
జ్జనకున్ మున్నె తృణీకరించితివి" 2-0

తన తండ్రికంటె తాను తక్కువవాడు. తండ్రి విషయము సంస్కృతములో చెప్పి తన సంగతి తెలుగులో చెప్పెను. ఇట్టి చమత్కారములనంతములు.

కొన్ని పద్యములు మొదటి పాదములన్నియు తెలుగు. ఈ తెలుగుసేత నతని యిష్టము వచ్చినచోటనుండును. మొదటి చరణమే కానక్కఱలేదు. మొదటి రెండు చరణములు కావచ్చును. ఎచ్చట

తెలుగు వేసినను, ఒక సన్నని వ్యంగ్యమో పద్యరచనలో నొకసొగసు తెచ్చుటకోమాత్రమే చేయును. పది శబ్దములు తెలుగుతో కూర్చును, నడుమ నొక సంస్కృత శబ్దముండును. ఇదియొక వాక్యమో, వాక్యము నందేక దేశమో యైయుండును. ఈ సంస్కృత శబ్దమునకు పది తెలుగు మాటలు వెనుక నుండును. పది తెనుగుమాటలు తరువాత నుండును. ఈ కూర్పు వింతలు వింతలుగా నుండును. 2 వ ఆశ్వాసము 22 వ పద్యము లయగ్రాహి. అందులో—

"పైతైన చెంగలువ యీటికలలో" అని నడుమ నున్నది. అటునిటు నన్నియు సంస్కృత శబ్దముల రచనయే.

'దమ్మేటి యసట' 'తమ్మిగద్దియదాళటఁ గ్రిమ్మి' 2-32.

ఇట్టి రచనలో పద్యము పద్యమంతయు తెలుగులో వ్రాయుట చాల సకృత్తుగా నుండును. నూటికి కోటికి నొకచోట నుండును. ఇట్టి పద్యముల కోసము వెదుకవలెను. ఏలననగా మున్ను చూపిన పరమ సూక్ష్మమైన వ్యంగ్యము నాశ్రయించికదా! యితడు పద్యము వ్రాయును. ఆ వ్యంగ్యమును నీరెండు బాసలలోని శబ్దములను స్వీకరించియే సాగించును.

> మొలక మెఱుంగు కెంపు మొనముక్కుల నిక్కుకిరీటి పచ్చ రా
> చిలుకల కోళ్ళతో చికిలి చెంద్రికవన్నియపట్టు పట్టెతో
> తొలకు పసిండిబ్రాత తెరతో నెఱతావుల మేలుకట్టుతో
> చలువలు చిందు ముత్తియపు చప్పరమంచముపై మహోన్నతిక్

పద్యమంతయు తెలుగు 'కిరీటి పచ్చరా' లోనున్న కిరీటి శబ్దము తెలుగు క్రిందనే లెక్క. చివర మహోన్నతిన్ అన్న ఒక్క సంస్కృత శబ్దమున్నది. ఇచట వ్యంగ్యము గొప్పదనము తక్కువకాదు, బాధయు నాశ్వాసము నందుటకాదు. సౌకుమార్యమును తదనుభూతియు వ్యంగ్యములు. ఆమంచముయొక్క సౌందర్యము నంతయు తెలుగు నో

చెప్పి అట్టి భోగమున ననుభవించుచున్న వాని మనసులోని మహాత్మ్యాతిశయమును తెలియజేయుటకు మాత్రము 'మహోన్నతిన్' అని వ్రాసినాడు.

అతని తెలుగు మాటల పోహళింపులు వానికే తెలియును. ఒక ఆరు విషయములు వరుసగా చెప్పెను. ఒకటి, మూడు, ఐదు విషయములు తెలుగులలో చెప్పెను. రెండు, నాలుగు, ఆరు విషయములు సంస్కృతములో చెప్పెను.

వరుసగా నిచ్చినచో నీ గ్రంథమునందు తెలుగు కూర్పెంత యున్నదనగా గ్రంథములో కనీసము ఎన్మిదవ పాలు తెలుగే. మరి ఒక్కపాలు మాత్రమే అచ్చ సంస్కృతముండును. ఈ ఎన్మిదవపాలు సర్వము కబ్బపు తెనుగు. ఉదాహరణలు వందలీయవచ్చును. "తళుకు పసిండియోనవులు దంతపు చావడులు"– "కెంపుటోడు బిళ్ళల గరిడీలు" 'కప్రపుకలాచిక' 'జాబిల్లి జాగోడలు' ఇవి పద్యభాగములు. వచనములలో ఇంతకుమించి యుండును.

"పింపిళ్లుగూయు కలికికొమిరెల మొలక చనుమోసలన్ తులకరించిన తళుకు సిబ్బెంపుఁ తళతళల దళముకొనియెనో యన.–"

ఎట్టకేలకున్ చిట్టకాలకున్ చెవి మొగ్గిన సిగ్గరి కత్తెయలు' – మరియుగొన్ని 'కడలిజేని బిడారము', పెల్లుబ్బ 'ఇర్లపెన్నెల్లి' బయటి పల్లియలు దున్నినవాడట' 'జిలిబిలిగాడ్పులు జలజల నలరులు రాలెను'

'విప్పుట నంటులు' అనియొకచోట 'కప్రంపుటనంటివిప్పు' అని మరియొకచోట, వ్రేకపు తేనెవాఁక'—

ఈ సామగ్రిని యీయన కొన్ని పద్యముల యందవసరములైన చోట్ల పద్యమును సగము నిండుగా వ్రాయును.

అన్నిటికన్న నొకచమత్కార ముండును.

4-129 వ పద్యములో 'తాలకుం దూరపునంటు' ఈ తెలుగుతో మొదలుపెట్టినాడు. తక్కిన పద్యమంతయు నాంధ్రిభాషయే. మొదలు పెట్టుటయే దీనితో-ఇదియర్థమగుటకు తక్కిన పద్యమంతయు చదువవలెను. యతికోసముకాని, ప్రాసకోసముగాని చేసిన చేతకాదు. ఇది యతని వాక్కల్యాణి వైలక్షణ్యము.

ఇతని యీ రచనను మరియునతని పద్యరచనా శిల్ప మార్గము లను తరువాతి కవులు కొల్లకొల్లలుగా వాడుకొనిరి. అనుసరించిరి. ఇతడు కూడ నొక విధముగా నాంధ్రకవితా పితామహుఁడే. ఇతని విషయ ములో కవిత యనగా సుందరమైన పద్య రచనాశిల్పమని యర్థము. దానికీయన మార్గదర్శి.



# "సంగీత కళా రహస్య నిధి"

## శ్రీ పంతులు లక్ష్మీనారాయణశాస్త్రి

ఆంధ్రప్రబంధ సర్ష్మాతలలో సంగీతకళారహస్యనిధి - శ్రీరామ చంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషా సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్య రసపోషణుడగు రామరాజభూషణుడొక్కడే. నరస భూపాలీయ, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానము లీమహాకవి కృతిరత్నములు. ఈకృతిరత్నములలోపలనే కాక, ఆంధ్రప్రబంధము లన్నింటిలోపలను గూడ - వసుచరిత్రము - మహోత్తమమగుచున్నది. ఈతని కవితాధార-సంగీతసుధాధార. సంగీతానుగుణ శబ్దార్థాలంకార గుణ, రీతి, వృత్తి, శ్లేషరచనలు - ఈకళానిధికి సహజసంపదలు. కథాకల్పనము - అపూర్వము. ఇందలి గూఢార్థముల నాకళించుకొని, సమీక్షింపజాలని అల్పజ్ఞులు - ఇందు - కథాసౌష్ఠవము లేదను చుందురు.

"సకల కర్ణాట రక్షాధురంధర రామవిభుదత్త శుభచిహ్న
విభవయుతుఁడ"

అని యీకవిరాజు - హరిశ్చంద్రనలోపాఖ్యానము నందలి ప్రథమాశ్వాసమునఁగల 53 వ పద్యమున ప్రకటించిన శుభచిహ్నము - ఏది?

ఆశుభచిహ్నమే - రామభూషణుఁడు, రామనృపభూషణుఁడు, రామరాజభూషణుఁడు అని త్రివిధముగా పేర్కొనఁబడినది. నరస భూపాలీయమునురచించిన మూర్తి - (భట్టుమూర్తి) శారదామూర్తి. ఆయాప్రదేశములయందు (ఇటీవల) నిర్వహింపఁబడిన, పెక్కు భువన విజయసభలయందు, రామరాజభూషణ పాత్రధారియగు, ఈగచయిత-

ఈమహాకవి ప్రతిభను గూర్చి - ఈక్రింది పద్యమును సగర్వముగా ప్రసారించి యున్నాఁడు.

"సంగీతభంగీ సుధాంగీకృతిస్ఫూర్తి, సాంగప్రసంగాఢ్య భంగకీర్తి
శ్లేషాది భాషావిశేషాభి మతరీతి, భావానుభావ, ప్రభా, విభూతి
శ్రీభవ్య, భావవ్య, ధీభావ్య, పదయుక్తి - ధ్వన్యాత్మ ధన్యాత్మ మాన్యసూక్తి
సాహిత్య, సౌహిత్య, మహాత్మ్య, పరిపూర్తి - రమ్యాభిగమ్యార్థ సౌమ్యమూర్తి

గీ॥ అద్భుతాద్భుతవ్యుత్పత్తి, అమృత వృత్తి, సూరివినుతకృతి వ్యాప్తి, సుగుణదీప్తి
రసమయాలంకృతి సమాజ, రామరాజభూషణ సుమూర్తి, శారదామూర్తి నేను॥"

కొందఱు విమర్శకులిది - శ్లేషకావ్యమని భ్రాంతిపడిరి. సహజ సిద్ధములగు శబ్దార్థ శ్లేషభంగికల నుపయోగించి, - యీకళానిధి - ఈ మహాప్రబంధమున, రసాదిధ్వనులను ప్రధానముగను, వస్తు అలంకారధ్వనులను తదంగములుగను వ్యంజింపఁజేసి యున్నాఁడు. ఇందలి వాచ్యాలంకార వస్తువులుకూడ - విభావానుభావములను వాచ్యములుగఁ దెలిపి, శృంగారరసమును, నిర్వేదగ్లాని శంకాది సంచారిభావములను వ్యంజింపఁ జేయునవియే యగుచున్నవి. ఇట్టు - చమత్కారజనకమగు భావనకు విషయమగు అర్థమును ప్రతిపాదింపని పద్యము - మచ్చునకైనను గాన్పింపదు. కనుకనే, ఇది - ఉత్తమోత్తమమగు ధ్వనిప్రధాన కావ్యమగుచున్నది. నాకిది - ప్రస్తుత విషయముకాదు. కనుక నింతతో విరమించి, ప్రకృతము ననుసరింతును. ఇందలి పద్యములలో - అపూర్వమగు శిల్పములేని పద్యము - ఒక్కటియు కాన్పించదు. సంగీతానుగుణములగు, శబ్దములు, అర్థములు, వృత్త్యానుప్రాసములు, ఛేకానుప్రాసములు,

ముక్తపదగ్రస్తములు, ద్విప్రాసములు, త్రిప్రాసములు, వివిధములగు యమకములు, గమకములు, వసుచరిత్రమున అప్రయత్నసిద్ధములు.

ఆటపాట మాటల కీకృతి గొప్ప కోటవలె నున్నది. ఈకృతి—సంగీతశాస్త్రీయ విషయములకుఁగూడ నాశ్రయమగుట - ఆశ్చర్య జనకమగుచున్నది. ఇట్లు, రసానుగుణ సంగీతభంగీ తరంగితమగు వసుచరిత్రమున నానార్థకములగు పదవాక్యములు, శ్లేషరూపము నొంది, ధ్వని వ్యంజకములగుచున్నవి. కావున నిది శ్లేషయుక్తమగు ఉత్తమధ్వని కావ్యమను నంశము - నిర్వివాదముగ నంగీకరింపఁదగి యున్నది. ఈ మహాకావ్యమునకు "విద్వజ్జనరంజని" అను వ్యాఖ్యను రచించిన సోమకవి సంగీత సాహిత్య విశేషములను కొంత వఱకు విశదీకరించియున్నారు. జూలూరి అప్పయ్య పండితులు 1884 లో దీనికొక వ్యాఖ్యను రచించెను. ఇది ప్రతిపద టీకగా నున్నది. 'ప్రతి పదార్థ ప్రకాశిక' యను వ్యాఖ్యను మఁలుపాక బుచ్చయ్యశాస్త్రి అనువారలు రచియించిరి. శ్రీ తేవ ప్పెరుమాళ్లయ్యగారు మీఁది వ్యాఖ్యలను పరిశీలించి, భాషాసాహిత్య విషయములను మరికొంత విపులీకరించిరి. కాని సంగీత విశేషములను సమగ్రముగ సమీక్షింప రయిరి. సంగీత కళారహస్యనిధి యగు రామరాజభూషణుని సంగీత కళా రహస్య జ్ఞానమును సముచితముగా విశదీకరించునవియగు వ్యాఖ్యలేవియు కాన్పించుటలేదు. ఉద్దండపండితుండును, విద్వత్ కవియు, సంగీత సాహిత్యవేత్తయు అగు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి వరేణ్యుడు వసుచరిత్రమునకు వ్యాఖ్యవ్రాసెనని తెలియుచున్నది. ఈవ్యాఖ్యయందు కొన్ని పద్యములకు ఏడు, ఎనిమిది అర్థములను గూడ ఇతడు వివరించెనని తెలియుచున్నది. మఱియు, ఏయే పద్యము - ఏయే రాగముతో చదువఁదగినదియు గూడ ఈవ్యాఖ్యాత తెలిపెనని మిత్రులు శ్రీ నిడదవోలు వెంకటరావు M. A గారు

తెలుపుచున్నారు. ఈవ్యాఖ్యానమిపుడు లభ్యము కాకున్నను, అందలి సంప్రదాయసిద్ధములగు విషయములు తూర్పుగోదావరి మండలమున సాహిత్య విద్వాంసుల వాడుకలోనున్నవి అని వారే తెలిపియున్నారు. ఆవ్యాఖ్యానము లభించినయెడల వసుచరిత్రము నందు సంగీతమునకు సంబంధించిన పద్యములయందుఁగల సంగీత, కళావిశేషతత్త్వము తెలిసికొనుటకు వీలుకలిగి యుండెడిదేమో! వసుచరిత్రము రాగకావ్యమనియు, సంగీతప్రబంధ సముచ్చయమనియు చెప్పఁదగియున్నది. అభినవ గుప్తాచార్యుడు రాగకావ్యములనే ప్రబంధములను గురించి అభినవ భారతిలో చెప్పియున్నాడు. వసుచరిత్రము శ్రుతి మనోహరమగు పదార్థ సమ్మేళనము గలిగి, వివిధములగు శబ్దాలంకారములతోను, మనోజ్ఞయగు శయ్యతోను గూడియుండుటవలన గానయోగ్యమగుచున్నది. వసుచరిత్రము నందలి గద్య, పద్యములను గేయ ప్రబంధములుగ గానము చేయునదియగు సంప్రదాయముకూడ నుండెడిదని వినుచున్నాము. వసుచరిత్రమునందలి పద్యములను వీణయందు వాయించుచూ, గాత్రమున పాడిన ఒకవిద్వాంసుని గూడ నొకప్పుడు చూచి యుంటిని. ప్రస్తుతకాలమున వసుచరిత్రమును పరంపరాగత సంప్రదాయము ననుసరించి గానము నొనర్చువిద్వాంసు లెవ్వరు నున్నట్లు కాన్పింపదు. సంగీత విద్వాంసులు కొందఱు మనుచరిత్రము నందలివియు, వసుచరిత్రము నందలివియునగు కొన్ని పద్యములను గాన మొనర్చుట ఇరువదియైదు సంవత్సరముల క్రిందటివఱకును గలదు. శ్రీరామరాజభూషణమహాకవి - ఈ మహాకావ్యమును గానమునకు అనుకూలమగు విధమున సంఘటించెననుట నిస్సంశయము. అంత్యానుప్రాసములు, ముక్తపదగ్రస్తములు, ద్విప్రాస, త్రిప్రాసములు, వృత్త్యనుప్రాసములు, లాటానుప్రాసములు మున్నగు నిందలి రచనలు సంగీతప్రదర్శనము

నకు మిగుల సౌకర్యమును గలిగించు నవిగా నున్నవి. శబ్దాలంకార యుక్తములగు.

సీ॥ "లలనా జనాపాంగ" మున్నగు పద్యములను రాగ, తాళ, యుక్తముగా పాడదగిన విధమును ఈ వ్యాసము చివరను వివరించెదను. మొదట నిచ్చట శ్లేషమూలమున సాహిత్యార్థముతోఁబాటు, సంగీతార్థముగూడ గలవియగు కొన్ని పద్యముల నుదాహరించి, అందలి సంగీత కళారహస్య విశేషములను విశదీకరించెను.

* సంగీతము – సాహిత్యము – సరస్వతీ స్తనద్వయము.

అందు మొదటిది–ఆపాత మధురము – రెండవది – ఆలోచనామృతము అను నభియుక్తోక్తి కనుగుణముగ, భారతీ స్తన్యమును గ్రోలి విజ్ఞులకు సంగీత మిళితమగు సాహిత్యామృతమును బంచిపెట్టిన మహాకవి–రామరాజ భూషణుఁ డొక్కఁడే.

వసుచరిత్రము– శ్రీ రామరాజ భూషణుని ప్రధాన కృతిరత్నము. ఆ వసుచరిత్రమునకు కృతిభర్త కాఁగోరిన తిరుమల దేవరాయలు పేరోలగమునుండి – (శ్రీ) రామరాజ భూషణుని పిలిపించి పల్కెను. ఎట్టి గుణశక్తులుగల తన్నుఁ బిలిపించి తిరుమల దేవరాయలు పలికెనో ఆ గుణశక్తి విశేషముల నీ మహాకవి క్రిందిపద్యమున నిట్లు ప్రదర్శించెను.

మ॥ నను శ్రీరామ పదారవింద భజనానందున్ జగత్ప్రాణనం
దన కారుణ్య కటాక్షలబ్ధకవితాధారా సుధారాశి సం
జనితైకైక దినప్రబంధ, ఘటికా సద్యశ్శతగ్రంథ క
ల్పను, సంగీత కళారహస్యనిధిఁ బిల్వంబంచి పల్కెన్ నృపన్
(వసుచరిత్రము ప్రథమాశ్వాసము, 16 వ పద్యము)

---

* సఙ్గీత మపిసాహిత్యం సరస్వత్యా స్తనద్వయమ్
ఏక మాపాత మధుర మన్యదాలోచనామృతమ్ ॥

ఇందలి భావమిది :-

నాకు (శ్రీ)రామ పాదపద్మ భజనమున నానందముగలదు. నాకీ కవితాధార జగత్ ప్రాణుఁడగు వాయువునకు నందనుఁడగు హనుమ ద్దేవుని కారుణ్య కటాక్షముచేత లభించినది. నా కవితాధార అమృత రాశి.

ఈకవితా ధారా మృతరాశినుండి ఒక్కొక్క దినమునకు-ఒక్కొక్క ప్రబంధ ముదయించును. ఒక్కొక్క గడియకొక్కొక్క శతక ముదయించును. ఇవియు సహజ కల్పనములుగాని అనువాదములు కావు. ఇవి యన్నియు నాకవితా ధారామృత రాశినుండి యుదయించిన అమృత బిందువులు. నేను "సంగీత కళా రహస్య నిధిని." సంగీత కళారహస్య నిధి ననఁగా 'సంగీత కళకును, తత్సంబంధులగు మర్మములకును స్థానభూతుఁడను, అని యర్థమును గ్రహింపవలెను.

'సఙ్గీత మపి సాహిత్యమ్' అను నభియుక్తోక్తిని స్వీకరించిన యీ మహాకవి వసుచరిత్ర ప్రారంభమునందలి మూఁడవ పద్యమునందే "సర్వ కళా స్వరూపిణియగు భారతీదేవికి, కాంతుఁడగు బ్రహ్మనిట్లు స్తుతించెను.

సకలామోదకతాళవృత్త గతులన్ సంగీత సాహిత్యనా
మక విద్యా యుగళంబు పల్కుఁ జెలికిఁ బాలిండ్లజోడై సిరుల్
ప్రకటింపన్ నఖరేఖలందు నలఘు ప్రస్తారముల్ సేయు స
ర్వకళాకాంతుఁడు ప్రోచుఁ దిర్మల మహారాయ క్షమావల్లభున్'

ఈపద్యమున స్తనపరముగను, విద్యాపరముగను రెండర్థములు ప్రదర్శింపఁబడినవి. అందు మొదటి యర్థము—

"సర్వజనానందకరమయిన తాళఫల వర్తులత్వములచేత- సంగీత సాహిత్యములను విద్యాద్వయము భారతీదేవికి పాలిండ్ల జోడయి కాంతులను ప్రకటించుచుండ, ఆస్తన ద్వయమునందు అధికములగు

ప్రస్తారములుగల వానినిగా నఖక్షతములనొనర్చు సర్వవిద్యా కాంతుఁడగు బ్రహ్మ-తిరుమలదేవరాయ క్ష్మారావల్లభుని రక్షించు గాక!''
ఇందలి రెండవ యర్థము:-

''ధ్రువతాళము మున్నగు తాళమార్గములచేత సంగీత కళానిపుణులకును, మత్తేభాది వృత్తగతులచేత సాహితీ కుశలులకునుఆమోదకరమయిన సంగీతము, సాహిత్యము అను విద్యాయుగళము, సరస్వతీదేవికి అమృత స్థానములగు పాలిండ్లజోడయి ప్రకాశించుచుండ అందు- అంగుళి రేఖలను (వ్రాతలను) అధికమగు స్వర ప్రస్తారమును, గురు ప్రస్తారమునుగల వానినిగాఁ జేయువాఁడును, సర్వకళాస్వరూపిణియగు సరస్వతీదేవికి కాంతుఁడునునగు బ్రహ్మదేవుడు - తిరుమల మహారాయక్ష్మావల్లభుని రక్షించుఁగాక!''

బ్రహ్మ-సర్వకళాకాంతుఁడగుటవలన, కళాకాంత రూపములగు (అర్థచంద్ర రూపములగు) నఖ చిహ్నములను పాలిండ్లపై చిత్రించె నను స్వారస్యము నెఱుంగునది. తాళ గతియందును, వృత్తగతియందు నుగూడ 'గురు' (U) ప్రస్తారము గలదని తెలియునది. "సంగీత సాహిత్యరూప భారతీస్తనద్వయ ప్రియుఁడగు భారతీవిభుఁడు-తిరుమల మహారాయలను రక్షించుగాక!'' అనుటవలన తిరుమల మహారాయలకుఁగల సంగీత సాహిత్య ప్రియత్వముగూడ స్ఫురింపఁ జేయఁబడినదని తెలియనగును. మహారాయల కిచట సర్వకళాసంపత్తి కూడా ప్రార్థింపఁబడినదని తెలియునది.

> ''రమణీయాక్ష సరాకృతిం బొలుచు వర్ణశ్రేణి-గీతానులాపము చేతన్ గణుఁగించి, యందు నిజబింబంబొప్ప, నచ్ఛామృతత్వము నాత్మ ప్రతిపాదకత్వమును తద్వర్ణాళియందెల్లఁ బూర్ణముఁ గావించిన వాణి తిర్మలమహారాయోక్తిఁ బొల్చుఁగృపన్''

అను "శ్రీవాణీ స్తోత్రము"నందు వీణానులాప మహాత్త్వము మనోజ్ఞముగా ప్రశంసింపఁబడెను. శ్రీవాణి - వీణానులాప మహత్త్వము అక్ష మాలికా రూపమునను న్న అక్షర పంక్తిని గఱగించి, కఱఁగి నీరయిన యా యక్షర పంక్తియందు తనరూపము ప్రసరింపఁగ ఆ యక్షర పంక్తియందంతటను, అచ్ఛామృతత్వమును, ఆత్మప్రతిపాదకత్వమును నిండింపఁ జేసెనట. అచ్ఛామృతత్వ మనగా- స్వచ్ఛజలత్వము. ఆత్మప్రతిపాదకత్వమనగా-ఆత్మబింబమును ప్రవేశింపఁ జేయుట జలరూపమగు వర్ణములయందు ఆత్మబింబముచేతనగు నిర్మలామృతత్వము- అమృత బ్రహ్మస్వరూపముగాను, ఆత్మ బింబొపాదకత్వము (బింబమును ప్రవేశింపఁజేయుట) బ్రహ్మ ప్రతిపాదకత్వము గాను అధ్యవసింపఁ బడినవి.

"వాణీగాత్రము ననుసరించు వీణానులాపముచేత-అక్షమాలికా రూపములగు వర్ణములు కఱఁగుట- రసస్వరూపిణియగు వాణి జల రూపముతో నున్న అక్షరములయందు ప్రతిబింబించుట, వానియందు రసరూప బ్రహ్మ స్వరూపమును నిండించి, తత్సాక్షాత్కారమును గలిగించుట" వీణానులాప మహాత్త్వమే యగునుగదా! వీణాగానము- బ్రహ్మసాక్షాత్కారఫలకమని ప్రదర్శించు నీపద్యరత్నము- శ్రీరామ రాజ భూషణుని సంగీత రహస్య కళానిధిత్వమునకొక యుదాహరణముగదా!

"గీత వాదిత్ర నృత్యానాం- త్రయంసఙ్గీత ముచ్యతే" "గీత-వాద్య, నృత్యములచేరికయే సంగీతమని చెప్పఁబడును." అనుసంగీత లక్షణమునే శ్రీరామజభూషణుఁడు స్వీకరించి, గీత వాద్యనాట్యముల నాయా సందర్భములందు వర్ణించెను.

అ న్నగర నాట్యశాలలఁ
జెన్నగు మురజముల రవళిచే నటియించున్

గన్నియలకన్న మున్నగఁ
బన్నగు భుక్తతతుల దృష్టి పాత్రములగుచున్?

(ప్ర. ప. 104)

అధిష్ఠాన పట్టణమునందలి నాట్యశాలలయందు మద్దెల మ్రోత లురుము లని భ్రమించి నాట్యమును నేర్చుకొనుచున్న కన్యలకంటె ముందుగానే నెమిళ్లు, దృష్టి పాత్రములై నాట్యము నొనర్చును. 'దృష్టి పాత్రము లగుచున్' అనఁగా దృష్టి సదృశములైన పత్రసమూహములుగలవియై (నెమలిపురి యీకలు గలవియై) కనుకనే, చూడఁదగినవియై, అను నర్థద్వయము నెఱుఁగునది. క్రింది పద్యమున నాట్యమహాత్మ్యమెంత మనోజ్ఞముగా వర్ణింపఁబడినదో సమీక్షింప దగి యున్నది.

"చందనగంధు లిందుమణిసౌధ తలంబున గొండ్లి సల్పఁగా
నందలి దివ్యచిత్రముల యందొకరై యనిమేష భామినుల్
కందళి తాద్భుత స్ఫురణఁ గన్గొని, తన్నటనాంతగీత,ని
ష్యంద సజీవ చిత్రముల సందడి నేగుదు రప్పురంబునన్"

ఆనగరమునందలి స్త్రీలు- చంద్రకాంతిమణి నిర్మితములగు మేడల మీఁద నాట్యము చేయుచున్నప్పుడు, భావాశ్రయమగు నానృత్య ప్రదర్శనముఁ జూడఁగోరి స్వర్గమునందలి దేవాంగనలువచ్చుచుందురు. తాము- అనిమేష భామినులు అనఁగా ఱెప్పపాటు లేనివారు కనుకను, నాట్య సందర్శనము అద్భుతమును స్ఫురింపఁజేయుట వలన స్తంభము నొందుట (నిశ్చలాంగులగుట) వలనను, ఆ మేడగోడలయందమర్చబడిన దేవతాచిత్రములలోఁ గలిసి, తాము చిత్ర ప్రతిమలవలె నుండి, నాట్యమును జూచుచుందురు. కనుకనే నాట్యమొనర్చుచున్న చందన గంధులకుఁ గానిపింపకుందురు. నాట్యము ముగిసిన పిమ్మట దేవాంగ నలు తిరుగ స్వర్గమునకు వెళ్ళునపుడు కాన్పింపరా? అనియా శంకించి- అద్భుతమగు ప్రత్యుత్తరము నొసఁగెను. ఆ సమాధానమిది:-

"పుర స్త్రీల నాట్యము ముగియునప్పుడు ప్రయోగింపఁబడిన గీత ప్రసారము చేత- ఆ మేడలమీఁది దివ్య చిత్రములు సజీవములయి కదలును. ఆ సందడిలో వానితోఁబాటు దేవతాంగనలు కూడ కదిలి పోవుచుందురు." దేవాంగనలు దివ్యచిత్రములతోఁ గలసి పోవుటకు- తెప్పపాటులేమి తోడ్పడినది. అంగ చలనముచే గుర్తింపఁబడకుండు టకు- నాట్యము చేతనగు అద్భుతస్ఫురణము వలనఁ గలిగిన నిష్క్రి యాంగత్వము (స్తంభము) తోడ్పడినది. తిరుగ వెడలిపోవుటకు, అచేతనములను సచేతనములుగాఁ జేయునదియగు గానరసమాహాత్మ్య ము తోడ్పడినది.

మనోజ్ఞమగు సంగీత ప్రయోగమున రాళ్లు కఱగుట, మ్రోళ్లు చిగురించుట (అచేతనములుగూడ సచేతనములగుట, సచేతనములు గూడ అచేతనములగుట) శాస్త్ర సిద్ధముగదా! ఈ సంగీత కళా రహస్యనిధి - ఈశాస్త్రము నిచట నద్భుతరీతి సమన్వయించెను. 'గాన రసానుభవమున' ఆనంద బాష్పోదయమగునను లోకానుభూతి నీ మహాకవి, (క్రింది పద్యమున నెంత మనోజ్ఞముగా నుత్ప్రేక్షించెనో సమీక్షింపనగును.

> పగడపుఁ జిట్టలన్ మనికి పట్టుగఁ గట్టిన పట్టుజీనువుల్
> జిగిబిగిమించి చంచువులఁ జించినచో రసపూరమూరఁ జె
> న్నగు రసదాడి గుంపులం పురాంతికసీమల శాలిపాలికా
> జగదభినంద్య గానరస సంగతిఁ గన్నుల నీరు గన్గతిన్"
>
> (ప్రథమాశ్వాసము ప. 114 సంఖ్య)

ఆపట్టణ సమీప ప్రదేశములందు- తెల్లచెఱకు తోటలు మెండుగా నున్నవి. శుక్తిమతీ నదీ తీరమునందు పగడఁపుఁదీగెల పొదలున్నవి. ఆ పొదలయందు పట్టుజీనువు లనుపక్షి విశేషములు నివసించుచుండును. వాని ముక్కులు కాంతియు, బిగియు గలిగియుండును. ఆ ముక్కుల

చేతనవి- తెల్లచెఱకు గుంపులను (కన్నులను- కణుపులను) చించు (బ్రద్దలుచేయు) చుండును. అప్పుడా కణుపులనుండి (కన్నులనుండి) చెఱకురస ప్రవాహమూరుచుండును.

ఆ నగర సమీపమునందుఁగల వరిచేలను గాచెడు శాలిపాలికలు మనోజ్ఞముగా పాడుచుందురు. ఆగానరసము- జగదభినంద్యము. రసవాడి గుంపులు (తెల్ల చెఱకు గుంపులు) శాలిపాలికల గానరసము గ్రోలుటచేత- తమకన్నులయందు (కణుపులయందు) ఆనంద బాష్పములను వహించినవా? అనునట్లు తోచుచుండును. పట్టు జీనువుఁను పక్షి విశేషములు తమ ముక్కులచేత పొడుచుట వలన నూరిన చెఱకు కణుపులయందలి రసము- శాలిపాలికా గానాస్వాదముచేత- ఇక్షుకాండములకు తమకణుపులను కన్నులయందు-ఒదవిన ఆనంద బాష్పోదయముగా నుత్ప్రేక్షింపఁబడెను. "ధాత్రీజాతముల్ జోలపాడె వలసత్పల్ల వోలనుంచి కలకంఠీనాద గీతంబులన్" (ప్రథ-148 ప) అను పద్యమున ఈ మహాకవి మరుత్కుమారుఁడనెడి మరుత్కుమారునికి (దేవతా కుమారునికి) వృక్షములనెడి దాదులు- ఆడుకోయిలల కంఠనాదమనెడి గీతములచేత- జోలపాటలు పాడించినట్లు చక్కని శిల్పముగల పద్యమును రచించి- జోలపాటలు- ఆడుకోయిలల కంఠనాదమువలె మృదుమధురమగు కంఠనాదముగల స్త్రీలే- పాడఁదగినివను నభిప్రాయమును ప్రదర్శించెను. ఇట్లే "కోమల కుముదాగతాళికుల మంజురవంబున జోల పాడుచున్." (తృతీ 27వ ప) అను పద్యపాదమున, తెల్లగలువలు కొఱకు వచ్చిన తుమ్మెదల గుంపులను సఖీసమూహముయొక్క మధురమయిన జుమ్మనెడి లాలిపాటలచేత జోల పాటలు పాడుచు నదీలలామ (శుక్తిమతి) కుమారుని కూతును భజించు (కాపాడు) చుండును" అనుచోట ఆకులమును ఆళికులముగా రూపించుటచేత - ఈతుమ్మెదల గుంపు - ఆతుమ్మెదల గుంపేయగునని గ్రహింపవలసి యుండును. జోలపాటలయినను, ఆడుకోయిలలయొక్కయు' ఆడుతుమ్మెదల యొక్కయు నాదము వంటి నాదముగల స్త్రీలే. పాడవలయునను నభిప్రాయమును —

శ్రుతిహిత ద్విజ కామిని సుస్వరములు (పంచ 49 వ ప)
"చెవుల కింపయిన పక్షి కాంతలయొక్క సుస్వరములవంటి (నాదముల వంటి) చెవుల కింపయిన నాదములుగల వేదాధ్యయన పరులయిన బ్రాహ్మణుల స్త్రీలయొక్క పెండ్లి పాటలును" అనుచోట స్పష్టము గనే ప్రదర్శించెను.

"వసంతర్తువునందు మకరంద రసమును గ్రోలిన ఆడుతుమ్మెదల పాట శృంగార రసయుక్తముగా నుండును" అను విషయమును క్రింది పద్యమున నెంత మనోహరమగు శిల్పము నొనరించి ప్రదర్శించెనో చూడుడు!

"ఆ సరసాళి సోయగపుఁ బాటలతోడఁజని మాధవి ప్రవాళశాటిఁ
దుడిచె"

"మకరంద రసమును గ్రోలిన తుమ్మెద అను సరసురాలయిన సఖి శృంగార రససమున్మిషితములగు పాటలతో వెళ్లి అశోకలతచేత తనపైని జల్లఁబడిన పూఁదేనెను మాధవియును (బండిగురువింత తీగెలను) సఖియొక్క చిగురుటాకు చీరచేతఁ దుడిచెను."

మీఁది పద్యమున, అశోకాదిలతలు రమణీమణులుగా నిరూపింపఁబడిరి. వారందఱును సఖీమణులు. కనుక వసంత క్రీడ నొనర్చినట్లు చిత్రింపఁబడిరి.

దీనిచేత వసంతమున మకరంద రసమును గ్రోలిన ఆడుతుమ్మెదలపాటలు శృంగార రసయుక్తములుగా నుండునని ప్రదర్శింపబడినది. ఇట్లే కంఠస్వరము మధుపానముచేత మధురమగునను విషయమును "కల్పద్రుమహాలారసోన్మదవైమానిక మానినీ మధురగాన స్వానసానందుఁడై" (ద్వితీ 6 వ ప)
కల్ప వృక్ష సంబంధి సురాపానముచేత మత్తుఁగొనిన దేవతామానినుల మధురగాన ధ్వనిచేత ఆనందముగలవారయి" అను వాక్యమున

ప్రదర్శించెను. ఇట్లే "సుముచల దళినీగానము క్రందై" అను పద్యము నను మకరందము గ్రోలిన ఆడుతుమ్మెదల గానమును ఆనంద బ్రహ్మముగా ప్రశంసించెనుగదా!

ఇట్లే —

"గొనలు పాటల నేర్పుఁ గుముదరసామోద సామోదమధుప శుద్ధాంత సమితి" (తృతీ 28 వ ప)

"కుముద రసామోదములయందు" అనగా;

కలువపూలయందలి మకరంద రసమునందును, తత్ పరిమళము నందును, సామోదములగు (సమ్మోదముతోఁ గూడినవియగు) మధుపములను (తేనెలనుగ్రోలిన తుమ్మెదలను) అంతఃపురస్త్రీ సమితి – గిరికాదేవికి గొనబుపాటలను నేర్పునని" అను చోటనుగూడఁ మధువునుగ్రోలిన యాడుతుమ్మెదల పాటలనే ప్రశంసించెను.

"చంచరీక కుటుంబినీ ఝుంకార మంగళ సంగీత నాదంబులతోన్".

[తృతీ 154 ప]

అనుచోట ఆడుతుమ్మెదలు – అందును, కుటుంబము గల ఆడుతుమ్మెదలు – మంగళ ప్రదాయకములగు సంగీత నాదములకు ముఖ్యములుగా ప్రశంసింపఁబడినవి. "వాని ఝుంకారములు – మంగళ సంగీతనాదములే" అనునది యీ మహాకవి మధుర భావన. ఉద్యాన పాలకులు వచ్చి వసురాజేంద్రునితో వాయువొనర్చిన ధూర్తతను దెలుపు సందర్భమున మధుపాయులు (త్రాగుబోతులు) అమృత ప్రాయమును, క్రొత్తదియునగు గానము నొనర్చినను, అట్టివారికి కానుకలిచ్చుట శిష్టాచార (శిష్టసమాజ) విరుద్ధమను నభిప్రాయమును ధ్వనింపఁజేయుటకు. మధుపాయులగు మగతుమ్మెదలను మధుపాయులుగా (త్రాగుబోతులుగా) రూపించెను, చూడుఁడు.

"నానామధుప నవ్యగానామృతము మెచ్చి సూనాసవములెల్లఁ జూరవిచ్చె" [ప్రథ. 135]

మధుపానమున మదించిన గంధవహుఁడు (వాయువు) అను గర్వగ్రస్తుఁడు మధుపాయులగు మగతుమ్మెదలను మద్యపాయుల స్తోత్రపాటలకు మెచ్చి, పుష్పాసవములను (సారాయములను) మిఁగత లేకుండునట్లు కానుకలుగా నిచ్చెను."

"లలితమాగధలోక కలకంఠగానంబు కలకంఠగానంబు నలమికొనియె"
[ప్ర ధ. 149]

"గానరూపమున స్తుతించు మాగధ (స్తోత్రపాఠక) జనము యొక్క లలితమగు కలకంఠ (అవ్యక్తమధుర) ధ్వనియు, మగకోయిల పంచమస్వరరూప గానమును మిళితమయ్యెను" అనుచోట మగ కోకిలలగానము ప్రశంసింపఁబడినది. కాని, జాగరూకుఁడగు నీమహాకవి-పురుషులగు మాగధులగానముతో, ఆడుకోకిలల గానమునకు-ఏకత్వమును జెప్పుట సముచితముకాదను నభిమతమున, మగకోకిలల గానము నిచట ప్రశంసించెనని గ్రహింపనగును.

"లలనా మణులవుడు పవన! తల నానాసూన సంపదలు
కలకంఠికల నాదకుఁ దెలిపిరి" [తృతీ 133 వ ప[

అనుపద్యమున గిరికాదేవి యొక్క అవ్యక్తమధుర కంఠనాదము నకు కోయిలమ్మల కంఠనాదమునే సామ్యముచేసెనుగదా! ఆడు కోయిలల నాదము - మగకోయిలల నాదముకంటె మధురాతి మధుర మను నీ మహాకవి భావనకు క్షతిలేదు.

కాళిదాసమహాకవి "చూతాఙ్కురాస్వాద కషాయ కణ్ఠః।
పుంస్కోకిలోఽయం మధురం చుకూజ"

అని కుమారసంభవమున పురుషకోకిలముల నాదమునే మధుర మని ప్రశంసించెను.

"లోకో భిన్నరుచిః" గదా!

## బృందగాన పద్ధతి

బృందగాన పద్ధతి— శ్రీరామరాజ భూషణుని కాలమునకు ముందే మిగుల వ్యాప్తినొంది యున్నట్లు క్రింది పద్యము వలనఁ దెలియును.

ఒక చాయ ననపాయ పికగేయ సముదాయ
మొకసీమ నానామయూర నినద!
మొకవంక నకలంక మకరాంక హయహేష
లొక కేళివ వనదేవ యువతి గీత
మొక చెంత సురకాంతలకరాంత తతనాద
మొకదారి నవశారికోదితంబు
లొకయోరఁబటు చారణకుమార ఫణితంబు
లొకదండ నవి మండవికలగాన
మొక్క మొగి మ్రోయఁ గదళీగృహోపపన్న
కిన్నరీబృంద, బృంద సంగీతరీతి
నమరు నతివేల కోలాహలముల కలిమి
నతివ యీయద్రి కోలాహలాఖ్య మొక్క!"

(ద్వితీ 7 పద్యము)

"ఈ కోలాహల పర్వతమునందలి, అరఁటి చప్పరములయందుఁగూడు కొనిన కిన్నర స్త్రీ బృందము బృంద సంగీతము నొనర్చుచున్నారు. ఎడతెగని కోకిల పాటలు (పంచమస్వర ధ్వనులు) నెమిళ్ళ యఱుపులు (షడ్జస్వర ధ్వనులు) చిలుకల పలుకులు వనదేవతాగానములు, అమర స్త్రీల వీణాదివాద్య ధ్వనులు, గొరవంకల పలుకులు, చారణ యువకుల స్తోత్రవచనములు, తుమ్మెదల అవ్యక్త ఝంకార గానము, కలసి మెలిసి యొకేవిధమున మ్రోయుచుండ, నందు— కిన్నరీ బృందము యొక్క బృంద సంగీతము— (బృందగానము) లీనమయి యున్నది.

ఇచట నిట్లు కోలాహలముగా నుండుటచేతనే యీ పర్వతమునకు కోలాహలనామ మొదవినదేమో!" అనునది యింతలి యర్థము. బృందగానము- ఉత్తమ బృందగానము నతిక్రమించి అతిశయించిన కోలాహలములను గలిగియుండుట వలన, కోలాహల బృందగాన యుక్తమగుచున్నది. కనుకనే యీ పర్వతమునకు గోలాహలనామ మొదవి యుండెనేమో అని సంభావించెను. ఇచట కోకిలల పాటయం దలి పంచమస్వరము (పా) యొక్క ధ్వనియు, నెమళ్ళకూతలయందలి షడ్జస్వరము (స) యొక్క ధ్వనియు, వీనితో గూడిని ఝంకార యుక్తములగు తుమ్మెదల పాటయు, శ్రుతులగుచుండ, సురాంగనలు తతములను పేరుగల వీణాది వాద్యముల నొనర్చుచుండ, మకరాంక హయహేషలు అనగా మన్మధునికి గుఱ్ఱములగు చిలుకల పలుకులు- మద్దెల మ్రోతలుకాగా, నవశారికల (గోరవంకల) నుడువులు తాళ ప్రయోగ ధ్వనులుకాగా, చారణ యువకుల స్తుతివచనములు- ప్రశంసా భాషణములు కాగా, దేవతా యువతిగానము- సహకార గానము కాగా, కిన్నర స్త్రీ బృందము- బృంద సంగీతము నొనర్చె నని సమన్వయింపనగును.

శ్రుతులు, వీణాది వాద్యములు, మృదంగాదుల వాద్యములు, తాళప్రయోగములు, సహకార గానము, సభ్యుల ప్రశంసావచనము లు మున్నగునవి- బృందగానమున కావశ్యకములుగదా!

"గాతృ వాదక సంఘాతో బృందమిత్యభిధీయతే।
ఉత్తమం మధ్యమమధో కనిష్ఠమితి తత్త్రిధా!"

(సంగీత రత్నాకరమునందలి తృతీయాధ్యాయము నందలి 203 వ శ్లోకమున తెలుపబడెను)

గాయకుల యొక్కయు, వాద్యకారుల యొక్కయు, సంఘము- బృంద మని చెప్పబడును. ఆబృందము ఉత్తమము, మధ్యమము, కనిష్ఠము-

అని త్రివిధము, ముఖ్యగాయకులు— నలుగురు, వెనుకనుండి పాడుగాయకులు ఎనమండుగురు. సహకారగానము చేయు స్త్రీలు—పండ్రెండుగురు, పాలికులు (పిల్లనగ్రోవినూదువారు) నలుగురు, మార్దవికులు— (మద్దెల వాయించువారు) నలుగురు, సమ్మేళనము నొందిన యెడల ఆ బృంద ముత్తమ బృందమని చెప్పఁబడును. దీనియందు అర్థభాగము గలది మధ్యమ బృందము. దానియందు అర్థ భాగముగలది— కనిష్ఠ బృందము." అని యిచటనే చెప్పఁబడెను, తదుపరి "ఉత్తమాభ్యధికం బృందం. – కోలాహల మితీరితమ్" – అని 209 వ శ్లోకమున, చెప్పబడెను. కనుక నిచట పేర్కొనబడినది కోలాహల బృందగాన మగుచున్నది. తుమ్మెదలపాటల నుపాంగములుగా (శ్రుతులుగా) చేసికొని పాడుట నీ మహాకవి క్రింది వచనమున వాచ్యముగానే తెలిపెను.

"సంతాన కుసుమ వాసనాసమాగత సారంగ సంగీత
భంగీ తరంగము లుపాంగములుగాఁ బాడువేల్పు
గాణీల, పాణీరిత మాణిక్య వీణా మధుర రావా[...]
మృతంబుల, గఱఁగి జరుగు కురువిందకందళం
బుల జలంబులన్"

సారంగ సంగీత భంగీతరంగములు— ఉపాంగములు (శ్రుతులు)గా వేల్పుగాణీలు పాడుచున్నారట; వాద్యసమ్మేళనముకూడ ఆకాలమున బహుళ ప్రచారము గలిగియుండెను. ఈ విషయమున శ్రీరామరాజ భూషణ మహాకవి పర్వత సహజ ధ్వని సమ్మేళన పరముగను దేవేంద్రుని కృపవలన పట్టణ రూపము నొందిన పర్వతమునుండి అనఁగా పర్వత పట్టణమునుండి ప్రసరింపఁ జేయఁబడిన వాద్యసమ్మేళన పరముగను రచించిన క్రింది పద్యమును సమీక్షింపఁ దగినది.

ఘనఘోషోపార్వటియున్, సమీరణముఖా ఘూతాహితానాహత
స్వన నానాసుషిరావళీ ఘుమ ఘుమ వ్యాపారమున్, గిన్నరీ

నినిదంబుం, గలకంఠి కారవ సుధా నిష్యూతియున్ ఝుఝ్ఝరౌ
ఘ నినాదంబున, నందు(గ్రందుకొనుచున్ గప్పెన్ క కుప్పాళికన్ ॥

"అందు పర్వత సహజధ్వని సమ్మేళనపరమగు నర్థమిది:- మేఘగర్జనముల యార్భటియు, వాయుపరిసారమువలన తమతమ ముఖభాగముల యందేర్పడిన తాకిడిచేత కలిగింపబడిన అప్రతిహాత నాదముగల బహువిధ బిలసమూహము నందలి ఝుమ్ - ఝుమ్, అనువ్యాపారమును, కిన్నరపక్షి కాంతానినదమును, ఆడకోయిలల ఆరవములనెడి అమృత పరిసారమును, పాయలుగా చీలిపోయిన సెలయేళ్ల చప్పుడును - ఆకోలాహల పర్వతమునందు సంకులమయి, దిక్సమూహమును ముంచెత్తెను."

కోలాహల పట్టణమున ప్రవర్తితమగు వాద్య సమ్మేళనపరమగు నర్థమిది :-

కాంస్య తాళాది ఘనవాద్యముల యార్భటియు గాలిని పూరించుటచేత ప్రయత్న పూర్వకముగ పలికింపఁబడు వేణువు,నాగస్వరము మున్నగు వాద్యములకు సంబంధించినవియు, వాయుపూరణ మాత్రమున పలికింపఁబడుచు శ్రుత్యుపయోగులగు బాకా మున్నగువానికి సంబంధించినవియు, నగు బహువిధ సుషిర (రంధ్రములుగల) వాద్యముల ఘుమ ఘుమ నినాదమును, వీణలలో నొకటియగు కిన్నరీ (రెండు తీగెఁల) వాద్య విశేషముయొక్క నాదమును, అవ్యక్త మధుర కంఠనాదముగల స్త్రీలయొక్క మధుర నాదామృత పరిసారమును, ఝర్ఝరములు (కైగుల్లు) అనుఆనద్ధ (చర్మయుక్త) వాద్యముయొక్క శీఘ్రగమనముగల నినాదమును, ఆకోలాహల పట్టణమునందు మిళితమయి దిక్సమూహము నాచ్ఛాదించెను. మీఁది పద్యమున కేవల వాద్యసమ్మేళన మాత్రమే గాక, ఆతోద్యములని చెప్పఁబడు చతుర్విధ వాద్యముల సమ్మేళనము చెప్పబడినది. ఇవి చతుర్విధవాద్యములు

1) కాంస్య తాళాది వాద్యము:- "ఘనము" అని చెప్పబడును. 2) వేణువు మున్నగు రంధ్రములతోఁ గూడిన వాద్యము- సుషిరము అని చెప్పఁబడును. 3) తీఁగెలుగల వాద్యము- 'తతము' అని చెప్పబడును, 4) చర్మముతోఁ గూర్పఁబడిన మృదంగాది వాద్యము- 'ఆనద్ధము' అని చెప్పబడును. మీఁది పద్యమున ఘన వాద్యములును, సుషిరవాద్యములును, కంఠోక్తములు. కిన్నరీ (వీణా) వాద్యము- తత వాద్యము- ఝర్ఝరము- ఆనద్ధము. మీఁది పద్యమున- ఈవాద్యములు నాలుగును చెప్పఁబడినవి. కనుక నిందు వాద్య చతుష్టయ సమ్మేళనము ప్రదర్శింతమని గ్రహింపనగును.

క్రింది పద్యమున-తతము, సుషిరము, ఘనము, ఆనద్ధము అను వాద్యములను క్రమముగా దెలిపి, వాని నఖండబ్రహ్మముగా సమన్వయించెను.

వైణిక వల్లకీ శ్రేణి నిమ్మ్నలమీటె, గాయక గంధర్వగమక రేఖ
గాంధర్వగమక రేఖఁ బరాహతము చేసె వాంశికవంశికా వైభవంబు
వాంశికవంశికా వైభవంబెగనూఁదె- తాళికాధర కరతాళగరిమ-
కరతాళ గరిమంబు- కంచుమించుగ నొత్తె నానద్ధ చటులతూర్య
ప్రజంబు

చటుల తూర్య వ్రజమునంటఁ జఱచె, పరిణ
యాగత దిగంత నృపతి నాగాశ్వరథప
దాతి కోలాహలంబు, రోదసి నఖండ
మగుచు, నాదాత్మక బ్రహ్మ మతిశయిల్ల॥

(పంచమాశ్వాసము 69 పద్యము)

గాన మొనర్చుచు వీణలను వాయించువారి వీణల సమూహమును- ఆ వీణాగాయకుల సంగీత విషయమైన గమకముల తీరు- గోటమీటెను. అని చెప్పఁబడెను. ఇచ్చట "గోటమీటఁ దగిన వీణలను గోటమీటెను." అని అనురూపమగు నర్థము లభించును, (కాన్పించును)

గాత్రమునందు పలుకఁబడు గమకములు- వీణయందుఁగూడ పలుకబడ వని ధ్వని. కాని- సంగీత గమకములతీరు- వీణలను మీటుట సంభ వించునది కానేరదు. కనుక నిచట, మీాటెను అనుదానికి-చిమ్మెవెచెను; అణఁచెను అను నర్థము తెలుఁగవలయును. కాఁగా గాయక గానధ్వని, వీణాధ్వని నతిక్రమించెను అనుభావము తెలుఁగఁదగును. ఆ గాయక గమకశ్రేణు- వేణువు నూదువారి వేణువుల నినాదము- పరాహతము చేసెను అనఁగా ఆ హతనాదము (ఖండముగుధ్వని) గలదానినిగాఁ జేసెను' అని చెప్పఁబడెను. ఇచట - ఆహతనాదమగు గానమును ఆహతమగు (ఖండమగు) స్వరముగల దానినిగఁ జేసెను అను రూపమగు నర్థము లభించును. కాని వేణునాదము- గాయక సంగీత గమకపు తీరును ఆహతస్వరముగాఁ జేయుట సంభవముకాదు. కనుక "పరాహతము చేసెను అనఁగా, మిక్కిలిగా తూలగొట్టెను." అను నర్థము తెలుఁగవలయును. వేణుగాన వైభవము- గాయక గానము నతిక్రమించెనని భావము. ఇట్లే తాళగాండ్రి కంచుతాళముల ధ్వని- వేణువుల నెగనూదెననఁగా, ఊదెనను నర్థమును గ్రహింపక, వేణు నాదము వినబడకుండునట్లు చేసెను అను భావమును గ్రహింపవలసి యుండును. ఇట్లే మృదంగాదుల వడిగల ధ్వని సమూహము ఆ కంచు తాళములను "కంచు మించుగ నొత్తెన్" అనుచోట మృదంగాది వాద్యము- కంచు తాళమును కంచు మించునట్లుగ నొత్తుట కుదరదు గనుక, అగోచరముగ నొనర్చెను అను నర్థము తెలుఁగనగును. మృదంగాది వాద్యధ్వని- కంచుతాళముల ధ్వనిని చెదరగొట్టెనని భావము. "ఆ మృదంగ భేర్యాదులను- పెండ్లికి దిగంతములనుండి వచ్చిన నరపతుల, చతురంగ బలముల కోలాహలము "అంట జరచెను" అనగా గట్టిగా వాయించెను అను నర్థమునుగాక అడఁగ ద్రొక్కెను అను భావమును గ్రహింపవలయును. దీనియందు కోలాహల ప్రబంధ లక్షణముగూడ నున్నది. భూమ్యంతరిక్షముల యందంతటను అఖండ

మగు బ్రహ్మమునుండి వివర్తించి, ఆ బ్రహ్మమువలె భూమ్యంతరిక్షముల యందంతటను నిండి, అఖండమగుటవలన. నాదము- బ్రహ్మాత్మకముగాఁ జెప్పబడియెను. ఇట్టి పద్యమున చతుర్విధములగు వాద్యములను అనఁగా -'తతము'లని చెప్పఁబడు వీణలను, 'సుషిరము'లని చెప్పఁబడు వేణువులను, 'ఘనము'లని చెప్పఁబడు కాంస్యాది కరతాళములను 'ఆనద్ధము'లని చెప్పఁబడు మృదంగ భేరి ప్రముఖములను క్రమముగాఁ జెప్పి, ఈ వాద్యముల ధ్వనులు- క్రమముగా పూర్వోక్త వాద్యముల ధ్వనుల నతిక్రమించినట్లు తెలిపెను. ఇందు చివరను దెలుపబడిన 'ఆనద్ధ వాద్యము'లగు మృదంగ భేర్యాదుల వడిగల ధ్వని సమూహమునుగూడ- పరిణయ దర్శనము కొఱకు దిగంతములనుండి వచ్చిన రాజులయొక్క- చతురంగ బలములగు—గజాశ్వరథపదాతుల కోలాహలము - అణఁగఁ గొట్టెనని చెప్పి, చివరను ఈ ధ్వని సమూహమంతయు భూమ్యంతరిక్షములయందు వ్యాపించి - అఖండమై-అనఁగా, "ఇది వీణాధ్వని, ఇది గాయక గానము, ఇది వేణుధ్వని, ఇది తాళధ్వని, ఇది మృదంగాది ధ్వని, ఇది చతురంగబల కోలాహల ధ్వని" అని తెలుపుటకు వీలుగాక, ఏకమగుటవలన అఖండ నాదాత్మక బ్రహ్మమయ్యెనని సమన్వయించెను. దీనివలన పరబ్రహ్మరూపమగు అఖండ నాద మొకటియే యనియు, అది- ఉపాధిభేద సంబంధమున విభిన్న స్వరరూపమున భిన్నత్వము నొందెననియు స్ఫురింపఁజేయఁ బడినది. భిన్నత్వమున-ఏకత్వమును జూడగలుగుటయే కళావిజ్ఞాన రహస్యము. ఇది సంగీత కళారహస్య విదులకే తెలియఁ దగియున్నది. బ్రహ్మాత్మకమగు ఒకేనాదము- తీగెలను నుపాధి నాశ్రయించి విలక్షణమగు వీణాధ్వనిగాను, గాత్రము నాశ్రయించి, గానముగాను, పిల్లనగ్రోవి నాశ్రయించి వేణునాదముగాను, కంచుతాళము మున్నగు తాళముల నాశ్రయించి తాళనాదముగాను, మృదంగాదుల నాశ్రయించి మృదంగాది నాదముగాను, గజములను, అశ్వములను, రథములను, పదాతులను

ఆశ్రయించి ఆయా ధ్వనులుగాను, పరిణామమునొంది ఆహతనుద్యోను (ఖండరూపము నొందెను). ఈ నాదములు క్రమముగా నొకదాని యందింకొకటి లయించి, అఖండమగుటవలన నేకనాదమై- నాదాత్మక బ్రహ్మమయ్యెను. అఖండ బ్రహ్మమున వివర్తించిన అఖండమగు నాదము- ఖండమై, తిరుగ అఖండ నాదాత్మకమగు బ్రహ్మమయ్యెనను తత్త్వరహస్య మిందు స్ఫురింపజేయఁ బడియెను. దీనివలన ఈ మహాకవికిగల విజ్ఞానయుక్తమగు 'సంగీత కళారహస్య నిధిత్వము' వ్యక్తమగుచున్నది.

క్రింది పద్యము నందలి వసంతరాగ విషయమున ప్రస్తుత కాలమున వివాదములు చెలరేగినవి. కథా సందర్భము ననుసరించి వసంతఋతు ప్రవేశమును వర్ణించుటలో ఈ సంగీత కళారహస్య నిధి- రాగ సంబంధియగు విషయమును క్రింది పద్యమున నెంత మనోజ్ఞముగా నిబంధించెనో చూడనగును.

> అరిగాఁ బంచమ మేనగించి, నవలా లవ్వేళ హిందోళ వై
> ఖరి నూపన్, బికజాత మాత్మరవ భంగవ్యాకులంబై, వనీ
> ధర నాలంబిత పల్లవ వ్రతతతిన్ దాల్పన్, తదీయ ధ్వనిన్
> నరిగాఁ గైకొనియెన్ వసంతము, మహాసంపూర్ణ భావోన్నతిన్.
> [ప్రథమాశ్వాసము - 129 న పద్యము]

వసంతఋతు ప్రవేశ సమయమున నవలాలు- స్త్రీలు, అరిగా- అనఁగా కోకిలకు ప్రతికూల మగునట్లుగా, పంచమ స్వరమును ('పా' అను స్వరమును) రోసి హిందోళ రాగమును పాడగా, అని యొక అర్థము. నవలాలు - అరిగా ఋషభ స్వరము (రి) లేకుండ పంచమ స్వరము ('పా')నురోసి- అనగా ఋషభ పంచమ స్వరములను (రి, ప- లను) రెంటిని విడచి, హిందోళ రాగమును పాడగా అని యింకొక యర్థము. కోకిల సమూహము తమకు సంబంధించిన పంచమ స్వరము,

(పాను- ఆ రమణులు ఏవగించి, విడిచి సంపులకు కలఁతనొంది, వన భూముల కరిగి, "చిగురుటాకులను తినుట"అను వ్రతవిధులను పూనగా అనగా చిగురుటాకులను దినుచు తపస్సు చేయఁగా, ఆ కోకిల సంఘమునకు సంబంధించిన పంచమ స్వరము (పా)ను వసంతు డను దేవుఁడు వసంతరాగ రూపమున 'మహాసంపూర్ణ భావోన్నతిన్' మహత్తరమైయెంసిన హృదయ భావాతిశయముచేత, 'సరిగాన్' అనగా కోకిలల కనుకూల మగునట్లుగా 'కైకొనియెన్' గ్రహించెను. అని సామాన్యార్థము. వసంత ఋతువున గానము చేయఁదగిన వసంత రాగము- మహాసంపూర్ణ (సంపూర్ణ సంపూర్ణ)రాగ భావోన్నతిచేత సరిగాన్' ఋషభ ("రి") స్వరముతోఁగూడ ఆ పంచమ స్వరమును, (తదీయ ధ్వనిని) 'కైకొనియెన్' గ్రహించెను అనునది విశేషార్థము. ఇచట శిశిరము ముగియుచున్నప్పుడు 'హిందోళరాగము' నాలాపించిన స్త్రీలు- వసంత ఋతువురాగానే, ఋషభ పంచమ- (రి. ప.) స్వరములతోఁ గూడుటవలన సప్తస్వర సహితమై, వసంతమున పాడఁదగిన సంపూర్ణ సంపూర్ణ రాగమగు (మహాసంపూర్ణ రాగమగు) వసంత రాగము నాలాపించిరి అనుభావము తెలియఁగనగును.

'శిశిరస్య వసన్తస్య సన్ధౌ హిన్దోళ రాగ కః'

శిశిర వసంత ఋతువుల సంధి కాలమున హిందోళ రాగము- గానము చేయఁదగినది.

'వసన్తస్స సహాయస్తు- వసన్తర్తౌ ప్రగీయతే'

సహాయ (రాగిణీ) రాగములతోఁ గూడిన వసంత రాగము- వసంత ఋతువునందు చక్కగా గానము చేయఁదగినది అని సంగీత శాస్త్రము.

రాగరాగిణీ భేదము సంగీత మకరందమున శ్రీ నారదునిచేఁ దెలుపఁబడినది. వసంత ఋతువు రాకముందు- వసంత జన్యమగు

హిందోళ రాగమును బాడిన నవలాలు- వసంత ఋతువు రాఁగానే, సంపూర్ణ సంపూర్ణ మేళమగు వసంత రాగమును బాడిరనునది యిందలి భావము.

మీఁది పద్యమువలన హిందోళ రాగము- ఋషభ ('రి'), పంచమ ('ప') స్వరములు లేక స'గ'మ'ద'ని అను స్వరములతోఁ గూడియుండు ననియు, వసంత రాగము ఋషభ ('రి') పంచమ (ప) స్వరములతోఁ గూడి సప్తస్వర యుక్తమగుటవలన 'సరిగమపదని' అని సంపూర్ణమై యుండుననియు నర్థము సిద్ధించుచున్నది. ఔడువ సంపూర్ణ రాగములు, షాడవ సంపూర్ణములుకూడ సంపూర్ణములని చెప్పఁబడును.

'మహాసంపూర్ణ భావోన్నతిన్' అని మీఁది పద్యమునఁ జెప్పఁబడి యుండుటవలన వసంత రాగము 'ఔడువ' సంపూర్ణమనిగాని, షాడవ సంపూర్ణమనిగాని సమన్వయించుటకూడ ఆ మహాకవి సూక్తిని సంకోచపరచుటయే యగును. ప్రస్తుత కాలమున వసంత రాగము షాడవ రాగముగా 'స గ మ ద ని స, స ని ద మ గ రి స,' అను స్వరములతో పాడఁబడుచున్నవి. కనుకనే కొందఱు సంగీత విద్వాంసులు వసంత రాగము- మహాసంపూర్ణ రాగమని చెప్పిన రామరాజ భూషణుని యభిప్రాయము- సంగతము కానేరదని యభిప్రాయపడుచున్నారు. సంగీతకళా రహస్యనిధి నని చెప్పికొనిన 'రామరాజ భూషణుఁడు, అసంపూర్ణ రాగమును మహాసంపూర్ణ రాగమని యెట్లు చెప్పెను? రామరాయ తిరుమల రాయలచే సమ్మానింపఁబడిన రామయామాత్యుఁడు, లక్ష్మీధరుఁడు, చతుర దామోదరుఁడు మున్నగు సంగీత విద్వద్వరేణ్యులతోఁ గూడిన మహాసభయందు సంగీతకళా రహస్యనిధినని తెలిపిన రామరాజ భూషణుఁడు అసంగతమును వ్రాయునా?

ప్రాచీనములగు సంగీత గ్రంథములను, నాట్యశాస్త్రము, సంగీత మకరందము, బృహద్దేశి, సంగీత రత్నాకరము, రాగవిబోధము, స్వర

మేళకళానిధి, మున్నగు వానిని సమీక్షించి, తత్ప్రామాణ్యము ననుసరించి, రామరాజ భూషణుని కాలమున 'వసంత రాగము' మహాసంపూర్ణ రాగముగా నుండెనని తెలుపఁగలుగుటకు సంతోషించుచున్నాను. ప్రస్తుత కాలమున పాడఁబడుచున్న హిందోళము, వసంతము అను రాగముల- స్వరలక్షణమును ప్రాచీన కాలమున పాడఁబడిన హిందోళ, వసంత రాగముల స్వర లక్షణమును క్రమముగా నివేదింతును.

ప్రస్తుత కాలమునఁ బాడఁబడు హిందోళ రాగము (నఠ) భైరవి జన్యము. (నఠ) భైరవి స్వరములు.

చ సా శు    శు కై
స రి గ మ ప ధ ని స- ఆరోహణము-

కై శు    శు సా చ
స ని ధ ప మ గ రి స - అవరోహణము.

ఆరోహావరోహణములను 'మూర్ఛన'యని చెప్పుదురు. నఠభైరవిజన్యమగు హిందోళకు మూర్ఛన అనఁగా ఆరోహము, అవరోహణము క్రింది తీరున నుండును.

సా శు శు కై    కై శు శు సా
ఆ:- స గ మ ధ ని స    అవ:- స ని ధ మ గ స

హిందోళ రాగమున 'రి, ప,'లు లేవు కనుక ఆరోహమునందును, అవరోహణమునందును, 5 స్వరములు మాత్రమే యుండును. ఐదు స్వరములుగల జన్యరాగమును 'ఔడువ' రాగమని యందురు. గోవిందుఁడు- సంగ్రహ చూడామణియందు సంపూర్ణ సంపూర్ణములనే మేళకర్తలనియు, రాగాంగరాగము లనియు చెప్పెను.

ప్రస్తుత కాలమునఁ బాడబడు వసంత రాగము- పదునేడవ మేళకర్తయగు సప్తస్వర సంపూర్ణమును అగు మాయామాళవగౌళము

నుండి జనించినదని కొంతకాలము క్రిందటి వఱకును చెప్పుచుండిరి. (వేంకట మఖియు) గోవిందుఁడును- అట్లే చెప్పిరి.

మాయామాళవ రాగమునకు మూర్ఛన.

ష అం ష ష కా కా ష ష అం ష
స రి గ మ ప ధ ని స స ని ధ ప మ గ రి స

దీనియందు జనించిన వసంత రాగమునకు మూర్ఛన.

పం
అం ష చ కా కా చ ష అం ష
స గ మ ద ని స స ని ద మ గ రి స-

అని యుండునని చెప్పెదరు. కాని చతుశ్శ్రుతి ధైవతమును అనగా చ, ధ, ను ఉపయోగించి పాడుదురు. ఇప్పుడు చ, ధ- అనుదానిని పూర్వులు- పంచశ్రుతి ధైవతమని వ్యవహరించిరి. చ, రి- అనుదానిని పంచశ్రుతి రిషభమని వ్యవహరించిరి.

మాయామాళవ గౌళ యందలి శుద్ధధైవతమును అనఁగా 'శు, ధ' ను చతుశ్శ్రుతి ధైవతముగా అనఁగా ' చ, ధ'గా మార్చినయెడల ఆ రాగము పదునేడవ మేళకర్త్రరాగమును సంపూర్ణమును అగు సూర్యకాంతరాగ మగును. కాఁగా ప్రస్తుత కాలమునఁ బాడఁబడు చున్న వసంత రాగము సూర్యకాంత జన్యమని చెప్పవలసియుండును. (శ్రీ) కే. రామచంద్రన్, ఎమ్. ఏ. గారిచే కూర్పఁబడిన "త్యాగరాజ కీర్తన హారము"అను గ్రంథమున "వసంత రాగము - 17 వ మేళ కర్తయని ఒక ఊహ" అని చెప్పబడినది. అట్లగుచో వసంత రాగము 17 వ మేళకర్తయు, సప్తస్వర యుక్తమును, అగు సంపూర్ణ రాగము కావలసియుండును. 17 వ మేళకర్తయగు సూర్యకాంత రాగమునుండి వసంత రాగము జనించినదని వారి యభిప్రాయము కావచ్చును.

ప్రస్తుత కాలమునందలి విద్వాంసులు కొందఱు వసంతము- సూర్యకాంత జన్యమనియే చెప్పుచున్నారు. వసంత రాగమునుగూర్చి

రాగవిబోధమను సంగీత గ్రంథమున (1609 A. D.) సోమనాథునిచే నిట్లు చెప్పఁబడియెను.

'సాంశన్యాస గ్రహకో వసన్త ఉషసి వీలనేత్ పూర్ణః –
(చతుర్థ వివేకమున 12 వ శ్లోకము (పేజీ 24)

వసంత రాగమున, అంశము (జీవస్వరము) స. న్యాసము= (ముగింపఁదగిన స్వరము) స. గ్రహము= (ఎత్తుబడి చేయదగిన స్వరము) స. ఉషః కాలమున గానము చేయఁబడును.

వసంత రాగము– సప్తస్వరములుగల సంపూర్ణ రాగము అని చెప్పఁబడును.

అందలి స్వరములు. —

| శుద్ధ | శుద్ధ | అంతర | శుద్ధ | శుద్ధ | శుద్ధ | కాకలి |
|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ద | ని |

దీనికి ప్రమాణమగు మూల శ్లోకము– రాగబోధము నందలి తృతీయ వివేకమున (38 వ శ్లోకముగా) నిట్లున్నది. (పేజీ 20)

"శుద్ధావసన్త మేళే సరిమ పధా అన్తరశ్చ, కాకలికా।
అస్మాద్ వసన్తటక్క– హిజేజా, హిన్దోళ ముఖ్యాశ్చ॥"
(తృతీయ వివేకమున 38 వ శ్లో॥)

"వసంతము మేళకర్తృరాగము. వసంత మేళమునందు– "స రి మ ప ధ" అను 5 స్వరములు– శుద్ధములు. అంతర గాంధారము, కాకలీ నిషాధము, ఈ వసంత మేళరాగమునుండి– వసన్త, టక్క, హిజ్జేజ, హిందోళ మొదలగు రాగములు (జన్యరాగములు) పుట్టినవి."

దీనివలన వసంత రాగము మహాసంపూర్ణ రాగమగు మేళకర్తృరాగమనియు, దీనినుండియే– హిందోళ పుట్టినదనియు స్పష్టపడుచున్నది.

"సవసన్తో హిన్దోళః" అని పంచమ వివేకమునఁగూడ వసంత ములోఁగూడి హిందోళము- ఉషఃకాలమునఁగాని, ఎల్లకాలమునను (ఏ కాలమునందైనను)గాని పాడఁదగునని రాగవిబోధమునందే చెప్పఁ బడెను.

కనుకనే, సంగీత కళారహస్య నిధియగు నీ మహాకవి- మొదట వసంతమునుండి పుట్టిన హిందోళ రాగమును- ఆ రమణీమణులచేఁ బాడించి, కోకిలల తపస్సు ఫలించి వసంత ఋతువురాఁగానే, రిషభ, పంచమములతోఁగూడి, సంపూర్ణ సంపూర్ణమగు వసంత రాగమును పాడించెను. క్రీ. శ. 1550 సంవత్సరమున స్వరమేళ కళానిధిని రచించితి నని స్వయముగా చెప్పుకొనిన రామామాత్యుఁడు వసంత రాగమును మేళకర్తగా జెప్పుకున్నను, రాగవిబోధమున సోమనాథుఁడు 7 వ మేళ కర్తయగు వసంత మేళమునుండి పుట్టినదని చెప్పిన హెజ్జుజ్జిరాగమును

షఅం షు. షు షు కా

మేళకర్తగాఁ జెప్పి- సోమనాథుఁడు చెప్పిన స రి, గ, మ, ప, ద, ని. అను స్వరములనే దాని యందుండునవిగా చెప్పియున్నాఁడు. రామా మాత్యుఁడును, సోమనాథుఁడును, చాలవఱకు రాగ లక్షణముల నొక్కే విధమునఁ జెప్పియున్నారు.

రాగములు- మార్గరాగములు- 1 గ్రామరాగములు, 2 ఉప రాగములు, 3 రాగములు, నిరుప పదరాగములు, 4 భాషారాగ ములు, 5 విభాషా రాగములు, 6 అంతరభాషా రాగములు.

దేశీయ రాగములు 4 విధములు. 1 రాగాంగ రాగములు, 2 ఉపాంగరాగములు, 3 భాషాంగరాగములు, 4 క్రియాంగరాగములు

అందు గ్రామరాగముల ఛాయ ననుసరించి సంపూర్ణములగు రాగములు- రాగాంగ రాగములని చెప్పఁబడెను.

గ్రామోక్తా నాంతురాగాణాం ఛాయామాత్రం భవేదితి।
గీతజ్ఞైః కథితా స్సర్వే రాగాఙ్గాస్తే న హేతునా॥

అని మతంగముని బృహద్దేశియందు చెప్పెను. అందు– పూర్వ ప్రసిద్ధములు– శంకరాభరణాదులు 8– రాగాంగరాగములుగాఁ జెప్పఁబడినవి. అధునా ప్రసిద్ధములు (శార్ఙ్గదేవుని కాలమున ప్రసిద్ధములు) 13 రాగాంగరాగములుగాఁ జెప్పఁబడినవి. అందు– వసంత రాగము 10 వ రాగాంగరాగముగాఁ జెప్పబడినది. శార్ఙ్గదేవుఁడు క్రీ. శ. 12 0 లోనివాఁడు. అతఁడు

శ్లో॥ మధ్యమాది ర్మాలవశ్రీ స్తోడీ బఙ్గాల భైరవౌ
వరాటీగుర్జరీగౌర, కోలాహాల, వసన్తకాః,
ధన్యాసీ దేశీ, దేశాఖ్యా, రాగాఙ్గాణి త్రయోదశ.

సంగీత రత్నాకరము (రాగవివేకాధ్యాయము 9, 10 శ్లోకములు) అని చెప్పెను. రాగాంగరాగములు – ఆరోహావరోహణముల యందు క్రమము తప్పక సప్తస్వరములను గలిగియుండును. కనుక, మీఁది శ్లోకమునఁ జెప్పఁబడిన వసంత రాగము శార్ఙ్గదేవుని మతమునఁగూడ, మహాసంపూర్ణరాగమే యగుచున్నది. మఱియు–

శార్ఙ్గదేవుఁడు రాగవివేకాధ్యాయమున 96 వ శ్లోకమున హిందోళ లక్షణమును జెప్పునపుడు– తత్సముద్భవమగు వసంతము– పూర్ణమని కంఠోక్తముగఁ దెలిపెను.

వసన్తే ప్రహరేతుర్వై, మకరధ్వజవల్లభః,
సమ్భోగే వినియోక్తవ్యో వసన్తసముద్భవః
పూర్ణః, తల్లక్షణో, దేశీహిన్దోళోఽప్యేకకథ్యతే. (96 శ్లో)
వసన్తం లక్షయతి:– వసన్త ఇతి:– పూర్ణః = సప్తస్వరః.
ఏతావతా కారణభూతా్ పూర్ణహిన్దోళాద్ భేదః"

అని సుధాకర వ్యాఖ్యయందును, వసంతము– సంపూర్ణమని వ్యాఖ్యానింపఁబడెను. సోమనాథుఁడు రాగవిబోధమున చతుర్థ వివేకమునందు గల 14 వ శ్లోకమున నిట్లు చెప్పెను.

"హిన్దోళో రి ప హీనో మాంశః సాన్తగ్రహః సదోషసివా"
హిన్దోళమున రి, ప, లుండవు. అంగస్వరము మ. గ్రహ, న్యాస స్వరములు స. ఈరాగము ఏ కాలమునందైననుగాని ఉషఃకాలమునఁగాని పాడఁదగినది.

ఇందలి స్వరములు ఇట్లుండును.

హింధోళ- వసంత జన్యము కనుక దీనికి వసంతరాగ స్వరములే యుండును. రి. ప. లుండవు.

శుద్ధ అం షు షు కా
స గ మ ధ ని స
స ని ద మ గ స

అని జౌడవమై యుండును.

ప్రస్తుత కాలమున పాడఁబడుచున్న వసంత రాగము- రామ రాజ భూషణుని కాలము నందలి వసంత రాగముకానట్లే, ప్రస్తుత కాలమున పాడఁబడుచున్న హిందోళకూడ, ఆనాటి హిందోళ కాదు. హిందోళ మూర్ఛన ఇట్లు ప్రయోగింపబడును — రాగవిబోధమున పంచమ వివేకమున 47, 48 శ్లోకములలో హిందోళ స్వర ప్రయోగము క్రింది విధమున నొసఁగఁబడెను. (37 పేజీ)

హిన్దోళః స గ స గ మ ద
మ ద ని స గ స గ ని స గ స ని ద ద 47.
మ ధ మ ధ ని ధ ధ ని స స ని ధ
ని ద మ గ మ గ స స ని ద ని ద మ గ మ గ స
స స గ గ మ మ ద ద ని ని స స
ని ద ని ద మ గ మ గ స గ స గ ని స 48.

రాగవిబోధము నందలి పంచమ వివేకమున 46, 47 శ్లోకములలో వసంతిరాగ స్వరప్రయోగము- క్రింది విధమున ప్రదర్శింపఁ బడినది.

ఏ ష వ స న్తః స రి గ మ
ధ ప మ ప మ గ మ ధ మ ధ ని ద ద ని స స స
స్థ మ గ గ రి స ని స ని ద మ ద
మ ధ ని ధ ద స స స ని ద ప మ ప 4
మ మ మ గ గ రి స స ని ద ప
మ ప మ గ మ ద ప మ ప మ గ మ మ గ గ రి స.

శ్రీ నారద ప్రోక్తమగు సంగీత మకరందమునందలి సంగీతాధ్యాయమునందుగల తృతీయ పాదమునందలి 35 వ శ్లోకము నుండి 39 వ శ్లోకము వరకునుగల శ్లోకములలో 'దేశాక్షి' మున్నగు పదునొకండు రాగములు పేర్కొనఁబడి, అవి సంపూర్ణ రాగములుగాఁ జెప్పఁబడి, వానికిగల గృహ (గ్రహ) స్వరములు తెలుపఁబడెను. అందు శుద్ధమగు వసంత రాగము- తొమ్మిదవ రాగముగా పేర్కొనబడినది. వసంత రాగమునకును, శుద్ధవసంత రాగమునకును, శ్రీ నారద మహర్షి భేదమును పాటింపక, ఒక రాగముగనే పేర్కొనెను. శుద్ధమగు నీ వసంత రాగము- షడ్జస్వర గ్రహము గలదిఁ జెప్పఁబడెను. సంగీత మకరందమునందలి 55 వ శ్లోకమున వసంత రాగము పుంరాగముగాఁ జెప్పఁబడెను. అందే 74 వ శ్లోకమున తెలుపఁబడినపురుష రాగములలో వసంత మొకటిగా నున్నది. 72 వ శ్లోకమున వరాటి ద్రావిడి, హంసి అను రాగములు వసంత రాగమునకు భార్యలుగా పేర్కొనఁ బడినవి. మధ్యమాది రాగము మున్నగు పదుమూఁడు రాగములు "సంగీతరత్నాకరము" నందువలెనే సంగీత మకరందమునందుఁ గూడ రాగాంగరాగములుగా చెప్పఁబడినవి. అందువసంతరాగము తొమ్మిదవ రాగాంగ రాగముగానున్నది. ఆరోహణావరోహణల యందు క్రమము తప్పక, సప్తస్వరములును గలిగియుండునదియగు సంపూర్ణ రాగము రాగాంగరాగమని చెప్పఁబడును. క్రీ.శ. 1620 లోనున్న వేంకటేశ్వరదీక్షితులు (వేంకటమఖి) కూడ శుద్ధవసంతరాగమును సంపూర్ణ

రాగముగాఁ జెప్పెను, కాని వసంతరాగమును గూర్చి యిట్లు చెప్పెను.

శ్లో॥ "వసంత రాగస్సంపూర్ణశ్చ్యుత పంచమ సంయుతః,
ఆరోహేతు గవక్రిస్యా - ద్రివర్జోఽ యతే సదా"

వసంత్రరాగము — సంపూర్ణము, చ్యుతపంచమముతోఁ గూడి యుండును. ఆరోహమునందు గాంధారము వక్రముగానుండును. 'రి' అను స్వరము తరచుగా విడువఁబడు చుండును, అని చెప్పెను. వెంకటమఖి చెప్పిన మీఁది లక్షణమునే అనుసరించినను, సంగీత సంప్రదాయిని — అను గ్రంథము దీని ఆరోహణావరోహణములను క్రిందివిధమున తెలిపెను. సంగీత సంప్రదాయనియందు వసంతరాగ మూర్ఛన—

మూర్ఛన | ఆరోహణము. ш రి స గ ను ш ధ ని స
| అవరోహణము. సా ని ш ధ ని ధ మా గ మ మ
చ్యు ప
ప ను గ ш రి స.

ఇది జన్యరాగమనియు భాషాంగరాగ మనియు, సంపూర్ణ మనియు, ఆరోహణమునందు పంచమము వర్జ్యమనియు, అవరోహణ మునందు వక్ర చ్యుత పంచమ మనియు, దేశీయరాగమనియు, ఎల్లప్పుడును గానము చేయఁదగుననియు తెలుపబడెను. దీని రచయిత సుబ్బరామదీక్షితులుగారు ఈవసంతరాగలక్షణము క్రింద నిట్లు వ్రాసిరి

"☞ ఈవసంతరాగమునకు పంచమము లేదని కొందఱి మతము. అది సరికాదు. సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వాంకష చతుర్విధ కవితా నిర్వాహకుఁడనియు, సంగీతరహస్య కళా నిధి యనియు బిరుదువహించిన రామరాజభూషణుఁడనే

మహాకవిచేఁ రచియింపఁబడిన వసుచరిత్ర ప్రథమాశ్వాసములో (అరిగా పంచమ మేవగించి) అనెడి ౧౩౧ వ పద్యమున "వసంతము మహా సంపూర్ణ భావోన్నతిన్." అని జెప్పి యుండుటచేత వసంతరాగము సంపూర్ణమనియే వెంకటమఖి యభిప్రాయమని తోఁచుచున్నది." అని.

గోవిందుఁడను సంగీత శాస్త్రజ్ఞుఁడు - సంగ్రహ చూడామణి యందు - దీనిని మాయామాళవగౌళ జన్యముగా చెప్పెను. ప్రస్తుత కాలమునందలి సంగీత విద్వాంసులు - వేంకటేశ్వరదీక్షితుని (వేంకటమఖి) యొక్కయు, గోవిందునియొక్కయు, క్రొత్త పద్ధతిని అనుసరించుచున్నను - మీఁది లక్షణమునైనను, పాటింపకుండుటకు కారణము తెలియదు. మీఁది సమీక్షనుబట్టి చూడగా వేంకటేశ్వర దీక్షితుని (వేంకటమఖి) కాలమునుండియు - వసంతరాగము క్రమ క్రమముగా మార్పునొందినట్లు భావింపవచ్చును. రామామాత్య, సోమనాథుల రాగాంగరాగములు - సంపూర్ణ సంపూర్ణ రాగములే యగుచున్నవి. సంగీతమకరందము - సంగీతరత్నాకరము - రాగ విబోధము మున్నగు సంగీతశాస్త్ర గ్రంథములవలన, వసంతరాగము-మహాసంపూర్ణమను విషయము స్పష్టపడుచునే యున్నది. కావున వసంతరాగము - మహా (సంపూర్ణ) సంపూర్ణ రాగమనుట - నిర్వివాదమని పాఠకులు గ్రహింపఁగోరెదను. సంగీతము - అకాలమునందు లతలు పుష్పించుటకు చేయఁబడు దోహద విశేషముగా నుండునను దోహదశాస్త్రము నీ మహాకవి - క్రింది పద్యభాగమున నిట్లు ప్రదర్శించెను.

పికగీతి, బోడి చూపి ప్రియాళులఁతే.

ప్రియాళులత (ప్రేంకణపుఁదీగె) అను ప్రియాళు లతానాయిక "కోకిలగానమను పాటను బాడెను" అనియర్థము.

రామరాజభూషణుని యభిమతమున సంగీతము 1) అవ్యక్త మధురధ్వని గలిగి యుండవలయును. సంగీతస్వరము 2) వీనులవిందై, అమృతపుసోనల పొందై, సుమచల దళినీగానము క్రిందై, ఆనంద బ్రహ్మమై యుండవలెను. మఱియు 3) అది నవ్యమగు అమృతమువలె, అవ్యాహతాస్వాదము గలది కావలయును. ఆనాదము అడుతుమ్మెదల నాదమో, కలకంఠ (కోకిల) నాదమో, దేవతాకాంతల వీణానాదమో వివరించుటకు వీలుపడక వాని నతిశయించిన విలక్షణతను గలిగి పరమానందమును అనుసంధించునదిగా నుండవలయును. కళ – ఆనంద జనకము, ఏ కళయందయినను ఆనందము ననుభవించిన వ్యక్తి – అనుభవము ముగిసినపిమ్మట – జాగరూకుఁడై ఆయనుభవమును తనలోఁ దాను స్మరించును, లేదా దానిని స్మరించి, ఆయనుభవమును అంతరంగికులకుఁ దెలుపును. స్మరించుట, స్మరించి యితరులకుఁ దెలుపుట, లేని అనుభవము – స్థిరమగు ననుభవము కాదు. వసురాజువినిన యానాదము – ఘననాదమనియు, శ్రావకనాదమనియు చెప్పఁబడును. వసురాజు – ఆయానందానుభవమును సదాస్మరించుచు, కేళి సచివునిఁ గూడ స్మరింపఁజేయుచు, నెంతమనోజ్ఞముగాఁ దెలుపుచున్నాఁడో! చూడుఁడు!

> నానా గాయన గాయనీమణులగానం బుర్వి రాలింపమో
> నానాటఁ నగభేది వీటగల గంధర్వాప్సరోగీత వి
> ద్యానైపుణ్యము లెన్నియేని వినమో, అందైన నిందైన విం
> దై నాదంబొనగూర్చునే మఱికి నిట్లానంద సందోహముల్.
>
> (ద్వితీ 16 ప.)

ఈభూమియందు సంగీతనిపుణులగు పురుషులగానము విన్నాము. స్త్రీలగానము విన్నాము.

---

(1) కలస్వనంబు వినవచ్చెన్ మాధురీధుర్యమై [2 ఆ. 13 ప.]
(2) వీనులవిందై [2 ఆ. 14 ప.]
(3) నాదంబొక్కటి [2 ఆ. 15 ప.]

అప్పుడప్పుడు నాతోఁగూడ నీవు స్వర్గమునకు వచ్చెడి వాడవు గదా! మనము అనగభేది (పర్వత భంజనుఁడయిన) ఇంద్రుని పట్టణమునందున్న గంధర్వులయు, అప్సరసలయు గీతవిద్యా నైపుణ్యములను గూడ నెన్నింటినో వినియున్నాము. కాని ఆస్వర్గమునందు విన్న గాంధర్వమునందైనను, ఈభూమియందున్న గానమునందైనను గల నాదము ఇప్పుడు మనము విన్న అవ్యక్తమధుర నాదమువలె, ఇంత – ఆనందసందోహమును – అనఁగా తిరుగ తిరుగ ఆనందమును సంఘటించినదా? "ఆనంద సందోహమున్" అనుచో నున్న యర్థ గాంభీర్యము – ఆమహాకవికిఁగల ఆనందానుభవ రహస్యకథన నిధిత్వమును ప్రదర్శించును. మిక్కిలి దూరమునుండి వచ్చినను రంజకత్వమును గలిగించునాదము – శ్రావకనాదమని సంగీతసుధ చెప్పుచున్నది. క్రిందిపద్యమున రామరాజభూషణుని సంగీత కళారహస్య నిధిత్వము – అమోఘముగా ప్రదర్శితమగు చున్నది! చూడుడు.

అనవిని కేళికా సచివుఁడల్లన నాస్వనమాలకించి, ఓ
జనవర! నల్లకీరవము సంగతిఁబాడెద రెవ్వరో వినూ
తనగతి నిమ్నహోద్రిపయి, తన్మృదు పంచమషడ్జశయ్య కో
య్యన నెలుఁగిచ్చెవింటె! ప్రమదాకుల కోకిల కేకి లోకముల్.
(ద్వితీ. 17 వ ప.)

మాధురీధుర్యమైన కలస్వనమును విని, అది తుమ్మెదలనాదమో కోయిలలనాదమో, దేవతా నారీమణుల నాదమో వివరించుటకు వీలు కలుగకున్నదనియు, అది – పరమానందమును ననుసంధించుచు నవ్యమగు నమృతము నడ్డులేకుండ నాస్వాదించు చున్నట్లుగా వినవగు చున్నదనియు, వసురాజు పలికిన వాక్యమును విని, క్రీడాసఖుఁడయిన ఆమంత్రి – ఆనాదమును సూటిగావిని రాజుతో నిట్లనియెను.

"ఓజనపతీ! పాడుచున్న వారెవరో తెలియదుగాని, ఆ పాడు చున్నవారు, వీణానాదముతో కంఠనాదమును గలిపి కొంగ్రొత్త

రీతులతో, ఈ మహాపర్వతము మీదనే పాడుచున్నారు. వీణానాద ముతోఁగూడిన ఆపాటను విని, ప్రమదముచేత పరవశించిన కోకిల లోకము, కేకి లోకము (నెమిళ్లు) ఆ పాటయందు- మృదువుగానున్న పంచమ షడ్జశ్రుతులకు (ప. స. రూపశ్రుతికి) వెంట వెంటనే తమ పంచమ, షడ్జస్వరములనుచేర్చి, ఆ పాటను విస్తరింపఁచేసినవి. విన్నావా? అని పలికెను. కోకిలలు పంచమ స్వరమునకును, నెమిళ్ళు షడ్జస్వరమునకును ధ్వనినిచ్చుట వలన పరిపుష్టమయిన యీ మహా నాదము- "కోకిల కేకినాదములతోఁ గూడిన ఎవరో వ్యక్తుల సంగీత నాదము" అనునది కేళికా సచివుని ప్రత్యుత్తరము. వసురాజు నాదా నంద రసతన్మయుఁ డగుటవలన మీఁది విషయమును గుర్తింపజాల కుండెను. కేళీసచివుఁడు- విమర్శకుండగుట వలన నీవిషయమును గుర్తించెను. మీఁది పద్యమునందుఁగల నిగూఢమగు వేఱొక యర్థ మును వ్యాఖ్యాత లెవ్వరును గుర్తించినట్లు కానరాదు. భూషణుని కళారహస్య నిధిత్వము దీనిచే సువ్యక్తమగు చున్నది. సంగీత శాస్త్రీయమగు క్రింది విషయములను సంగ్రహముగా ముందు ప్రదర్శించి, తదుపరి ఆ రెండవ యర్థమును దెలుపుదును. సంగీతము నందలి 7 స్వరములకును గల 22 శ్రుతులునుగూడ- భరతముని కాలమున ప్రత్యేకముగ గుర్తింపబడి యుచ్చరింపఁబడెడివి. ప్రాచీన మగు సంగీతరత్నాకరమను సంగీతశాస్త్ర గ్రంథమున 1220 సం. ప్రాంత పువాఁడగు శార్ఙ్గదేవుఁడు 19 శ్రుతులను ప్రత్యేకముగ గుర్తించి వ్యవహరించెను. అతని మతమున- శుద్ధ పంచమమునకు ముందున్న దియు, స్వస్థానము (శుద్ధపంచమ స్థానమగు 17 వ శ్రుతి) నుండి దిగ జాఱినదియు, కనుకనే చ్యుతపంచమ మనియు 'త్రిశ్రుతిపంచమ'మనియు చెప్పఁబడునదియునగు 16 వ శ్రుతిని రామరాజ భూషణుని కాలము నందలి వాడుకలో మృదుపంచమ మని వ్యవహరించు చుండిరి. పదు నారవ శతాబ్దము చివరికాలము నందలి వాఁడగు సోమనాథుఁడను

సంగీత శాస్త్రవేత్త "రాగవిబోధము" అను సంగీతశాస్త్ర గ్రంథమున శార్ఙ్గదేవుని వాడుకలోని, చ్యుతపంచమును మృదుపంచమమనియే వ్యవహరించెను. అట్లే శార్ఙ్గునిచేత, చ్యుతషడ్జము అని వ్యవహరింపఁబడిన 3 వ శ్రుతి రామరాజభూషణ, సోమనాథుల కాలమున మృదుషడ్జమని వ్యవహరింపఁబడెను. మృదుపంచమము–శుద్ధపంచమ స్థానము కంటెను, మృదుషడ్జము– శుద్ధషడ్జస్థానము కంటెను పూర్వస్థానముల యందుండుట వలన కొంచెము తక్కువ శ్రుతితోనుండి, ఆకాలమున ప్రత్యేకముగ నుచ్చరింపఁబడుచు, అల్పప్రయోగముగలవిగా నుండెడివి. ఈకాలమున సూక్ష్మములగు నాస్వరములు– వాడుకనుండి తొలఁగినవి. వెంకటమఖి కాలము నుండియు, 12 స్వరస్థానముల వాడుక యేర్పడి ప్రస్తుత కాలమున నదియే సంగీత విద్వాంసులచేత నాదరింపబడు చున్నది. 72 మేళకర్తల విభాగముకూడ– వేంకటమఖి కృతమే యగుచున్నది. సూక్ష్మమగు నీశ్రుతికి సంబంధించిన విషయమే, యీపద్యమున ప్రతిపాదింపఁబడినది.

"తన్మృదు పంచమ షడ్జశయ్యాకు, ఒయ్యన నెలుఁగిచ్చె వింటె
ప్రమదాకుల కోకిల కేకిలోకముల్"

అను పద్య భాగమునందలి రెండవ యర్థము నిప్పుడిట్లెఱుఁగునది. "వీణానాదయుక్తమగు ఆగానమునందలి మృదుపంచమ, మృదుషడ్జ-రూపమగు శ్రుతి శయ్యాకు వెంట వెంటనే, తమ శుద్ధ పంచమ, శుద్ధ షడ్జ, స్వరములను (అనురణనముచేత) తోడ్పుచేసి కోకిలలు, నెమిళ్ళు, శ్రుతిలోపమును పూరించి– ఒకేనాదముగల దానినివలె చేసెను." మృదుపంచమ, మృదుషడ్జ శ్రుతియందుఁగల శ్రుతి స్థానలోపము– కోకిల, కేకి, లోక మొసఁగిన శుద్ధ పంచమ, శుద్ధ షడ్జశ్రుతుల అనురణనముచేత పూరింపఁబడుట వలన అది– ప్రకృతి, వికృతి, స్వర విశ్రాంతి స్థానమగు, శుద్ధ పంచమ షడ్జశయ్యాగా నేర్పడుటవలన–

పంచమ షడ్జముల (ప. స. రూపశ్రుతిని' నీమహాకవి శయ్యగా రూపించెను. 22 శ్రుతులయందుఁగల సప్తస్వరముల యందును మృదు పంచమము 16 వ శ్రుతికిని, మృదుషడ్జము 3 వ శ్రుతికిని పారి భాషికనామములనియు అవి యొకానొక కాలమున పలుకఁబడెడివనియు, అవియే యిచటఁదెలుపఁ బడినవనియు వ్యాఖ్యాతలు గుర్తింపరయిరి. ఇట్లే మృదు మధ్యమముకూడ (12 వ శ్రుతియందు) ప్రత్యేకముగా నుండెడిది. మృదుషడ్జము మూడవ శ్రుతియందును, మృదుమధ్యమము 12 వ శ్రుతియందును, మృదుపంచమము 16 వ శ్రుతియందును, ప్రత్యేకముగా విద్వాంసులచేత పూర్వకాలమున (రామరాజ భూషణుని కాలమున) పలుకఁబడెడివి. ఆకాలమున తరుణ వయస్సునందుం డిన సోమనాథుఁడను సంగీతవిద్వాంసుఁడు 1609 సం.లో తనచేత రచింప బడిన తన రాగ విబోధమున, మృదుషడ్జము, మృదు పంచమము, మృదు మధ్యమము, అను నీ సంజ్ఞలను ప్రయోగించి వ్యవహరించి యున్నాఁడు. శార్ఙ్గదేవుఁడు- త్రిశ్రుతి పంచమ మనియు, చ్యుతపంచమ మనియుఁ, చెప్పిన 16 వ శ్రుతినే సోమనాథుఁడు మృదు పంచమముని వాడియున్నాఁడు. కావున రామరాజ భూషణుని కాలమున, ఈసం జ్ఞలు ప్రసిద్ధములుగా ఉన్నవనుటయందు సందేహము లేదు. రామరాజ భూషణుని కాలమునందే రామరాయల యాస్థానమునందే యుండి తత్ప్రేరణమున 'స్వరమేళ కళానిధి'ని రచించిన రామామాత్యుఁడు శార్ఙ్గదేవుని మతమును సంస్కరించుటకు- శార్ఙ్గదేవు డుపయోగించిన చ్యుత షడ్జ, చ్యుత మధ్యమ, చ్యుత పంచమ సంజ్ఞలనే స్వీకరించి యున్నను, ఆకాలమునందే యుండిన రామరాజ భూషణుని "మృదు పంచమ షడ్జశయ్య" అను ప్రయోగమును, ఆకాలమున కించుక వెనుక క్రీ. శ. 1609 సం. లో రచింపఁబడిన రాగ విబోధమునందలి మృదుషడ్జ, మృదు మధ్యమ, మృదుపంచమ, పారిభాషికపద ప్రయో గమును సమీక్షించు నెడల రామరాజభూషణుని నాటికీ సంజ్ఞలనే

సంగీత విద్వాంసులుపయోగించి యుండిరని నిశ్చయింపనగును. ప్రాచీన కాలమునందలి 22 శ్రుతుల పలుకుబడి రామరాజభూషణుని కాలమున 14 లేక 15 స్వరములుగా నుండి, వేంకటమఖి కాలమునుండియు 12 స్వరములుగాఁ జేయఁబడినట్లు తోఁచుచున్నది.

ప్రపంచమునందలి లోకులు- శయ్యయందు విశ్రమించునట్లు శుద్ధస్వరములును, వికృత స్వరములునుగూడ తక్కువ శ్రుతులగు మృదుషడ్జశ్రుతులయందు విశ్రమింపక, 17 వ శ్రుతి స్థానమగు శుద్ధపంచమమునందును, 4 వ శ్రుతియగు షడ్జమునందును విశ్రాంతి నొందుచుండును. కనుక సంగీతకళా రహస్యము నెఱిఁగిన యీమహాకవి- పంచమ షడ్జములను స్వరవిశ్రాంతి శయ్యగా రూపించి, ఆశయ్య- మృదుపంచమ మృదు షడ్జ (చ్యుతపంచమ, చ్యుతషడ్జ) శ్రుతి రూపమున, శుద్ధపంచమ, శుద్ధషడ్జ శ్రుతికంటె నించుకతగ్గి శుద్ధ వికృత స్వరములు విశ్రమించుటకుపయుక్తము గాకుండుటవలన శుద్ధ పంచమమును సహజముగా పలుకునదియగు కోకిలలోకముచేత శుద్ధ పంచమమును శుద్ధ షడ్జమును పలుకునదియగు కేకి లోకముచేత శుద్ధ షడ్జమును, అను రణనరూపమైన సహకారులుగా నిప్పించి- మృదు పంచమ షడ్జశ్రుతిని శుద్ధపంచమ షడ్జ శ్రుతిగాఁ జేయించెనని గ్రహింపనగును.

ఈ మహాకవికిఁగల సంగీతకళారహస్య నిధిత్వము- దీనిచే స్పష్టమగుచున్నది కదా!

"తన పాండిమము నవ్వులనె యుంచి, గాంధర్వ మవనికిఁ దెచ్చిన హంసయాన!"

(ద్వితీయ 27 ప)

అను పద్యమున 'గాంధర్వము' అను ప్రయోగమితనికి శాస్త్రీయమగు సంగీతమునందలి యభిరుచిని దెలుపును. గాంధర్వమనఁగా,

మార్గగానము. అది గ్రామరాగయుక్తమగు శాస్త్రీయ సంగీతము. గానము= దేశీయరాగ యుక్తమగు దేశీయసంగీతము. మొదటిది. అనాది సంప్రదాయముగలది. రెండవది వాగ్గేయకార రచితమును జనరంజకమును అగునది. ఇచట 'గాంధారమవనికిఁ దెచ్చిన' అను పాఠము కలదని కొందఱందురు. గాంధారమనఁగా గాంధారగ్రామము. అది దేవలోకమునందే పాడఁబడును. షడ్జగ్రామము, మధ్యగ్రామము, భూలోకమునందు గానము చేయఁబడినవి. ఇటీవల మధ్యగ్రామము కూడ లుప్తమయినది. చతుర్దండి ప్రకాశికయందలి స్వరప్రకరణమున "అస్మాభిర్మధ్యమ గ్రామోఽప్యసత్త్వాయ ఇతీష్యతే" అని వేంకటముఖి చెప్పెనుగదా! గాంధారము- భూలోకమునందు లేదు. అయినను ఈనాయిక (గిరికాదేవి) గాంధారమును భూలోకమునకుఁ దెచ్చిన సరస్వతి అని అతిశయోక్తి చెప్పఁబడెను. అది కవితామార్గమున ప్రశంసార్హమేయగును. కనుక ఆపాఠముకూడ ఆదరింపఁ దగినదియే యగును.

> గంధగజయాన గీత ప్రబంధ కలన నలరి
> యతిలియ్యమై వచ్చునరిది మగువలార! కనుగొంటిరే?'
>
> (ద్వితీయ. 81)

అను పద్యమున గీతములు — ప్రబంధములు చెప్పఁబడినవి. ఈ ప్రబంధములు సంగీత శాస్త్రీయములగు రచనలు. సూడ క్రమస్థితములగు ప్రబంధములలో శుద్ధసూడములు = ఏలాప్రబంధములు. సాలగసూడములు, గీత ప్రబంధములు, సంగీత ప్రబంధములు — 1 సూడస్థితములు, 2 ఆలిస్థితములు, 3 విప్రకీర్ణములు: అని (నానా) త్రివిధములుగా నున్నవి. "షడంగములగు పదాదులతోను, చతుర్విధములగు ధాతువులతోను, నిబంధింపఁబడిన స్వరసందర్భము-ప్రబంధ" మని చెప్పబడును. సాలగసూడములగు ఈ గీతములను, ఏలలను, ఆలి క్రమస్థితములు, విప్రకీర్ణములు, అగు ప్రబంధములను - మనస్సు

చేతనే కల్పించి పాడుట – గీతప్రబంధరచన. గిరికాదేవిచే నొనరింపఁ బడిన యీ రచనయందు, యతి – లీయమై = కూడఁగలిసి, అప్రయత్నముగా వచ్చు వింతను, ఓ చెలులారా! గ్రహించితిరా? అని యొక చెలి పల్కెనట.

వ్యాఖ్యాతలిచట – గీతప్రబంధ రచనన్ = గీతములను చెప్పుట యందు అనుసర్గమును మాత్రమే దెలిపిరి. ఇచట సాలగసూడములు అనఁగా ప్రస్తుతకాలమునందు సంగీత విద్యార్థులచేత అభ్యసింపఁ బడుచున్న పిళ్లారి గీతములు మున్నగువాని వంటి గీతములును, శుద్ధ సూడములు అనఁగా ఏలాప్రబంధములును, ఆలిక్రమస్థిత ప్రబంధములును, విప్రకీర్ణ ప్రబంధములును కూడ తెలుపఁబడినవి. కాని వ్యాఖ్యాత లిచట గీతములను మాత్రమే (గీత ప్రబంధములను మాత్రమే) పేర్కొనియున్నారు. "గీత ప్రబంధకలనన్" అనఁగా గీతములను, తదితర సంగీత ప్రబంధములను (త్రివిధములను) కల్పించి పాడుటయందు" అనుసర్గమును నిచట నెరుఁగనగును.

అన్నగ శేఖరుండును, మహా మణి కూట సమర్పణంబుచే
గిన్నరకోటులన్ నిలిపి గేయ విశారదఁజేసె గూఁతునుం
గిన్నరమీఁట, వీణఁబలికింపఁగ గీతములుం ప్రబంధము
ల్వాస్నియుఁ బాడఁ జెప్పనని – వారితచాతురి గల్గునట్లుగాన్.
(తృతీ. 33 ప.)

అనుపద్యము నందిట్లే ఈ మహాకవి – సాలగసూడములగు గీతములను – ఆలిస్థితములు, విప్రకీర్ణములు అగు ప్రబంధములనుండి వేరుపఱచి చెప్పెను. సాలగసూడ స్థితములగు గీతములు కూడ– వివిధములుగా నున్నవి. వీనియందు ఉద్గ్రాహము, ధ్రువము, ఆభోగము, అంతరి, ముద్రాఖండము మున్నగు భాగములు కలిగి యుండును. తదితర ప్రబంధముల లక్షణములను —

"పదమెత్తన్ కలహంసలీల" అనుపద్యము నందలి సంగీత ప్రబంధములను వివరించునపుడు తెలుపుదును. ప్రస్తుతము ననుసరింతము గాక!

"గీత ప్రబంధకలనన్"—గీతములను, ప్రబంధములను కల్పించి వెంట వెంటనే పాడుట యందు 'అలరి'-ఒప్పి, యతి=పాదాదియందుఁగల గణాదియందుఁగల విశ్రమాక్షరము లీయమై వచ్చునరిదిన్' — కూడి కలిసి వచ్చు నింతను మగువలార కనుగొంటిరే! చెలులారా! చూచినారా! అని దీని యర్థము నెఱుఁగనగును. ఇచట యతి పదమునకు గణాదియందు వచ్చు యతియని మాత్రమే వ్యాఖ్యాతలు తెలిపినారు. కాని లయతాళములను ఆశ్రయించునదియు, దశవిధములగు తాళ ప్రాణములయందు ఒకటిగా చెప్పఁబడినదియు నగు యతి— ఇచట ముఖ్యముగా చెప్పఁదగినదిగా నున్నది. ఈ యతి సమ- స్రోతో వహా. గోపుచ్ఛాది, భేదమున - ఆరు విధములుగా నున్నది. తాళాంగములగు లఘుద్రుతాదులుండు రీతినిబట్టి యివి యేర్పడును. "ఆద్యంత మధ్యములయందు సమానములగు నంగములు గలది - సమయతి. ఇత్యాది గానీయతులకు లక్షణములున్నవి. ఈ యతి - గీతములను ప్రబంధములను - గిరికాదేవి రచించి, పాడుచున్నపుడు - సముచిత స్థానముల నేర్పడుటయే - లీయమై వచ్చుట. ఆశువుగా సంగీత ప్రబంధములను రచించునపుడు తాళాంగములగు లఘుద్రుతాదులు సముచితస్థానమున నేర్పడునట్లు రచించి పాడగల్గుటకు - నవనవోన్మేష శాలిని యగు - ప్రతిభ ఆవశ్యకమగు చుండును. గిరికాదేవి యందుఁగల తత్ప్రతిభావిశేష మిచట ధ్వనింపఁజేయఁ బడినదని గ్రహింపనగును.

ముప్పదిమూడవ పద్యమునందలి యర్థము నిట్లెఱుఁగనగును. "గిరికాదేవి తల్లి— గిరికను సాహిత్యకవిత్వ విద్యా ప్రవీణురాలినొనర్చు

చుండ, పర్వత శిఖామణియైన కోలాహలుఁడు కూడ మణికూటము లను (రత్నరాసులను) సమర్పించి- దేవయోని విశేషులగు కిన్నరులను తనకొలువునందుంచి, రెండు తీగలుగల కిన్నర వాద్యమును వాయిం చుటకును, వీణయందు గీతములను ప్రబంధములను పలికించుటకును, మీఁద దెలుపఁబడిన గీతములును, ప్రబంధములును, చక్కగా పాడు టకును, ఇతరులకు చెప్పుటకును, అడ్డులేని చాతుర్యము కల్గునట్లుగా తన కొమార్తెను సంగీత విద్యయందు ప్రావీణ్యముగల దానినిగాఁ జేసెను" అని యిందలి యర్థము. ఇచట గేయ మనఁగా, ఉద్గ్రాహ ధ్రువాది ధాతువులని అర్థమగుచున్నది. తాళాది షడంగములతోఁ గూర్చి యీధాతువులను ప్రయోగించుటయే యిచట "గేయ విశారద త్వము" గా ఈమహాకవిచేత ప్రవచింపఁబడియెను.

"బహుళీకృత చాతురిమించు, నీవిపంచీ లలితారవామృతము చిత్తము
శోకినవారలు" (ద్వితీ- 82 ప)

అను పద్యమునందలి విపంచి- శార్ఙ్గదేవుఁడు చెప్పిన 1 ఏక తంత్రీ 2 నకులము 3 త్రి తంత్రిక 4 చిత్ర 5 వీణ 6 విపంచి 7 మత్తకోకిల 8 ఆలాపిని 9 కిన్నరి (రెండు తీగెలవీణ) 10 పినాకి 11 నిశ్శంక వీణ- అను వీణా భేదములయందు ఆరవదిగా నున్నది. ఈ వీణాభేదముల యందు గల్గు నాదములలో 'విపంచి' యందుఁ గలుగు నాదము మనో హరమైన అమృతమువంటి నాదము గలిగి యుండునను అభిప్రాయ మును- ఈమహాకవి యిచట సూచించెను. కనుక నిచటవ్యాఖ్యాతలు తెల్పిన వీణకంటె వేరగు కోణవాద్యమగు విపంచి నిచట పాఠకులు గ్రహింపనగును. ఈవిపంచీ రవామృతము బహుళీకృతమగు చాతుర్య మున తదితరముల నతిశయించునను నర్థము నిచట నెఱుఁగఁదగును. విపంచికి 9 తీగలుండుననియు, ఇది కోణ వాద్యమనియు భరతుఁడు చెప్పెను. (29 అధ్యా) గ్రామరాగములతోఁ గూడిన శాస్త్రీయ మైన సంగీతము గాంధర్వమనియు, దేశీయ రాగములతోఁ గూడి

సామాన్య ప్రజారంజకమైన సంగీతము– 'గాన' మనియుఁ జెప్పబడును. ఇచట గాన మనక, గాంధర్వమనుటచేత ఈమహాకవి– గిరికాదేవిని శాస్త్రీయమగు గాంధర్వమును భూలోకమునకుఁ దెచ్చిన సరస్వతిగా అభివర్ణించి, తనకు శాస్త్రీయమగు సంగీతమునందుగల అభిమతమును వ్యక్తీకరించెను. చూడుఁడు.

"గాంధర్వ మవనికిఁ దెచ్చిన హంసయాన"

(ద్వి- 27 ప.)

రాగాలాపమును గూర్చిన శాస్త్రీయ పరిభాషార్థము నెఱుఁగనివారికి రాగాలాపమును గూర్చి రచించిన క్రింది పద్యమునందలి యర్థము తెలియఁబడునదికాదు–

'ఆలావణ్యవతీమణుల్ గొలువఁగా నాలేమ యాకోనలో–
నాలీలాభవనంబులో ననఘ కంఠాలప్తి సౌభాగ్యముల్
వ్యాలోలాంగుళి సంజ్ఞచేఁ గఱపు దేవన్ వీణఁబల్కించునా
యాలాపంబె గిరిీ దరీ ముఖరమై– యాలింపగానయ్యెడిన్'.

ఆ కోనలోనున్న గిరికా సఖీమణులందఱును లావణ్యవతులు. వారు–తన రాగాలాపమును వినుచుండ, ఆలేమ– ఆ కోనలో ఆలీలాభవనములో రాగాలాపము నొనర్చుచు, వీణ వాయించుచుండెను. ఆరమణీమణి కంఠస్వరము అనఘము– అనఁగా దోషములు లేనిది. ఆలాపమును అనఘమే. దోషరహితమే. కంఠమునుండి ప్రసారింపఁబడుచున్న రాగాలాపమునందలి సొంపులను, ఆరమణీమణి– వీణకు బోధించు చున్నట్లున్నదట. అదెట్లనిన:– రాగగమకములను వాయించునపుడు– విశేషించి, చలించుచున్న అంగుళులచేత– వీణయందు రాగములను పల్కించు చున్నపుడు మిక్కిలిగా చలించుచున్న అంగుళుల కదలిక– సంజ్ఞలచేత– తనరాగా లాపమునందలి సొంపులను వీణకు బోధించు చున్నట్లున్నదట. అనఘ మన నేమి?

స్నిగ్ధముకాక రూక్షముగ నుండునదియు, స్ఫుటితముగ (భగ్నముగ) నుండునదియు, ఆముదపు కాడవలె నిస్సారముగా నుండునదియు, కాకికూతవలెను, మాల కాకికూతనలెను నుండునదియు, మంద్ర, మధ్య, తారస్థాయులలో పలికినను మాధుర్యము లేనిదియు- అతిప్రయాసముచేత- మంద్ర తారములయందు వ్యాపించునదియు, కృశించునదియు, గాడిదకూతను, ఒంటెకూతను బోలిన ధ్వని ననుసరించునదియునగు నాదము- దోషయుక్తమని సంగీత సుధయందు దెలుపబడియెను. ఆలాపము- అలప్తి అని చెప్పఁబడును. అనఘ కంఠాలప్తి అనఁగా మీది దోషములు లేనిది.

"రాగ స్వతస్స్యాల పనంకిలాహలుః అలప్తి కాంగీతకలా ప్రవీణాః" ఆలప్తి సౌభాగ్యముల్- అనఁగా ఆలాపనమునందలి విస్తరింపు సొంపులు- అలప్తి అనఁగా ఆలాపము. ఆలాపమునగా ఆక్షిప్తిక. ఆయత్తము- ఎత్తుబడి రాగవర్ధని (ఎడుపు) విదారి=ముక్తాయి. చీల్చుకొని వచ్చుట, అను ప్రకారములతో, రాగమునందలి స్వరములను, రాగస్వరూపము స్పష్టపడునట్లు ఆయాస్థాయులయందు, ఆరోహణమునందు సంచారము నొనర్చి, తిరుగ అవరోహణమునందును అట్లే సంచారము నొనర్చుట. ఈసంచారమున వాది, సంవాది, అను వాది అను స్వరముల నుపయోగించి, సముచితముగ తానాదులను ప్రయోగించుచు, స్వరసంచారము నొనర్చునపుడు- ఒక స్వరము నుండి సంచారము నారంభించి, క్రిందికి దిగి, తిరుగనాస్వరమున కేవచ్చి ముగించుట=ఆరోహణస్థాయి అనఁబడును. మొదట- మధ్యమ షడ్జ స్థాయినందుకొని, దానికి పైనుండు స్వరముల జోలికిపోక, క్రిందికిదిగి మంద్ర స్వరములందును- మంద్రషడ్జమునందును రెండుసార్లు సంచారముచేసి, మధ్య షడ్జమునకు వచ్చి నిలుచుట = ఆరోహణ స్థాయి యొక్క- ఆలాపనమగును. ఇట్లే మధ్యస్థాయి యందలి ఋషభమును

స్థాయిగాఁ జేసికొని, దానిపైనున్న స్వరముల నంటక, మంద్రి ఋష భము వఱకును రెండుసార్లు సంచారము నొనర్చి, మధ్య ఋషభమున 'న్యాసము' (నిలుపుట) నొనర్చి, క్రమముగా నిట్లే గాంధార, మధ్యమ, పంచమ, దైవత, నిషాద, తారషడ్జములను స్థాయులుఁగా గొని, రెం డేసి సంచారముల నొనర్చుట- ఆరోహణస్థాయి సంచారమగును. ఇట్లే అవరోహణమునందును సంచార మొనర్చుట=అవరోహణస్థాయి సంచారమగును. ఈసంచారమే- 'రాగాలప్తి' అని చెప్పఁబడును. ఈ మహాకవి "ఆలప్తిసౌభాగ్యముల్" అనుచో నీవిషయమునే స్ఫుటీక రించెను. కాని వ్యాఖ్యాత లీవిషయములను విశదీకరింపరయిరి. గిరికా దేవి రాగాలాపము నొనర్చుచు, తదనుగుణముగా దశవిధములగు గమకముల నుపయోగించుచు వీణ వాయించుట యెట్లున్నదనఁగా, తన రాగాలాపము నందలి సొంపులను, అంగుళీ సంజ్ఞలచేత వీణకు స్పష్టముగా బోధించుచున్నట్లున్నదనియుత్ప్రేక్షింపఁబడెను. స్ఫురితాది గమకములను వాయించునప్పుడది:- పాటయందలి సంగతులను బోధిం నట్లే యుండునుగదా!

గిరికా సౌందర్యపరముగను, సంగీత ప్రబంధపరముగను అర్థ శ్లేషముగల పద్యరత్నము నీమహాకవి రచించి, తన సంగీతకళా విజ్ఞా నము నెట్లు ప్రదర్శించెనో చూడుఁడు!

పద మెత్తఁగ- గలహంసలీల, అధర స్పందంబు సేయన్-శుభా
స్పదమౌ రాగకదంబకంబు, శ్రుతిచూపన్- శ్రీవిలాసంబు, కేల్
గదలింపన్- సుకుమార పల్లవ నవైలాలక్ష్మి, వీక్షింప-మ
ట్పదియున్, దోఁచుఁ, దరంబె కన్నెఁగొని యాడన్ గేయవాన్
(ప్రౌఢిమన్! తృతీయ-59)

ఈ పద్యమున రామరాజభూషణుఁడు శాస్త్రీయ సంగీత పారిభాషిక పదములగు కలహంసము- రాగ కదంబకము- అను 'ఆలిక్రిమస్థిత

ప్రబంధములను, (శ్రీ) విలాసము' అను 'విప్రకీర్ణ 'ప్రబంధమును' సుకుమారమును పదప్రాణముతోఁ గూడిన పల్లవమును, (ధ్రువముచు)గల 'ఏల'యను శుద్ధసూడ ప్రబంధమును, 'షట్పది'అను విప్రకీర్ణ ప్రబంధమును' పేర్కొనియుండ, వసుచరిత్ర వ్యాఖ్యాతలు పెక్కురు వానినీ పద్యార్థమున సమన్వయింపక, కేవల పదార్థ మాత్రమును దెలిపి యున్నారు.

రామరాజ భూషణుని కాలమునందే రామరాయని ఆస్థానమున, అమాత్యుఁడుగానుండిన రామామాత్యుఁడు తన 'స్వరమేల కళానిధి' అను సంగీత శాస్త్రగ్రంథమునందలి ఉపోద్ఘాత ప్రకరణమున నిట్లు తెలిపెను. ప్రసిద్ధములుగా నున్నదియు, తాను రచించినవియు నగు ఏలా, రాగకదంబక, (శ్రీ)రంగ షట్పదీ, (శ్రీ)విలాసాది ప్రబంధములను, శ్రావక కంఠనాదముగల వైణికులు మహారాజసభయందు పాడఁగా, సంగీత సాహిత్య కళా విశేష శేషావతారులగు పండితులతో గూడిన యామహాసభయందు (శ్రీ)రామరాయలు సోదరుఁడగు వేంకటాద్రి రాయలతో నాసీనుఁడయి కర్ణాభరణములగు ఆప్రబంధముల నాలకించి, ఆనందించి "సంగీత శాస్త్రమునందలి విరోధములను తొలఁగించునదియగు నొక సంగీత గ్రంథమును రచింపవలసినదని తన్నుఁ గోరుచు సమ్మానించెను." తాను రచించిన సంగీత ప్రబంధములను (శ్రీ)రామామాత్యుఁడిట్లు పేర్కొనెను.

శ్లో॥ సైలా, రాగ కదంబ, మాతృక,ల సద్గద్య ప్రబంధాదిమ
ద్వాత్రింశద్ పరసూడకా, నధిగత (శ్రీ)పంచతాళేశ్వరాన్
శ్రీ రఙ్గ ద్విపద, స్వరాఙ్క సహితాన్। స 'శ్రీవిలాసా'దికాన్
త్రింశద్ భానురవి ప్రకీర్ణక మహాసఙ్ఘ ప్రబంధాదిమాన్॥

శ్లో॥ చేతో రఞ్జన షోడశ ధ్రువముఖానేకార్థ గమ్భీర షట్
చత్వారింశ దుదార సాలగమహాసూడ ప్రబన్ధాన్వితాః

అన్యాన్ వింశతిరాగ విశ్రుత తమ శ్రీపంచరత్న స్ఫురద్
గీతాలంకృత సాక్షరాల పనపర్యాయైరుపేతానపి॥
(స్వరమేళ కళానిధి- ఉపోద్ఘాత ప్రకరణమున 20, 21 శ్లోకములు)

"గిరికాదేవి - పాదము నెత్తి నడువగనే, రాజహంస నడక యందలి యొయ్యారముతోఁచును" ఇత్యాదికము - సాహిత్యార్థము. "పదమెత్తన్ కలహంసలీల" అను నీపద్యమున కిపుడు సంగీతపరమగు నర్థము వివరింపఁగనగును. పదము + ఎత్తన్ = సంగీతప్రబంధమగు కలహంసమున కంగమగు రసభావాదులతోఁగూడిన (అర్థవాచక) 'మాతు' రూప పదమును, పలుకుట కారంభింపఁగానే, కలహంసలీల= కలహంసమను, (ఆలికప్రమగత) ప్రబంధము తోఁచునని సమన్వయము. అధరస్పందంబు సేయన్=పెదవి కదుపఁగానే, ప్రబంధగత రాగాంగ మగు స్వరముల నుచ్చరించుట కారంభింపఁగానే 'శుభాస్పదమా' = మంగళమున కాశ్రయమగు రాగకదంబకంబు = రాగకదంబమను ప్రబంధమును, శ్రుతిచూపన్ = స్వరమునకు అవయవమగు (కారణ మగు) శ్రుతిచూపఁగానే, శ్రీవిలాసంబు = శ్రీవిలాసమను ప్రబంధ మును, కేల్గదలింపన్ = రెండు పతాకాహస్తములు మణికట్టుల యొద్ద స్వస్తికాకారముగ నున్నచో అవి - పల్లవహస్తము లనఁబడును. (నాట్యశాస్త్రము) పల్లవహస్తమున ప్రబంధాంగమగు బిరుదము నభినయించుటకు చేయికదలింపఁగానే,సుకుమారపల్లవ నవైలాలక్ష్మి= సుకుమారమను పద పాఠముగల ధ్రువరూపమగు పల్లవముతో (పల్లవితో) గూడిన ఏలా ప్రబంధసంపదయు, వీక్షింపన్ = ప్రబంధ మునకు నేత్రరూపమగు తేన్నకము అనునంగము నుపయోగింపఁగానే షడ్పదియున్ = 'షట్పది' అను సంగీతప్రబంధమును, తోఁచున్ = స్ఫురించు చుండును. కావున గానము చేయఁదగిన ప్రబంధావయవము లగు ఉద్గ్రాహాది ధాతువుల యొక్కయు, వాగ్రూపమగు పదాది

ప్రబంధాంగముల యొక్కయు, నైపుణ్యమునందు, కన్నెన్ = కన్య యగు గిరికాదేవిని, కొనియాడన్ = పొగడుటకు, తరంబె = శక్యమా? శక్యముకాదని యర్థము. ఈపద్యమునందలి సంగీతపరమగు నర్థము నెఱుగుటకు ముందు ప్రబంధ సాధారణ లక్షణములు దెలిపి కలహంస రాగకదంబకాది ప్రబంధముల విశేషలక్షణముల నెఱుఁగవలసియున్నది. కనుక 'సంగీత రత్నాకరాది' శాస్త్రముల యందు ప్రవచింపఁబడిన సాధారణ విశేషలక్షణములను—ఇచట సంగ్రహముగాఁ దెలుపుదును.

ఆంధ్రభాషయందు మనుచరిత్రము, వసు చరిత్రము, మున్నగునవి ప్రబంధములని చెప్పఁబడును. సంగీతప్రబంధములు వీనికంటె భిన్నములై యున్నవి. సంగీతశాస్త్రము ననుసరించి — గానవిశేషముగల సాహిత్యము - ప్రబంధమని చెప్పఁబడును. 'చతుర్విధములగు ధాతువులతోను, షడ్విధములగు నంగములతోను, నిబంధింపఁబడిన రూపకము, 'ప్రబంధ' మని చెప్పఁబడును. సంగీతము నందలి యీ ప్రబంధమునకు గేయ రూపమగు ధాతువు - అవయవ మని చెప్పఁబడును. ఈధాతువు - చతుర్విధము. "1. ఉద్గ్రాహము 2. మేళాపకము 3. ధ్రువము 4. ఆభోగము." అనునవి ధాతువు నకు (గేయమునకు) నామములు. ధాతువునకు - గేయమని పేరు కలదు. గేయమునందలి ప్రథమభాగము - ఉద్గ్రాహము, ద్వితీయ భాగము - మేళాపకము, తృతీయఖండము - ధ్రువము, చతుర్థ ఖండము - ఆభోగము. ప్రబంధమునకు అంగము లారు: 1. పదము, 2. తేన్నకము, ఇవి ప్రబంధపురుషునికి నేత్రములు. రసాదులతోఁ గూడిన అర్థమును దెలుపునది - పదము. "తేన" అనుదాని వికృతి తెన్నకము. ఇది మాంగళ్య సంపాదకము. 3. తాళము 4. స్వరము— ఇవి ప్రబంధపురుషునికి పాదములు. 5. పాఠము 6. బిరుదము - పాఠము అనునది - వాద్యములందు వచ్చు 'తధిగిణతోమ్' మున్నగు

నది. ఇది - హస్తాభిఘాత ప్రభవము కనుక ఒకహస్త మగుచున్నది. బిరుదము - హస్తాభినయముచేత తెలుపఁదగినది కనుక ఒక హస్త మగుచున్నది.

మీఁది - అంగములు 6 నుగలది - మేదినీజాతి ప్రబంధము.

5 గలది - ఆనందినీ జాతి ప్రబంధము.

4 గలది - దీపినీ జాతి ప్రబంధము.

3 గలది - పా (భా) వనీ జాతి ప్రబంధము.

2 గలది - తారావళీ జాతి ప్రబంధము.

షడంగయుక్తమగు శ్రుతియే - జాతి అసమతాంతరము.

ప్రబంధములు :- సూడక్రమ స్థితములు,
ఆలిక్రమ స్థితములు,
విప్రకీర్ణములు- అని త్రివిధములు (3.)

రామరాజభూషణుఁడు మీఁది పద్యమున పేర్కొనఁబడిన 'కలహంసము, రాగకదంబకము' అను సంగీత ప్రబంధములు - ఆలిక్రమస్థితములు. '(శ్రీ)విలాసము - షట్పది' - అనునది - విప్రకీర్ణ ప్రబంధములు, ఏల అనునది - శుద్ధ సూడ క్రమస్థితమగు ప్రబంధము. ఈప్రబంధములకు వస్తువు - రూపకము అను నామాంతరములున్నవి. కలహంసలక్షణము :- సంగీత రత్నాకరమునందలి 4 వ అధ్యాయ మగు ప్రబంధాధ్యాయమునందలి 242, 243 శ్లోకములయందు దీని లక్షణమున్నది. జగతీచ్ఛందమునుండి జనించిన హంసమనువృత్తమే- కలహంసమని యిచట పేర్కొనఁబడినది. "కలహంసవృత్తము చేత ప్రబంధింపఁబడినది - కలహంస ప్రబంధము" అని వెంకటమఖి చెప్పెను. దీనియందు | U | U | U U | | U | U ప్రతిపాదము నను 'జ. ర. భ. ర.' అనుగణములుండును. ఆది భరతుఁడు "ద్వితీయ సప్తమాన్త్యశ్చ" అను శ్లోకమున హంసమను వృత్తమును తెలిపెను.

కలహంసమున ప్రతిపాదాంతము నందును స్వరప్రయోగముండును. ఝంపాది తాళములచే గానము చేయఁబడును. చందము, తాళము. నియమితమగుట వలన నిది – నిర్యుక్తమని (నిబద్ధమని) చెప్ప బడును. స్వరము, పదము, తాళము అను ప్రబంధాంగములు మూడుండుట వలన నిది భావనీ జాతికి సంబంధించును. ఇది ఝంపాది తాళమున గానము చేయఁబడును. ఇది పద్యరూపమునను, గద్యరూపమున గూడ నుండును. గద్యరూపమగు ప్రబంధముకూడ, పద్యరూప ప్రబంధమునకు సమానమైన మాత్రలుకలిగియుండును. మొదటిది వర్ణ జమనియు, రెండవది మాత్రికమనియుఁ జెప్పఁబడును. గద్యరూపమగు కలహంసమున ప్రతిపాదమునందును మొదట స్వరములను ప్రయో గించి, పిదప పదములను ప్రయోగింపవలయును. దీనియందు మొదట ప్రథమార్థమున ఉద్గ్రాహమును, ఉత్తరార్థమున ధ్రువమును (పల్లవియు) ఉండును. పిదపనాభోగముండును. కావుననిది త్రిధాతు కము. ఇది– ఆలిక్రమమునందలి ప్రబంధము. నంద్యావర్తము, స్వస్తికము– అని రాగకదంబకము ద్వివిధము. నంద్యావర్తమున నాల్గువృత్తములును, నాలుగు తాళములును ఉండును. ప్రతిపాదమున కును రాగము మారుచుండును. అర్ధభాగమునకొక రాగము మారు చుండును. అర్థభాగమున కొకరాగముండినను నుండవచ్చును. వృత్త మునకొక రాగమైన నుండవలయును. ఏవృత్తమున కేతాళము సరి పడునో ఆతాళముండవలెను. స్వస్తికమను రాగకదంబమున వృత్త ములు. 8. తాళములు 8, రాగములు 8. ఉండవలెను. వృత్తములు 16, తాళములు 16, రాగములు 16 గలది– అబ్జపత్రమను రాగకదం బకము. దీని పేరే– అబ్జగర్భము. భ్రమరామ్రేడితమను రాగకదంబక మున 32 వృత్తములు, 32 తాళములు, 32 రాగములు ఉండును. ఇవి గద్యమునందుఁ గూడ నుండును. ఇది ద్విధాతుకము. మేదినీజాతిగలిగి యుండును. దీనియందు పద్యమందైనను, గద్యమందైనను, పూర్వార్ధ

మున ఉద్గ్రాహము- ఉత్తరార్ధము ధృవము ఉండును. ఉద్గ్రాహ, ధ్రువములు మాత్రమే ఉండుటచేతనిది ద్విధాతుకము. ధ్రువము- పల్లవివలె నుండును. ఉద్గ్రాహము- అనుపల్లవి వలెనుండును. ఇది రాగకదమ్బకమను మహాప్రబంధముగాఁ జెప్పఁబడుచున్నది. ఇందు- ఆభోగమను ధాతువు లేకున్నను- అంతిమవృత్తమున రాగయుక్తముగ గాతృనేతృ ప్రబంధ నామములను నిలువవలెను.

"స్వరాన్తః'(శ్రీ)విలాసః' స్యాత్తావైరాగైశ్చపఞ్చభిః"

1 ఇత్యాదిగా సంగీత రత్నాకరమున 4 వ అధ్యాయమునందలి 265 వ శ్లోకమున నున్నది. '(శ్రీ)విలాస' ప్రబంధ లక్షణము ఇది- విప్రకీర్ణ ప్రబంధము- సుప్రసిద్ధము. దీనియందు- స్వరము, తాళము, బిరుదము తేన్నకము, పదము, పాఠము అను ప్రబంధాంగములు 6 ను ఉండును. కనుక మేదినీ జాతికి సంబంధించును. (శ్రీ)రంగ ప్రబంధలక్షణములు కొన్ని దీనియందున్నవి. దీనియందు 5 తాళములు, 5 రాగములు ఉండును. పంచఖండములుండును. ప్రతి ఖండమునందును ఒక్కొక్క రాగమును, ఒక్కొక్క తాళమును ఉండును. ప్రతిరాగమునను స్వరప్రయోగముండును. ప్రతి ఖండిక చివరను పదములుండును. స్వరములు, మున్నగు నంగములుకూడ నుండవచ్చును. దీనియందు- ఉద్గ్రాహాది ధాతువులు, ప్రబంధనామము, ప్రభునామము, కవినామము- రాగకదంబకమునందు వలెనే యుండును. ఇది త్రిధాతుకము. ద్విధాతుకమని వెంకటమఖి చెప్పెను. సంగీతరత్నాకరమునందలి ప్రబంధాధ్యాయమునందుఁగల 265 వ శ్లోకమున (శ్రీ)విలాస ప్రబంధ లక్షణమును జూడనగును.

## ఏలా ప్రబంధ లక్షణము

ఏలలు- సూడ (గీత) క్రమస్థితములగు ప్రబంధములు, ఇవి- శుద్ధములు (శుద్ధసూడ ప్రబంధములని) అని చెప్పఁబడును. ఏలయందు

పదునాఱు పదము లుండును. దీనియందు ఉద్గ్రాహము అను అను పల్లవియు, ధ్రువము అను పల్లవియు, ఆభోగము అను చివరి చరణ మును ఉండును. ఇవి– గేయములని చెప్పఁబడు ధాతువులు. వీనిని స్వరరచనలని చెప్పవచ్చును. ఏలయందు– ఉద్గ్రాహము, ధ్రువము, ఆభోగము అను ధాతువులు (స్వరరచనలు) మూఁడుండును కనుకనిది– త్రిధాతుకమగు ప్రబంధమగుచున్నది.

ఉద్గ్రాహమని చెప్పఁబడు అను పల్లవియందు– మూఁడుపాదము లుండును. అందు ప్రథమ పాదమునందును, ద్వితీయ పాదమునందును గూడ మొదట రెండేసి ఖండములుండును. ఆఖండములు రెంటియందు ను ధాతువు (స్వరముల కూర్పు) ఒకే విధముననుండును. మాతువు అనఁగా సాహిత్యము– వేరుగానుండును. 1వ ఖండము, 2 వ ఖండము కూడ అనుప్రాసములతోఁ గూడి యుండును. ఈ రెండు ఖండములను ఒకటవ పదమని చెప్పుదురు. తరువాత గమకములతోఁ గూడినదియు, అక్షరములు లేనిదియునగు ఆలప్తి (ఆలాపమను ప్రయోగము) ఉండును. ఈ ప్రయోగము– ద్వితీయపదము (రెండవ పదము) పిమ్మట పల్లవములను పేరుగల 3 పదములుండును. ఇవి 3 వది, 4 వది, 5 వది యునగు పదములు. మీఁదఁ దెలుపఁబడిన 5 పదములు– ప్రథమ పాద మునందుండునట్లే ద్వితీయపాదముననుండును. కాఁగా, ప్రథమపాద మున 5 పదములు, ద్వితీయ పాదమున 5 పదములు, కలిసిన మొత్తము 10 పదములగుచున్నవి. తృతీయ పాదమున పల్లవములను పేరుగల పదములు 3 ను ఉండవు. రెండే పదములుండును. ప్రథమ, ద్వితీయ పాదములయందువలె అనుప్రాసముతోఁ గూడిన రెండుఖండ ములుగలదియగు ఒక పదమును, సంబోధనముతోఁగూడిన ఒక పద మును ఉండును. కాఁగా ద్వితీయపాదమున 2 పదములే యుండును.

మొత్తము– ఉద్గ్రాహము అను స్వరరచనయందలి 3 పాదము లలోను 12 పదములుండును. ధ్రువమని చెప్పబడు పల్లవియందు–

యూంఁ జేపదములుండును. ఆభోగము (చరణము) నందు ఒకే పదముం డును. ఇచట 'పదము' అని చెప్పఁబడినది- వాచకములగు పదముల సముదాయముగాని, ఒకే పదముకాదు' అని తెలియవలయును. మొత్తము పదసముదాయ రూపములగు పదములు 16- ఏలయం దుండును. ఈపదములు- పదునారింటికిని, పదునారు పేళ్లుగలవు. ఈపద ములకు జీవనహేతువులగు ప్రాణములు- పదియున్నవి. అందు 'వాసవ' మనునది 13 వ పదమునకు నామమై యున్నది. 'సుకుమార' మనునది యొకపద ప్రాణనామమై యున్నది. సుకుమారమను ప్రాణము- వర్ణము నందును, ధ్వనియందును, మూర్ఛనయందును కోమలముగా నుండు నదియగు ప్రాణము. వాసవమను పేరుగల 13 వ పదము ధ్రువ ఖండ మునందలి పల్లవియందలి ద్వితీయ పదముగుచున్నది. ఆపదమున- ఈ సుకుమార మను ప్రాణముండవలెను. అట్లుండిన యెడల- ధ్రువము- (పల్లవి) సుకుమారముగా నుండును. అది సుకుమార పల్లవమగును. 'సుకుమార పల్లవ నవైలాలక్ష్మి' అని భూమణకవి, యీ విషయము నే తెల్పెను. పల్లవికి- పల్లవమునకు భేదము గలదు. పల్లవి, పల్లవము సమా ర్థకములు. ఈమూఁడు పదములుగల (ధ్రువమునందే) ఏ పదమునందైన నను స్తుతింపఁదగిన దేవత నామమునో, ప్రభునామమునో- నివేశింప వలయును. ఆ భోగము (చివరి చరణము)నందు వాగ్గేయకార (బయ కార) నామాంకితమగు పదముండవలయును. ఈపదునారు పదములను రెండుసార్లు గానముచేసి చివరను ధ్రువమును (పల్లవిని) గానముచేసి, న్యాసము (ముగింపు) నొనర్పవలెను. ఏలలు- గణ, మాత్రా, వర్ణ, దేశ భేదముల వలన చతుర్విధములై, అవితిరుగ అవాంతర భేదము లతోఁ గూడి 356 భేదములు గలిగి యున్నవి. సంకీర్ణ భేదములు- అనంతములుగా నున్నవి.

'షడ్వం చాశన్న్యక్తం ప్రోక్తమిత్యే లానాంశతత్రయమ్'

అని సంగీత రత్నాకరమునందలి ప్రబంధా ధ్యాయము నందలి 132 వ శ్లోకమునఁ జెప్పబడెను. సంగీత రత్నాకరము నందలి ప్రబంధాధ్యాయమునందలి 66 వ శ్లోకము మొదలు 133 వ శ్లోకము వఱకును ఏలలు తెలుపఁబడినవి.

ఏలలు- త్రిధాతుకములు; మతాంతరమున చతుర్ధాతుకములు నగుచుండును. ఇది- ఏలాసాధారణ లక్షణము. నాదావళి, హంసావతి, నందిని, చిత్రిణి, రతిలేఖ, మాలతి, మనోరమ, లలిత, భోగవతి, ప్రభావతి, సుమన, కుముదిని, విద్యుల్లత, విపుల, విమల, నలిని, విశాల, సరల, తరల, స్వరలేఖిక మున్నగురమణీయ నామములుగల ఏలలనేకములున్నవి. వానికిఁగల విశేషలక్షణము లనేకములున్నవి. రేడియోయందు వినఁబడు లలిత సంగీతమునందలి గేయములు కొన్ని వీనిని బోలియుండును. సినీమాలయందలి కొన్ని గేయములు— వీనిని బోలియుండును. రామరాజభూషణుఁడు— "నవైలాలక్ష్మి" అను పదమున నీయేలలను పేర్కొని యుండెను, 'నవైల' అను పేరుగల ఏలకూడ నొకటి— అనంతములగు ఏలలలో నుండినచో నుండవచ్చును. అప్పుడీ మహాకవి దానినే పేర్కొని యుండెనని చెప్పవచ్చును. సంగీత రత్నాకరమున ప్రబంధాధ్యాయము నందలి—

'గుణాన్వితం— దోషహీనం— నవం రూపకముత్తమమ్॥

అను 361 శ్లోకమునుండి 365 వరకునుగల శ్లోకములయందు సూడాది ప్రబంధములయందు నవత్వమును గూర్చు నుపాయము తెలుపఁబడియెను. అదెట్లనిన- పూర్వులచేత నేర్పరుపఁబడిన రూపకమునందుఁగల రాగమునందుకంటె, క్రొత్తగా నొనర్పఁబడిన రూపకమునఁగల రాగము-స్థాయాంతరములచేత నవమగునట్లు చేయుట. అట్లే, మాతువును (సాహిత్యమును) గూడ ఛందోభేదము చేతను, ప్రతిపాద్యమగు వస్తుభేదము చేతను, శృంగారాది రసభేదము చేతను, అను ప్రాసోపమాద్యలంకారములచేతను, నూతనమగునట్లు చేయుట. పూర్వగీతగత

తాళముకంటె భిన్నమగు లయ గ్రహముగల తాళము నాశ్రయించుట చేత తాళము నవమగునట్లు చేయుట మున్నగు నవత్వమును గూర్చు నుపాయములు పెక్కులు- వివరింపఁబడినవి.

దీని ననుసరించియే యీ మహాకవి - పతాకాయుక్తమగు పల్లవాభినయముచేత చేయి కదలింపఁగానే,

"నవ + ఏలాలక్ష్మి" = నవైలాలక్ష్మి

"నూతనమగు ఏలా ప్రబంధశోభ" - తోచునని తెలిపెను. ఏలాసంపద - అనంతముగానున్నది. కనుక - ఏలా 'లక్ష్మి' అని వాకొనెను. షట్పది - సంగీత రత్నాకరాదుల యందుఁ జెప్పఁబడినది. (సంగీ. ప్రబంధ. 272. 73) దీనియందు - ఆరుపాదము లుండును. కనుక దీనికి 'షట్పది' అని పేరుకలిగెను. ఇది - విప్రకీర్ణ ప్రబంధముల యందున్నది. దీనియందలి మూడవ పాదమునందును, ఆరవపాదము నందును, మూడేసి గణములుండును. మూడేసి గణములు గలవి యగు 3, 6 పాదములలో రెండేసి మన్మథగణములు, (3 వ, చందమునఁ బుట్టిన మగణాదులు.) ఒక్కొక్క బాణగణము ఉండును. (నాలుగవ చందమునఁబుట్టిన విబాణ గణములు) మిగిలిన చరణముల యందలి వన్నియు మన్మథగణములే యగును.

స్థాయిస్వరమును - 'స రి గ' ఇత్యాది సంజ్ఞలతో నుచ్చరింపక, నాదరూపమున నుచ్చరించి, న్యాసము (ముగింపు) నొనర్పవలయును. ఇందు 3 పాదములలో ఉద్గ్రాహముండును (అనుపల్లవి). తరువాత ధ్రువముండును (పల్లవి). తదుపరి నాభోగము (చివర చరణము) ఉండును. కనుక నిది - మూడు ధాతువులు గలదిగా నున్నది. పదము, స్వరము - అను రెండంగములుండుట వలన నిది - తారావళీ జాతికి చెందినదియగు చున్నది. దీనియందు తాళము లేకున్నను గణ, భాషా, నియమమున్నది కనుక నిబద్ధము (నిర్యుక్తము) అని చెప్పఁబడును.

'పదమెత్తన్' అను మీఁది పద్యమున శ్లేషమూలమున, వివిధములగు ఈ సంగీత ప్రబంధములను సమన్వయించి—రామరాజభూషణ మహాకవి – తన 'ప్రబంధాంక' గృహనామమును సార్థకమునొనర్చెను. వీరి యింటిపేరు 'ప్రబంధాంకము' వాడుకగదా!

## లక్ష్మీ వివాహ గీతికలు

క్రిందిపద్యమున నీ మహాకవి పేర్కొన్న వివాహగీతికలుకూడ–సంగీతప్రబంధ విశేషములే యగుచున్నవి.

"అకుటిల, సౌమ్యమాన 'ని' 'లయ' స్ఫురణంబును, నాతిమాత్ర తా
రక పరివర్తనంబు, శుభరాగ మిళత్ పదపల్లవాంక ము
ద్రికయును బెంపుమీఱ, నిజదృష్టులఁబోలిన సింధుకన్యకా
ప్రకట వివాహగీతికలు పాడిరి పుణ్య పురంధ్రికామణుల్."
(పంచ 71 ప.)

దీనియందు పుణ్య స్త్రీరత్నములు – లక్ష్మీ (గిరికా) వివాహగీతికలు పాడినట్లు చెప్పఁబడినది. "ఆ వివాహగీతికలు – తమదృష్టుల వలె నున్నవి" అని నిజదృష్టులకును, వివాహగీతికలకును– అర్థ, శబ్ద, శ్లేషములచేత సామ్యము ప్రవచింపఁ బడినది. దృష్టిపరమగు నర్థము–మొదటిది.

ఆ పుణ్యస్త్రీమణుల దృష్టులు – కుటిలత లేక, సౌమ్యములయి, అభిమానమే – ఆలయముగాఁగలవి. వానికి సంబంధించిన కనీనికలు (దృష్టులకు హేతువులగు కంటి నల్ల గుడ్లు) ఒయ్యారుల కనీనికలవలె విశేషించి చలింపక, యించుక కదలికగలిగి యుండునది. ఆపుణ్యాంగనలు – లజ్జాకలితలు కనుక నిజ శీర్షములను వంచి, కెంజిగుళ్లవంటి తమపాదములయందే దృష్టులను ప్రసరించు చుండిరి. కనుక నవి – పదపల్లవాంక ముద్రిగలవి యగుచున్నవి. పుణ్యస్త్రీల దృష్టులవంటివిగాఁ జెప్పఁబడిన గీతికాపరమయిన యర్థము నిట్లెఱుఁగునది, "శుభ

వివాహగీతికలు (పుణ్యస్త్రీల దృష్టుల వలెనే) సరళములు, (తిన్ననివి) సౌమ్యములు (లలితములు) ప్రమాణగతి యుక్తము అగు నిషాదాంత్యములగు స్వరముల యొక్కయు (నిషాదస్వరము యొక్కయు) లయయొక్కయు, స్ఫురణముగలవియు, తారస్థాయియందు-ఎక్కువగా సంచరింపనివియు (ఉచ్చైస్స్వర సంచారము లేనివి), శుభప్రదములగు రాగవిశేషములతోఁ గూడినయు, శుభవాచక పదములును, దేవతాంక ముద్రికయుఁగలవి ప్రసిద్ధములైనవి."

మీఁదఁ దెల్పఁబడిన శుభవివాహ గీతికలు - అకుటిలములు (సరళములు, సౌమ్యములు (లలితములు), మాన నిలయములు (ప్రమాణగతి నాశ్రయించునది) అగు నిషాదము చివరిదిగాగల స్వరములు గలదిగాఁ జెప్పఁబడినది కనుక, అవి శుద్ధగీతి నాశ్రయించినవిగా నూహింపవలసి యున్నది. మీఁదిపద్యమునందలి విశేషములు-శుద్ధగీతి యందున్నవి.

> గీతయః పఞ్చ శుద్ధాచ "శుద్ధాస్స్యాదవక్రైర్లలితైః స్వరైః:"
> భిన్నా వక్రైః ... ...
>
> (సంగీతరత్నాకర రాగవివేకాధ్యాయమున 2, 3. శ్లో)

గీతులు - శుద్ధ భిన్నాదిజాతులచే పంచవిధము లగుచున్నవి. అందు శుద్ధగీతి - వక్రములు (కుటిలములు) కాని లలితములగు స్వరములతోఁగూడి యుండును. భిన్నగీతి-వక్రములగు స్వరములతోఁ గూడియుండును. కనుక వివాహగీతికలు - అకుటిలములు. లలితములు, సరియగు (సమమగు) ప్రమాణము గలవియునగు శుద్ధ గీతిస్వరములతోఁ గూడియుండునని యూహింప వలసియున్నది. ఇందు - నిషాదము చివరిదిగాఁగల స్వరములన్నియు - శుద్ధగీతి నాశ్రయించి యుండునని చెప్పఁదగి యున్నది.

శుద్ధగీతి స్వరముల నాశ్రయించి పాడఁదగిన వివాహగీతికలు-సంగీత ప్రబంధములలో ఏ ప్రబంధముచేత, ఏ శుద్ధ రాగములచేత పాడఁదగినవి అనువిషయము మీఁది పద్యమున వాచ్యముగాఁ జెప్పఁ బడుటలేదు. కాని స్ఫురింపఁజేయఁబడినది. కనుక, మహాకవి యభి ప్రాయము నిచట నూహింప వలసి యున్నది.

విప్రకీర్ణ ప్రబంధములలో, చివరిదియగు మంగళ ప్రబంధమున, ఆపుణ్యస్త్రీలు - వివాహగీతికలను పాడిరని చెప్పవలసి యుండును.

దీనియందు - ధ్రువము - అనఁగా పల్లవము ఉండును. ఉద్గ్రాహము (అనుపల్లవము) ఉండును. ఆభోగము (చివరిచరణము) నందు అంకముద్రికగా దేవతానామాదిక ముండును. ఈ సంగీత-ప్రబంధమును - శుద్ధ పంచమరాగమునకు సంబంధించిన భాషారాగ మగు కైశికీ రాగమునఁగాని, బోట్టరాగమునఁగాని గానము చేయ వలయును అని చెప్పబడినది.

మంగళాచార ప్రబంధలక్షణములతోఁ గూడిన మంగళప్రబంధ లక్షణము నిట్లుండుగునది.

మంగళవాచకములగు శంక, చక్రాది పదములతోఁ గూడి యుండును. లఘుద్రుతాదులగు నంగములతోఁ గూడిన తాళము-దీనికావశ్యకము కాదు. తాళాంతరాను వర్తియగు లయయే చెప్పఁబడి నది. బోట్టరాగము - ఉత్సవములందు పాడఁదగినది, సప్తస్వరములు నుగలది. దీనికి గ్రహము, అంశము - ష. న్యాసము, న. కాకలి-ముఖ్యముగా నుండును. పగటిలో నాలుగవ జాముస గానము చేయఁ బడును. గాంధార ప్రయోగ మల్పముగ నుండును. (సంగీతరత్నా. రాగవివేకాధ్యా 50, 51, 52 శ్లో.) తారస్థాయియందు మధ్యమ (మ) ము వఱకు మాత్రమే పాడఁదగినది, హాస్యశృంగారముల యందు వినియోగింపఁ బడును.

• ఈ బోట్టరాగమునుండి జనించిన 'మాంగలి' అను రాగమునం గూడ దీనిని పాడఁదగును. ఈమంగళ ప్రబంధమును - మంగళ నృత్తముచేతఁ గూడ గానము చేయవచ్చును.

> పఞ్చదకారగణాః ప్రతిపాద గతాశ్చేత్
> మఙ్గళమాహురిదం సుధియః ఖలువృత్తమ్.

మీఁదిశ్లోకము- మంగళవృత్తమునకు లక్షణమును, లక్ష్యమును గూడ నగుచున్నది. దీనియందుఁగూడ - పదాంతమునందుఁ గాని, అర్ధాంతమునందుఁగాని స్వరముల నుపయోగింపవచ్చును. ఇది- ఖావనీజాతికి చెంది, త్రిధాతుకమై యున్నది.

"అకుటిల సౌమ్యమాననిలయము, నాతిమాత్రితారక పరివర్తనము, శుభరాగ మిళత్పద, పల్లవాంక ముద్రిక" అని యీ కళానిధి యుద్దేశించిన ప్రబంధ మిదియే యగునని యూహింతును.

ఈ సంగీతకళా రహస్యనిధి- కథా సందర్భానుగుణముగ పేర్కొనిన (మేళ)రాగములు- సాహిత్యానుగుణ విస్ఫూర్తి గలిగియున్నవి. కథా సందర్భమును దెలిపి- పద్యము నుదాహరింతును.

యతి వేషధారియగు కేళీసచివుఁడు గిరికా సఖియగు మంజువాణితో "వసురాజు మీగిరికను పెండ్లియాడును. ఈ మాటను నీవు నమ్మనిచో నా మంత్రప్రభావమున వసురాజేంద్రుని రప్పింతును చూడు" అని మాయాజపమును నటించి, "మజ్ఝా" అని పలికెను. అప్పుడు-

> "ఇది సంధింపఁగ వేళయంచు వసురాజేంద్రుండు నీరంధ్ర నీ
> రదవార ప్రతిసీర వెల్వడిన తారాభర్తలీలన్, లతా
> చ్ఛద సంఛాదిక భాసి, నిల్చె నెదుటన్ సారంగరాగ భ్రమ
> న్మద భృంగీరుతి- వందిమాగధ కథా మాధుర్యమున్ దెల్పగన్"

"ఈ రమణీమణులను సమీపించుట కిదియే సమయమని 'మేఘ సమూహము' అను తెరనుండి వెలువడిన తారాభర్త (చంద్రుని)వలె

తీగె జొంపముల కప్పును తొలగించుకొని వెలువడి సారంగముల (మగ
తుమ్మెదల)యందలి అనురాగముచేత సంచరించుచు, మత్తుఁగొనియున్న
ఆడుతుమ్మెదల ఝుంకారధ్వని అను సారంగ మనెడు రాగమునందు-
ఆలాపరూపమగు సంచారము నొనర్చుచున్న మదించిన యాఁడుతుమ్మె
దల రుతి- (నాదము) వంది, మాగధులచే నొనర్పఁబడిన నిజచరిత్ర
మాధురిని దెలుపుచుండ వారి యెదుట నిలిచెను".

ఆ తుమ్మెదల ఝాంకార (ఝుమ్మను) నాదము- సారంగి రాగము
వలె నుండును. 'సారంగరాగము—సారంగరాగమే' అను సంగీత కళా
రహస్యమిందు ప్రదర్శితము.

ప్రస్తుత కాలమున సారంగరాగ లక్షణ మిట్లున్నది.
ఇది 65 వ మేళకర్తృరాగమగు మేచకల్యాణి జన్యము సంపూర్ణవక్రి
రాగము.

చ అం ప్రి చ కా ప్ర షు
దీని మూర్ఛన:- స రి గ మ ప ధ ని స. స ని ద ప మ రి గ మ రి స
ఈ రాగమునకు మంద్రస్థాయి నిషాదమునకు దిగువను, తారస్థాయి,
గాంధారమునకు మీఁదను సంచారము లేదు. కనుక తుమ్మెద పిండుల
ఝుమ్మను ధ్వనివలెనే యుండును.

సోమనాథుని రాగవిబోధమున సారంగరాగ మేళము- 23 వది.
(ఇది పురుషరాగము. దేశాక్షి, గౌళ, రీతిగౌళ దీనికి భార్యలు.)

అంశ, గ్రహ, న్యాసస్వరము— స.

అపరాహ్ణమునందు పాడఁదగినది. కనుకనే వసురాజు— అపరా
హ్ణామువందే- దీనిని వినినట్లు తెలుపఁబడెను.

రాగవిబోధమున దీని లక్షణ మిట్లున్నది.

సారఙ్గ రాగమేళే- తీవ్రతరరి, తీవ్రతమగ, మృదుపాశ్చ
తీవ్రతమధ, మృదుసా, శుచిసప మత ఏతన్మేళా రాగాః
(చతుర్థ వివేకమున 60 వ శ్లో॥)

"సారంగరాగమున (సారంగ మేళమున) 'తీవ్రతర రి' అనగా పంచశ్రుతి రి. దీనినిప్పుడు చతుశ్రుతి రి అందురు. తీవ్రతమ'గ' అనఁగా 13 వ శ్రుతియగు శుద్ధ మధ్యమ స్థానమున పలుకఁదగిన గాంధారము, మృదు'ప' అనఁగా ప్రతిమధ్యమము. ఇది 16 వ శ్రుతియందు పలుకఁ దగినది. తీవ్రతమధ అనఁగా ప్రస్తుత కాలమున 1 వ శ్రుతియందుగల కైశికీ నిషాదస్థానమునఁ బలుకఁబడుచున్న షట్ శృతి ధైవతము. "మృదుసా" అనఁగా మృదుషడ్జ స్థానమగు 3 వ శ్రుతియందు పలుకఁ బడు నిషాదము.

| | శు | చ | శుమ | ప్ర | శు | ష | మృదుషడ్జని. |
|---|---|---|---|---|---|---|---|
| ఆరోహణమున– | స, | రి, | గ, | మ, | ప, | ధ, | ని |
| అవరోహణము– | స | ని | ద | ప | మ | గ | రి స. |

దీనినుండి సారంగము మున్నగు జన్యరాగములు పుట్టెను."

ప్రస్తుత కాలమునకు కొంతకాలము ముందే- మృదుషడ్జము (దీనిని రామామాత్యుడు "చ్యుతషడ్జ నిషాదము" అని పేర్కొనెను) కాకలీ నిషాదముగాఁ జేయఁబడియున్నది. కాని రామరాజ భూషణుని కాలమున నీమృదుషడ్జము (మృదుషడ్జ నిషాదము) కాకలీ నిషాదము కంటె వేఱగు స్వరముగా నుండెనని నిశ్చయింప వీలగుచున్నది. అట్లే మృదుమధ్యమ గాంధారము - అంతరగాంధారము కంటె వేఱుగా నుండెడిది.

మీఁదిశ్లోకమున, తీవ్రతరరి – పంచశ్రుతిరిషభము. తీవ్రతమగ– అంతరగాంధారము కంటెను, మృదుమధ్యమ (మృదుమధ్యమగాంధార) ము కంటెను వేరయి, (13 వ శ్రుతి యందు) యుండెడిది. మృదు పంచమమనఁగా నిచట ప్రతిమధ్యమము. 'తీవ్రతమధ' అనఁగా పంచ శ్రుతి ధైవతము కంటె మీఁది శ్రుతియందున్నది. 'మృదుస' అనఁగా, మృదుషడ్జ నిషాదము. అన్యస్వరమగు శుద్ధ మధ్యమము. దీనియందు లేదు.

దీనివలన ప్రస్తుతకాలమున పాడఁబడుచున్న సారంగ రాగము కంటె, రామరాజభూషణుని కాలమున పాడఁబడిన సారంగ మేళ రాగము - ఇంచుక భేదించి యుండునని యేర్పడు చున్నది.

ఈ విధమున నే కాంభోజీమేళ రాగమును గూడ - ఈమహాకవి- కథాసూత్రమునందు నిబంధింపఁబడిన సాహిత్య భావమును నిబంధిం చెను. చూడుఁడు!

గిరికాదేవి - కుటిలుఁడగు మలయపవనుని యందు కోపగించి, విరహతాపమును సైపలేక, జలమునందు మునిఁగి ప్రాణత్యాగము నొనర్చుటకు సిద్ధపడెను.

ఆజలమేది? చంద్రికిరణములను సెలయేరు. చెలికత్తెలు, హాయనిపలికి అడ్డగించిరి. అప్పుడా రాజీవాననయగు గిరిక —

"ఆజాబిల్లి వెలుంగువెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున పటాగ్రంబొత్తి, యెల్గెత్తి, యా
రాజీవానన యేడ్చె, కిన్నరవధూ రాజత్ కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవసుధాపూరంబు తోరంబుగన్."

"ఆచంద్ర కిరణ ప్రవాహమును దరిసిపోఁజాలక, రాకాచంద్ర సదృశమగు మోమున పయ్యెద చెఱఁగును జేర్చి, ఎలుఁగెత్తి యేడ్చెను.

ఆయేడ్పు - కిన్నరస్త్రీల రమణీయపాణి కమలముల యందు న్నదియు, కాంభోజీ మేళముతోఁ గూడినదియునగు విపంచిక అను వీణావిశేషము యొక్క- నాదమనెడి అమృత ప్రవాహము వలె విస్తృతి నొంది యుండెను."

దీనియందు గ్లాని, నిర్వేదము, దైన్యము మున్నగు సంచారి భావములతోఁగూడిన రతిభావమునకు ఆటంకము కలుగుటవలన

నొదవిన తాత్కాలికమగు శోకభావము - ఏడుపు అను అనుభావము చేత స్ఫురింపఁజేయఁ బడుటవలన ఏతాదృశమాత్రమగు సందర్భమున నిందలి రసము - కరుణమగుచున్నది.

సంగీత రత్నాకరము ననుసరించి కాంభోజీరాగము - గ్రామ రాగమగు కకుభరాగమునకు సంబంధించిన భాషా రాగమగుచున్నది. కకుభరాగము - శరత్కాలమునందును, కరుణరసమునందును పాడ వలసినదిగా, 'సంగీతసుధ' అను సంగీతశాస్త్ర గ్రంథమున 115 వ శ్లోకమున జెప్పఁబడెను. కనుక దానికి సంబంధించిన కాంభోజీరాగము కూడ - చంద్రకిరణ తీవ్రతగల శరత్కాలమునందు కరుణరసమునే స్ఫురింపఁ జేయునది యగుచున్నది.

కాంభోజీ మేళమునందు— 11 వ శ్రుతి యందుండునదియగు 'గ' అను స్వరమును 2 వ శ్రుతియందుండునది యగు నిషాదమును, రామరాజభూషణుని కాలమున ప్రత్యేకములుగనుండి, గుర్తింపఁబడి, అంతరగాంధారమనియు, కాకలీనిషాదమనియుఁ జెప్పఁబడి యుండెడివి. శార్ఙ్గదేవుఁడు— 'గనీతుకరుణే' 'కరుణరసమును, గాంధారనిషాదములు— స్ఫురింపఁజేయును' అని చెప్పెను. (స్వరగతాధ్యాయము 60 వ శ్లో.) 11 వ శ్రుతి (ప్రసారిణి) యందుండు 'గ' యు, 2వ శ్రుతి (కుముద్వతి) యందుండు కాకలీనిషాదమును ఆయతజాతి యందుండునవి కనుక ఆయతస్వరము గలిగియుండును. విస్తృతిగల్గి యుండును. మఱియు విపంచిక— సామాన్య వీణకాదు. దీనియందలి నాదమునకు విరామ ముండదు. కనుకనే, మీఁదిపద్యమున పేర్కొనఁబడిన విపంచికారవ వసుధాపూరము— సామాన్య వీణారవము నతిశయించి యుండును. తెంపులేని ధ్వనిగలిగి యుండును. ఈవిషయములను వ్యంజింపఁజేయు టకే యీకళారహస్యనిధి—

'విపంచికారవ వసుధాపూరంబు తోరంబుగన్' అనియు పటాగ్రం బొత్తి, మొగ్గెత్తి- ఆరాజీవానన యేడ్చెన్' అనియు వ్రాసెను.

శోకభావమున కనుభావమగు రోదనధ్వని యందలి విస్తారతయు, రంజకత్వమును, మీఁది వాక్యముచేత స్ఫురింపఁ జేయఁబడెను.

ఇచ్చట ముఖ్యముగా గుర్తింపఁదగిన సంగీత విషయము- కాంభోజీ రాగమేళమునకు సంబంధించినది. ప్రస్తుతకాలమున పాడఁబడుచున్న హరి కాంభోజీ మేళము- దీనిని కొంతవఱకు (సుమారుగా) పోలియుండును. అట్లే దీనియందు జనించినదగా, రామామాత్య, సోమనాథులు చెప్పిన కాంభోజీరాగమును గూడ- ప్రస్తుతకాలమున పాడఁబడుచున్న కాంభోజీరాగమును కొంతవఱకు పోలియుండును' కాని. అవియు, నివియు నొకే తీరున పాడఁబడుట లేదని చెప్పవలసి యుండును. మేళరాగమగు కాంభోజీరాగ లక్షణమిట్లు తెలుపఁబడినది. ఈ లక్షణము- రామరాజభూషణుని కాలమునాటిది.

గనీ చాన్తరకాకళ్యౌ రిధౌ పఞ్చ శ్రుతీ తథా
శేషాః శుద్ధాస్తు సమపాశ్చైతైః కామ్భోజిమేళకః। కామ్భోజి
ప్రముఖా రాగా మేళేఽస్మిన్.
(రామామాత్యుని స్వరమేళకళానిధి. మేళప్రకరణము. 61 శ్లో.)

దీనియందు పేర్కొనఁబడిన, అంతర గాంధార, కాకలీనిషాదములిప్పుడు గుర్తింపబడుటలేదు. రామామాత్యుడు పేర్కొనిన చ్యుత మధ్యమ గాంధారము 12 వ శ్రుతియందున్నది. అతఁడు పేర్కొనిన చ్యుతషడ్జనిషాదము 21 వ శ్రుతియందున్నది. ప్రస్తుత కాలమున చ్యుతమధ్యమ గాంధారము- అంతర గాంధారము గాను, చ్యుతషడ్జ నిషాదము- కాకలీనిషాదముగాను చెప్పఁబడుచున్నవి. ఈమార్పు- సంగీత సుధయందును, చతుర్దండి ప్రకాశికయందును గూడనున్నవి. ప్రస్తుతకాలమున పాడఁబడుచున్న కాంభోజీరాగమేళ మూర్ఛన యిట్లున్నది. ఇదియే హరికాంభోజి అని చెప్పఁబడును.

చ అం ష చ కై
స రి గ మ ప ద ని. స. స ని ద ప మ గ రి స.

రామామాత్యుఁడు. 'కాంభోజి' అనియే దీనిని పేర్కొనెను. కాని సోమనాథుఁడు దీనినే 'కాంభోది' అని పేర్కొనెను. శార్ఙ్గదేవుఁడు- దీనిని 'కాంభోజి' అనియే పేర్కొనెను. సోమనాథునితరువాతివాఁడగు రఘునాథ భూపాలుఁడుఁ లేక గోవింద దీక్షితుఁడు- (వేంకటమఖితండ్రి) సంగీత సుధయందు దీనిని 'కాంభోది' అని వ్యవహరించెను. కాని గోవింద దీక్షితుని కుమారుఁడగు వెంకటమఖి (చతుర్దండి ప్రకాశిక యందు) దీనిని సంస్కరించెనేమో, తిరుగ కాంభోజి అనియే పేర్కొనెను. రామభూషణుని కాలముననిది- 'కాంభోజి' అనియే వ్యవహరింపఁబడెను. లేని యెడల ఈమహాకవి ప్రాసమును మార్చియే యుండును. శార్ఙ్గదేవుఁడు- కాంభోజిని మేళముగాఁ జెప్పక భాషా రాగముగాఁ జెప్పెను.

'కామ్భోజీ కకుభస్యాస్యాద్ భాషాధాంశ గ్రహాన్తిమా।
సధ సంవాదినీ పూర్ణా రిపసంవాదినీ తథా॥

కాంభోజి- కకుభరాగమునకు సంబంధించిన భాషారాగము. కకుభ రాగమునకు వలె దీనికిని- అంశ, గ్రహ, న్యాసములు- ధైవతమే యగుచుండును. ఇది- పూర్ణము. దీనియందు స, ధలు, రి, పలు సంవాదిస్వరములు. శార్ఙ్గదేవుఁడు- 'ఆరోహమునందు దీనికి నిషాదము వర్జ్యము' అని చెప్పలేదు.

దీనియందు ప్రస్తుతకాలమున 'సనికాపదస' అను ప్రయోగమున, అన్యమగు కాకలీస్వర ప్రయోగముండుటచేత- భాషాంగరాగముగాఁ జెప్పబడుచున్నది. 'గనీచాన్తరకాకల్యౌ' అను లక్షణమునఁ దెలుపఁబడిన రామామాత్యుని కాంభోజీ మేళమూర్ఛన యిట్లున్నది.

ష పం అం ష ష పం కా ష.
స రి గ మ ప ధ ని స స. స ని ద ప మ గ రి స.

దీనియందు పేర్కొనఁబడిన అంతర గాంధారము- 11 వ శ్రుతి యందున్నది. ప్రస్తుతకాలమున పాడఁబడుచున్న అంతర గాంధారము- (చ్యుతమధ్యమము- లేక చ్యుత మధ్యమ గాంధారము) 12 వ శ్రుతి యందున్నది. అట్లే మీఁది లక్షణమున పేర్కొనిన కాకలీ నిషాదము 2 వ శ్రుతి యందుండినది. ప్రస్తుతకాలమున పాడఁబడుచున్న కాకలీ నిషాదము- (చ్యుతషడ్జము, లేక చ్యుతషడ్జనిషాదము) 12 వ శ్రుతి యందున్నది.

వేంకటమఖి- (చతుర్దండి ప్రకాశికయందు) కాంభోజీమేళ లక్షణము నిట్లు తెలిపెను.

> షడ్జోఽథ పంచశ్రుతి కో ఋషభో న్తర సంజ్ఞకః
> గాన్ధారశ్చ మహా శుద్ధౌ, పఞ్చ శ్రుతికధైవతః
> కైశిక్యాఖ్యనిషాదశ్చ కామ్భోజీ మేళకే స్వరాః॥
> ... ... ... ... ...

1 షడ్జము 2 పంచశ్రుతిక రిషభము, (దీనినిప్పుడు చతుశ్శ్రుతి రిషభ మనుచున్నారు) 3 అంతరగాంధారము (ఇది- 12 వ శ్రుతియందున్న చ్యుత మధ్యమము) 4 శుద్ధమధ్యమము 5 శుద్ధపంచమము 6 పంచ శ్రుతిక ధైవతము (దీనినిప్పుడు చతుశ్శ్రుతి ధైవతమని చెప్పుచున్నారు.) 7 కైశికీనిషాదము (ఇది 1 వ శ్రుతి యందున్న స్వరము)

మీఁది లక్షణములను సమీక్షించిన విజ్ఞులకు - రామరాజ భూషణుని కాలముననున్న రామామాత్యుని కాంభోజీ లక్షణము నకును, తదుపరి నూరు సంవత్సరములు వెనుకనున్న వెంకటమఖి చెప్పిన కాంభోజీ లక్షణమునకును గల భేదము స్పష్టపడక పోదు. లక్షణభేదము వలన లక్ష్యము (ప్రయోగము) నందును భేదమున్న దనుట - స్పష్టము. వేంకటమఖి - 11 వ శ్రుతియందుఁగల అంతర గాంధారమును, 12 వ శ్రుతియందు చేర్చుటచేతను, అట్లే 2 వ శ్రుతి

యందుఁగల కాకలీ నిషాదమును, 1 వ శ్రుతియందు (కైశికీ నిషాదము నందు) దించుట చేతను ఈభేదము - ఏర్పడినదని తోఁచుచున్నది. వేంకటమఖి తండ్రియగు గోవింద దీక్షితుని లక్షణముకూడ, నిట్లే యున్నది. కనుక వేంకటమఖి తన తండ్రిననుసరించి యిట్లు చెప్పెనని చెప్పవలసి యుండును.

రామామాత్యుని మేళములలోఁ గొన్నింటిని వేంకటమఖి ఖండించెను. అందు కాంభోజీమేళము నిట్లు ఖండించెను.

"ఓ రామామాత్యా! కాంభోజీమేళమున గాంధారము—అంతరము. నిషాదము - కాకలి, ఋషభధైవతములు - పంచశ్రుతికములు మిగిలిన స, మ, ప లు - శుద్ధములని చెప్పితివిగదా!

ఇది - నిన్ను గీతజ్ఞులనుండి బహిష్కరించుటకు సాధనముగా నున్నదిసుమా!. కాంభోజీమేళము నందలి నిషాదము - కైశికిగాని, కాకలికాదు" అను విషయము - వీణవాయించు వారి గృహదాసికిఁ గూడ తెలియునే!

కనుక, ఓ వైణికులారా! బయకారుఁడనని (వాగ్గేయకారుఁడనని) చెప్పుకొన్న రామామాత్యుని మేళములను నమ్ముకొని అరణ్యకూపమున (అడవి నూతియందు) పడకండి!

ఇదిగో! నేనుభుజము నెత్తి ఉద్ఘోషించుచున్నాను"

ఇందు - వ్యక్తి దూషణము కూడ నున్నది. ఈవిషయమును సమగ్రముగాఁ జూడఁగోరిన వారు - చతుర్దండి ప్రకాశికయందలి రాగ ప్రకరణమునఁగల 176 వ శ్లోకమునుండి 209 వ శ్లోకము వఱకునుగల గ్రంథభాగమును జూడనగును. రామామాత్యుని కించుక వెనుకను, వేంకటమఖికి పూర్వకాలము నందును నున్న సోమనాథుఁడు కూడ - తన రాగవిబోధము నందలి తృతీయ వివేకమునఁగల 51 వ శ్లోకమున, రామామాత్యుడు చెప్పినట్లే, కాంభోజీమేళ లక్షణమును దెలిపెను. చూడుఁడు!

కామ్భోదీ మేళేతు తీవ్రతరరి రన్తరక, తీవ్రతరధౌచ।
కాకలికా శుచి సమపా, ఉతశ్చకామ్భోది, దేవక్రీ।
(తృ. 51 శ్లో.)

"కామ్భోదీ (జీ) మేళమున తీవ్రతరరి పంచశ్రుతి రిషభము అన్తరగాంధారము – (11 వ శ్రుతి నాశ్రయించిన అంతరగాంధారము) తీవ్రతరధ – పంచశ్రుతికమగు ధైవతము. కాకలీనిషాదము - 2 వ శ్రుతి యందుండు కాకలీ నిషాదము ఉండును. దీనినుండి కాంభోజీరాగము, దేవక్రీరాగము పుట్టినవి."

ఈ కాంభోజీమేళము నుండి పుట్టిన కాంభోదీ రాగ లక్షణము నిట్లు చెప్పెను.

"పూర్ణా, సాది, రనిర్వా కామ్భోద్యంశాన్త సాచసాయహే॥"
(చతుర్దవివేకము 34 శ్లో)

"కాంభోదీరాగము – పూర్ణము. దీనిని షడ్జముతో గ్రహింప వలెను. దీనియందు నిషాదమును విడిచిన విడువవచ్చును. అంశ, న్యాస ములు – షడ్జము." (ఇది – జన్యరాగము)

ఈ సోమనాధుడు - వేంకటమఖి కంటె పూర్వుండై యున్నాడు. రామామాత్యుని కాంభోజీమేళ లక్షణమునే తు. చ. తప్పక యనుస రించి యున్నాడు. వేంకటమఖి – ఈ సోమనాథుని లక్షణము నేల ఖండింపలేదో తెలియదు.

రామనృపభూషణుడు – అజాబిల్లి పద్యమునందు పేర్కొనిన కాంభోజి – మేళ రాగమేగాని, కేవలరాగము కాదు. అది–సంపూర్ణ సంపూర్ణము. అది – ప్రస్తుతకాలమున పాడబడుచున్న భాషాంగ రాగమగు కాంభోజీ రాగము కాదు. వేంకటమఖి పేర్కొనిన హరి కాంభోజీరాగము – ప్రస్తుతకాలమున మేళముగానున్నది. వేంకటమఖి తండ్రి – దీనిని కాంభోది అని వ్యవహరించెను. ఇదికూడ – కైశికీ

నిషాదము గలిగి యుండుటచేతను, 3 వ శ్రుతియందున్న చ్యుతమధ్యమ గాంధారమును – అంతరగాంధారముగాఁ గలిగి యుండుట చేతను, రామరాజభూషణుఁడు పేర్కొనిన కాంభోజీ మేళముకాదు. మహాకవి పేర్కొన్న మేళరాగ మిప్పుడు వాడుకలో లేదు'' అని పాఠకులు గుర్తింపవలసి యుండును. ఈ సంగీతరహస్యనిధి పేర్కొన్న అంతర గాంధార, కాకలీనిషాదములను – నేటి సంగీత విద్వాంసు లభ్యసించుట లేదు. నేటికాలమున పాడఁబడుచున్న అంతరగాంధారము కంటె దిగువనుగల అంతర గాంధారమును, అట్లే నేటికాలమున పాడఁబడు కైశికీ నిషాదముకంటె మీఁది శ్రుతియందుఁగల కాకలీ నిషాదమును– ఆనాఁడు – కాంభోజీమేళమున గానము చేయఁబడెడివి అని గుర్తింపఁ దగియున్నది.

క్రింది పద్యమున వీణావాద్య నైపుణ్యమును, తత్పాండితీ సౌందర్యముచేత సముద్దీపితమగు గిరికా సౌందర్యమును మనోజ్ఞముగ వర్ణింపఁబడినది. చూడుఁడు!

వలుదగుబ్బలు– ప్రసేవకవృత్తిఁదగు గుబ్బకాయల కపరంజి చాయలో సఁగ।

లలితాంగుళీ దళంబులు సమేళములైన సారెలపై రాగసంపదలిడ।
పాణికంకణఝుతుల్ ప్రాణానుబంధంబుగల తాళగతి కనుగ్రహములీన
ఆలాపభంగి అత్యక్త సంవాది సమస్వరంబులకు గ్రామంబులునుప
ప్రచురతానామృతముల మూర్ఛనలచే నచేతనంబులు చేతనరీతిఁదనర
చేతనంబు లచేత నరీతినొనర। వీణవాయించు నొకయలివేణిఁగంటి॥

మహాకవియగు అల్లసాని పెద్దనామాత్యుఁడు, తన మనుచరిత్రమున, వీణావాద్య వర్ణనపరమగు సీసపద్యము నొకదానిని అల్లిక జిగిబిగితో రచించెను.

అందు సంగీత శాస్త్రీయ విషయములను సూత్రీకరించెను. సౌందర్యలావణ్య విభాసితయు, రతిపారవశ్యాది శృంగార భావప్రపూర్ణ

విలాసవతియునగు వరూథినీ స్వరూపమును ప్రవరునికేని, పాఠకులకును సాక్షాత్కరింపఁజేసెను. ఆపెద్దనామాత్యుని శిష్యుఁడగు భట్టుమూర్తి యొక్క రూపాంతరమగు రామరాజ భూషణ మహాకవి- రమణీయము, శ్లేషగర్భితమునగు రచనతోఁ, గురూక్తములగు సంగీతశాస్త్రీయ విషయ సూత్రములకు సమగ్రమగు భాష్యము నాసీసపద్యమునందే రచించి, అద్భుతమగు వీణావాద్య సంగీత శాస్త్రీయ పాండితీప్రతిభను వెలార్చుచు, తన్మూలమున వ్యంజితమగు సౌందర్య కారుణ్యాదాత్మృత్వ సంపూర్ణయగు గిరికా స్వరూపమును, కేళీసచిన, వసురాజులతోఁ బాటు పాఠకులకు సాక్షాత్కరింపఁ జేసెను.

గురు, శిష్యుల రచనయందలి సామాన్య విశేషార్థములను సమన్వయించుటకు ముందు, గురువగు పెద్దనామాత్యుని మనుచరిత్రమునందలి వీణావాద్య వర్ణనపరమగు పద్యము నుదాహరింతును.

సీ॥ తతనితంబాభోగ ధవళాంశుకములోని అంగదట్టపు కావిరంగు వలన
శశికాంతమణి పీఠిజాజువారగ, కాయలుత్తుంగ కుచపాళినత్తమిల్ల
తరుణాంగుళీ ధూతతంత్రీస్వనమ్ముతో జిలిబిలిపాట ముద్దులు నటింప
ఆలాపగతిఁ జొక్కి అరమోడ్పు కనుదోయి రతిపారవశ్య విభ్రమముఁ దెలుప,
ప్రౌఢిఁ బలికించు గీత ప్రబంధములకు। కమ్రకరపంకరుహరత్న కటకఝణఝణ ధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప,। నింపుతళుకొత్త వీణ వాయించుచుండె॥

భాష్యకారుఁడగు శిష్యుఁడు కాయలు (వీణాంగములగు కరివెల్లు (బిరడాలు) ఉత్తుంగకుచపాళియందు- అత్తమిల్లుట (ఒరయుట- తాకుట) మాత్రమున విశేషము లేదని, అయభిప్రాయమును- వలుదగుబ్బలు

(వట్రువలయిన స్తనములు) ప్రసేవకవృత్తిన్ వీణకు అంగములుగా నుండుట చేత లేక, సేవకుని వ్యాపారము చేత (నొప్పు) గుబ్బకాయల (బిరడాల) కపరంజి చాయలొసఁగ' అనుదానిచే విశేషింపఁ జేసెను. పెద్దనార్యుఁడు చెప్పిన ఆలాపకతిని, ఆలాపభంగిగా జేసి, ఆయాలాప భంగీరూపము గాగతి– అత్యక్త సంవాది సమస్వరంబులకు గ్రామంబు లునుపనిచో సిద్ధింప నేరదని వివరించెను. "కటక ఝుణ ఝుణ ధ్వని స్ఫూర్తి తాళమానములు గొలుపుట పాణికంకణరుతులు– ప్రాణాను బంధంబుగల తాళీగతి కనుగ్రిహముల నొసఁగుట చేత నే యగునని విపులీకరించి వ్యాఖ్యానించెను. వేఱొకపద్యమున "తరుణాంగుళీరుచుల్ దంతపుసరకట్ల నింగిలీకపువింత రంగులీన" అని చెప్పిన ఆచార్యాభిప్రా యము– "లలితాంగుళీ దళంబులు సమేళములైన సారెలపై రాగసం పదలిడన్" అని సవరించెను. పెద్దనార్యుని పద్యమున సంగీతశాస్త్రీయ విషయము ఉద్దీపనభావముగాఁ జెప్పబడినది కనుక ప్రధానముకాదు. వరూధినీ సౌందర్యలావణ్య విలాసము ప్రధానము.

రామభూషణుని పద్యమున సంగీత శాస్త్రీయ విషయ వివేకమును, తన్మూలకమగు గిరికాసౌందర్యమునుగూడసమ ప్రధానములగుచున్నవి.

పెద్దన పద్యమున విస్తరించిన నితంబములమీఁది ధవళాంశుక ములోని అంగదట్టపు కావిరాగు– ఆవరూధిని కూర్చుండిన శశికాంత (చంద్రకాంత) మణిపీఠికను జాజువారించినది. భూషణుని పద్యమున గిరిక, వలుదగుబ్బలు– ఆ గుబ్బలను ప్రసేవక వృత్తితో (యోగ్యుడగు సేవకుని వ్యాపారముతో) కొలుచుచు, ఆగుబ్బలను పోలియుండినను, కాంతిలేనివిగానున్న ఆ గుబ్బకాయలను (కరివెలను బిరడాలను) కని కరించి తమ బంగారపు కాంతుల నీడలనిచ్చి యాదరించినవి.

పెద్దనగారి వరూధిని స్తనములు– ఉత్తుంగములు (ఎత్తయినవి). భూషణుని గిరిక స్తనములు– వలుదలు (వట్రువలు). పెద్దనగారి వరూ

ధిని వ్రేళ్లు లేత- చిగురుటాకులు. భూషణుని గిరికవ్రేళ్ళు చక్కని చిగురుటాకులు. పెద్దనగారి వరూధిని వ్రేళ్ళు వీణయందు ఆమె జిలిబిలి ముద్దుపాట కనుగుణమగు ధ్వనిని మాత్రమే యిచ్చినది. భూషణుని గిరికవ్రేళ్ళు- మేళరాగములతోఁ గూర్పబడినవియు, కనుకనే తమతోడి చెలిమిగలవియునగు సారెలకు (మెట్లకు-సరకట్లకు) రాగసంపదల నెడి అనురాగ సంపదలనిచ్చినది. మనుచరిత్ర యందలి నాయికయగు వరూధిని- తన రాగాలాపగతికి తానేచొక్కి- (పరవశత నొంది) అర మోడ్పు కనుదోయిచేత, సంభోగసుఖ పారవశ్యమునందలి విలాస మును దెలిపినది. కాని భూషణుని వసుచరిత్రమునందలి నాయికయగు గిరికయొక్క- ఆలాపభంగియే- వినువరానివగుటచేత అసంత్యక్తము లను పేరుగలిగి సమములయి, అమాత్యసంజ్ఞగల సంవాదులగు షడ్జపంచమాది స్వరముల నెడి విడువరాని మంచిమాటలు గలిగి చక్కని కంఠస్వరములుగల వ్యక్తులకు- స్వరసమూహముల నెడి గ్రామముల నిచ్చెను. పెద్దన్నగారి వరూధినియొక్క- కమ్రకర పంకరుహ రత్నకటకముల (చేతికడియముల) ఝుణ ఝుణ ధ్వనిస్ఫూర్తి- తాను పాడుచున్న గీతములకు, ప్రబంధములకు మానము (ప్రమాణము) నిచ్చుచున్నది. కాని భూషణుని గిరిక యొక్క- పాణీకంకణ ధ్వనులు- కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అను, తాళ ప్రాణములతోడి సంబంధము అనెడి ప్రాణమైత్రిగల, తాళగతికి గీతముననుసరించి నడచునట్టి సమగ్రహ ముల నెడి అనుగ్రహముల (ప్రసాదముల) నిచ్చుచున్నది. వరూధిని- ఇంపుతళుకొత్తునట్లు వీణవాయించెనుగాని గిరిక ప్రచురములయిన స్వరములను ఆరోహించుట, అవరోహించుటఅను మూర్ఛనలను విస్త రింపఁ జేయుటఅను తానమును ప్రసారించి, ఆతానము నెడి (అమృతము చేతఁ సంజీవ నౌషధముచేత) అచేతనములను చేతనములుగాను, ఆరో హావరోహణ రూపములగు వినువారిని మోహింపఁ జేయునవియగు

మూర్ఛనలచేత– మూర్ఛనచేత– (పరవశతచేత) వలె చేతనములు– అచేతనములగునట్లును వీణ వాయించున్నది.

వరూధిని – తనయుత్తుంగ కుచపాళి యందు (కరివెలను పేరుగల) కాయలను (బిరడాలను) అత్తమింపఁజేసినది (ఒఱగిపడునట్లొనర్చినది). గిరికయో– అవి – సహజముగనే కదిసియుండు వీణాంగములగుటవలన వాని సేవకు కరుణించి, తన వట్రువ గుబ్బలచేత – వానిని బంగారు రంగు లీనునట్లు చేసినది. ఇట్లుచేయుట – వానికి బంగారపు కానుక లిచ్చుట.

ఇట్లు పలుతావులయందు – రామభూషణుఁడు – గురువును మించిన శిష్యుఁడని అనిపించు కొనినాఁడు.

దీనియందు – వీణావాద్య సంగీతమునకు సంబంధించిన విషయములు – ఆయారాగముల కనుగుణము లగునట్లు స్వరస్థానములను వీణమెట్ల యందు కుదిరిక పఱచుట, వానియందు – రాగసంపదనిడుట, కరకంకణ ధ్వనులచేత – తాళగతికి – సమగ్రహములను సంధించుట, ఆలాపభంగులగు, ఆక్షిప్తిక, ఆయత్తము (ఎత్తుబడి) రాగవర్ధినిమున్నగు వాని నుపయోగించి, అనంత్యాక్తములగు సమస్వరముల నుపయోగించుట, తానము (మూర్ఛనలను విస్తరించుట) మూర్ఛన (ఆరోహావరోహణములు) మున్నగునవి – సందర్భానుగుణముగ ప్రస్తావింపఁబడినవి. వసుచరిత్రవ్యాఖ్యాతలు – కొందఱీవిషయములను సప్రమాణముగ వివరించియే యున్నారు. కనుక పాఠకులు వానిని సమీక్షింపఁ గోరెదను.

> అగతనయ, అగతనయు నిగనిగని మెఱుంగుఁదెగడు నీ కన్నియకున్
> మగని దగునతని గుణ గరి మగనిన్ వినిపింతు వినుము మత్ప్రాణ
> సఖున్. (5 వ ఆ. 23 వ ప.)

మీఁదిపద్యమున, "నిగనిగని...మగని. గరిమగని" అనుచో, అర్థానుగుణమగు స్వరము లుపయోగించుట వలన – ఆ పద్యమున

నాస్వరములను – ఆస్వర స్థానముల యందు పలుకనలయునను నభిప్రాయమే మీ కళానిధికిఁ గలిగియుండునని యూహించుచున్నాను. వ్యాఖ్యాతలీ విషయమును గురించరయిరి.

నాట్యవిషయము– "హరిదంభోరుహలోచనల్" అను పద్యమున (4 వ ఆ. 17 వ ప.) మనోజ్ఞమగు శిల్పమున రచింపఁబడెను. పాఠకులు – చూడఁదగును.

మాధుర్యాది గుణములును, కైశిక్యాది వృత్తులును - ప్రదర్శించుటకు - అసంఖ్యాకములగు నిందలి పద్యము లుదాహరణములుగా నున్నవి. అవియన్నియు సంగీతానుగుణములు. శబ్దాలంకారములు– సంగీతమున కుద్దీపనమును గూర్చునవి.

అవి యీ మహాకవి రచించిన కృతులన్నిఁటి యందును అసంఖ్యాకములుగ నున్నవి. అయినను గొన్నిఁటి నుదాహరించి, అందలి యలంకారములను దెలుపుదును.

"నీవ పరిత్యక్తమై కృప నింపఁగా, ఫ
లింపవె తలంపు లెల్ల నిలింపరమణ" (పంచమ, 26 వ ప.)

రసాద్యనుగుణమును, ప్రకృష్టమును, అగున్యాసము (ఉనికి) గలది – అనుప్రాసము బిందుపూర్వక 'ప' – దీనియందు వర్ణవృత్తిగత మగు అనుప్రాసమగుట చేత వృత్త్యనుప్రాస మగుచున్నది. ఇది– సంగీతమున కనుగుణమై యున్నదిగదా!

"పరబల భంగ చంగముల భంగురతుంగ మతంగ జంబులు"
(ప్రథమ 101 వ ప.)

దీనియందుఁగల బిందుపూర్వక–గ–వర్ణము వీరరసానుగుణమగు వీరరస వ్యంజకమగు సంగీతము నిందు సంఘటించుచున్నది. ఇదియు – వృత్త్యనుప్రాసమునకే యుదాహరణమగును. వర్ణసామ్య మనుప్రాసము.

మీఁది పద్యములు రెంటియందునుగూడ - వాచకగతమగు వర్ణాను
ప్రాసము - మనోరంజక మగుచుండును.

కేళికమనీయ కానన। పాళిక వెలువడి కురంగపాళి కళాబిం
బాళికలు బాళికడిమిన్। బాలికఁదెచ్చిరి విహారభవనంబునకున్.
(తృతీ. 185 వ ప)

పరిశృష్టమగు ఉనికిగలది - ప్రాసము. దీనియందు - కేళిక, పాళిక, బాళిక, బాలిక- అనుచో ద్విప్రాసము - సంగీతము నుద్దీపింపఁ జేయుచున్నది.

"మొనయంగనకా కటకట మొనయంగనకాద్రి ధరుఁడె ముదిత
నుపవనా
తనుపవనాహతి కొంసఁగక। తనుపవనా! మదన! నీయుదంచిత
కరుణన్." (తృతీ. 401 వ ప)

'మొనయంగనకా' 'మొనయంగనకా' అనియు, తనుపవనా, తనుపవనా అనియు దీనియందు అనేక వర్ణములకు రెండేసి పర్యాయము లావృత్తియగుటచేత నిదెయు వృత్త్యనుప్రాసమే యగుచున్నది.

అలసి సొలసి పరివాళశయ్యాతలమున, నలసితాపాంగ మైసేర్చి.
(4 ఆ. 3 వ ప.)

అలసి, సొలసి అనుచోట పదావృత్తి యున్నది. కనుకనిది- పదావృత్త్యనుప్రాస మగుచున్నది. 'అల, సితాపాంగ' అనుచో వర్ణానుప్రాసమే యగుచున్నది.

సీ॥ మునుప లేడాయెనా. . .మనుప లేఁడాయెనా, ... పెనుప లేఁడాయెనా,
ఉనుప లేఁడాయెనా ? ... ... ... ... (4 ఆ. 42 వ ప)
ఇది - పదానుప్రాస యుక్తమగు యమకము.
ఇది - సంగీతమునకు - మిగుల పుష్టినిచ్చు చున్నది.

'జలజల నలరులు రాలెను। కలకలమను శుకపికాళి కలకల మెసఁగెన్'.

(తృ. 178 ప)

ఇచట 'ల' కారము లనుప్రాస మగు చున్నవి కనుక నిది వర్ణరూప వ్యత్యనుప్రాసము. ఇచట – సంగీతమునకు మిగుల నుపయోగము కలుగు చుండును.

"తరుణార్క కబళనోద్ధతిఁ జూపె నెవ్వాఁడు, రుచులచే ఫలమోహ
రుచులచేత,
శయముచే హృత్క శేశయముచేత." (ప్రథమ. 8 వ ప)

మీఁది పద్యమున, శబ్దార్థములు రెంటికి నావృత్తి యున్నను, అర్థభేద ముండుటచేత ఛేకానుప్రాసము.

"ధాత్రీశ్వరులుగాని ధాత్రీశ్వరులుగారు." (ప్రథమ 41 వ ప)

ఇచట, శబ్దారములు రెండును అలంకారము లగుచున్నవి.

"నానామధుప నవ్యగానామృతము మెచ్చి సూనాసవము లెల్లఁ
జూఱవిచ్చె ॥"

"నానా, గానా, సూనా" అనుచో దీర్ఘవర్ణ పూర్వకమగు నవర్ణావృత్తి – సంగీతానుగుణమగు చున్నది.

"నృపవర్ణ భవ సువర్ణ పరాగములు సువర్ణ పరాగములు
నభిన్నత వహించె". (ప్రథమ 149 ప)

మీఁది పద్యమున ఛేకానుప్రాసము—మనోరంజక మగుచున్నది.

నేఁడుగా మాకనిందిత పర్వసామగ్రి నవరించె నీరాకకు వలయేశ!
నేఁడుగా మాతమో నివహంబు లడఁచె నీయాలోక మహిమ
లోకైక మిత్ర! (తృతీ 55 వ ప)

ఇచటి శబ్దార్థ పునరుక్తి - మనోరంజకమయి, సంగీతానుగుణ తను సంఘటించుచున్నది.

ఒకచాయ ననపాయ పికగేయసముదాయ మొకసీమ నానా మ
యూరనినద

మొకవంక నకలంక మకరాంక హయహేష లొక్రకేవ వనదేవ-
యువతి గీతము. (ప్రథమ. 7 వ ప)

మీఁది పద్యమున, అంత్యానుప్రాసము —

శ్రుతిరంజకమగు సంగీతము నప్రయత్నముగ నొదవించు
చున్నది.

తరులర నిక్కఁబూత నెఱతావియ చిక్కనపాంగ మాలికల్
మెఱుఁగులు గ్రిక్కనూరువుల మేలిమిఁ దేటులు చొక్క
హారముల్,

కుఱుచలు ద్రొక్క ముంగురులు క్రొంజెమటన్ బదనెక్క.
(పంచమ 75)

"లలనాజనాపాంగ, వలనాలసదనంగ" అనుపద్యము— చివరను
నాలుగుమాత్రలు చేర్చిన ఖండగతి (చాపు) తాళరూపము నొంది-
సంగీతానుగుణ్యము నొసఁగును.

"మెఱుఁగొప్పు నెఱికొప్పు నెఱగప్పు తఱిఁగప్పు జలదమాలిక
చొప్పుఁ దెలుపలేదొ".

ఇదియు— మీఁదిపద్యమువలె ఖండగతి చాపుతాళమునఁ బాడ
నగును. మీఁది పద్యములు రెండును, అంత్యానుప్రాస విశిష్టములై
సంగీతమున కానుగుణ్యము నొసఁగి పాఠకులను రంజించును.

"తలిఁరు బ్రాయము వాని వలరాజు నలరాజు నలఁరాజు దెగడు
సోయగము వాని"
(తృతీ 46 ప)

మీఁది పద్యమునందలి ఛేకానుప్రాసము- శృంగార రసోద్దీపకమగు
సంగీతమును సహజముగనే వెలార్చుచున్నది.

"మందయానము నేర్పు నిందిందిరాజీవ రాజీవరా జన్మరాళరాజి"
(తృతీ. 28 ప.)

మీఁదిపద్యము- ఛేకానుప్రాసము చేత- శృంగారరసోద్దీపకమగుచున్నది. ఇటువంటి శబ్దాలంకారములు- సంగీతాను కూల్యము నొసఁగి- పాఠకమనోరంజకములగుచు, పెక్కుతావుల నప్రయత్న సిద్ధములై విలసిల్లుచున్నవి. సంగీత సంబంధులగు రాగతాళములను ఆయా పద్యములందు సంఘటించి, వాద్యసమ్మేళనముతో, ఈసంగీత ప్రబంధ సముచ్చయ రూపమగు వసుచరిత్రమును, సమర్థులగు సంగీత సాహిత్య విశారదులు గానము నొనర్చునెడల ఆశారదామూర్తి భవ్యస్వరూపము సభ్యులకు సాక్షాత్కరింపఁ జేయఁబడుననుట నిస్సంశయము.

సంగీత విశేషములకు గనివలెనున్న యీ మహాప్రబంధమున నాకుఁదోచిన కొన్ని సంగీత విశేషముల నీవ్యాసమున సంఘటించితిని.

సంఘటింపవలసిన విషయములు పెక్కులింకను మిగిలియే యున్నవి. అయినను వ్యాసవిస్తర భీతియు, నాయసమర్థతయు, దీనికి కొంతవఱకు హేతువులయినవని విజ్ఞులగు సం సాహిత్య కోవిదులకు విన్నవించుచు నీవ్యాసము నింతటితో విరమించుచున్నాను.

(కొంతకాలమునకు ముందు) ఆంధ్రదేశమున పెక్కుపట్టణముల యందు ప్రదర్శింపఁబడిన భువన విజయ సభలయందు- నే నెప్పుడును, రామరాజభూషణ పాత్రమున నియుక్తుఁడ నగుచుండుటయు, తన్మూలమున రామరాజ భూషణుని సంగీతకళా రహస్య నిధిత్వమును ప్రదర్శించునది యగు వ్యాసభారమును వహించుటయు, నాయదృష్ట విశేషమని భావించుచు శ్రీరామరాజభూషణ సాహిత్య పరిషత్తువారికి నా కృతజ్ఞతాభివందనములను నివేదించుకొనుచున్నాను.

# వసుచరిత్ర యందలి నాటక రీతులు

శ్రీ దివాకర్ల వెంకటావధాని, M. A.

శ్రవ్యకావ్యములందు మనోనయనమాత్ర గోచరములగు పాత్ర దృశ్యాదులు దృశ్యకావ్యములలో నభినయ సందర్భమునఁ జర్మచక్షుర్గోచరము లగుట కవకాశముండుట చేతను, దృశ్యకావ్యములు రసప్రధానములై యధిక మనోరంజన పాటవము కలవై పరిఢవిల్లుట చేతను "కావ్యేషు నాటకం రమ్య'మ్మను నభియుక్తోక్తి యేర్పడినది. ప్రతిభావంతులైన మహాకవులు దృశ్యకావ్యముల వైశిష్ట్యప్రకర్షముల నెఱింగిన వారగుటచేఁ దాము రచించు శ్రవ్యప్రబంధములలోఁ గూడ నందందు దృశ్యకావ్యముల రీతులను వెలయించి వానికి సౌందర్యాతిశయము నాపాదించుచుందురు. తిక్కనాదుల రచనలిందుకుఁ దార్కాణములు. ఆంధ్రవాఙ్మయమునఁ గారణాంతరములచేఁ బందొమ్మిదవ శతాబ్ది మధ్యభాగము వఱకును సలక్షణములైన నాటకములు వెలువడి యుండలేదు. మంచన, పినవీరభద్రాది కవులు సంస్కృత నాటకములపై దృష్టి సారించినను వానిని నాటకములుగాఁ గాక ప్రబంధములు గనే రూపొందించి యుండిరి. ప్రబంధయుగమున వెలసిన మనుచరిత్రాదులను దల్లక్షణములను బరిశీలించి చూచినచో నప్పటి కవులు తమప్రబంధములలో దృశ్య శ్రవ్య కావ్య లక్షణములను జత సేయుటకు యత్నించిరని తెలియవచ్చును. శృంగారరస ప్రాధాన్యము, ధీరోదాత్తనాయకత్వము, పంచపాశ్వాస పరిమితత్వము, ఎడ నెడ సంవాదరూప కథా కథనము మున్నగునవి యీ విషయమును బలపఱుచును. ప్రబంధకవులలో రామరాజభూషణుఁడు విశిష్ట ప్రతిభావ్యుత్పత్తి సంపన్నుఁడగుటయే కాక సర్వసాహిత్య ప్రక్రియా లక్షణ విశేష విజ్ఞాన ధురంధరుఁడు. అందుచే నతఁడు తన వసుచరిత్రలో నందందు దృశ్యకావ్య రీతులనుగూడఁ బ్రదర్శించియున్నాఁడు. కథా

కథనము, సన్నివేశ కల్పనము, పాత్రప్రవేశ సూచనము, నాటక చమత్కార ప్రదర్శనము, సంభాషణ సంవిధాన చాతుర్యము, నాటకాంగ ప్రకటనము మున్నగునవాని యందాతఁడా దృష్టితోఁ గావించిన ప్రయత్నము తేటతెల్ల మగును. ఆప్రయత్నమున నాత డెంత వఱకుఁ గృతకృత్యుఁడయ్యెనో పరిశీలించుటయే యీ వ్యాసము యొక్క యుద్దేశము.

ప్రబంధయుగమున నాటకప్రయోగములుండెనో లేదో-ఉన్నను ఎట్టినాటకము లప్పుడు ప్రదర్శితములగు చుండెనో చెప్పుట కాధారములు లేవు. అల్లసానిపెద్దన్న స్వారోచిపుర ప్రవేశ సందర్భమున, "చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటకశాల మేడపై నిలువున నాడుచుండి" యను పద్యమున నాటకశాల ప్రసంగము తెచ్చెను. దీనినిబట్టి యాతని కాలమున నాటకశాలలుండెనని యూహింపవచ్చును. కాని యందు సంస్కృతనాటకములే ప్రదర్శింపఁ బడుచుండెనో లేక యక్షగానముల వంటి దేశిరూపకములే ప్రదర్శింపఁబడు చుండెనో లేక కేవల నాట్యములు మాత్రము ప్రదర్శితము లగుచుండెనో చెప్పఁజాలము. భట్టుమూర్తి కూడ నాట్యశాలలను వర్ణించెను గాని నాటకశాలల నెచ్చటను వర్ణించి యుండలేదు. అతఁడచ్చ టచ్చట నాటక ప్రయోగమునకు సంబంధించిన పదజాలమును, కార్యకలాపమును మాత్రము వర్ణించి తనకు దానియెడఁగల యభిమానమును బ్రదర్శించెను. వసుచరిత్ర తృతీయాశ్వాసమున మాయాయతి వేషమున నుండిన రాజవయస్యుఁడు గిరికాదులను వీడ్కొని యరుగునపుడు మంజువాణి నెమ్మోముచూచి "తమ్మికంటి యకుంఠిత భువన నిర్మాణ చాతురీ ధురీణుండగు పితామహుండే తాదృశ యోగ్యవస్తు యోజనంబునం బొగడు వడసి యపార పరీవార పారావార భంగంబుల మునుంగఁడు సుమీ యదియునుంగాక తదీయ ఘటనా వైభవా భంగరంగ ప్రసం

గంబునకుం బూర్వరంగంబు రసోత్తరంబగుట యెఱింగితివి గదా, యింక సందియంబువల" దని పల్కియుండెను. ఇందు రంగ పూర్వ రంగముల ప్రసంగముకలదు. రంగమనఁగా నాట్యప్రస్తావము. నాట్య వస్తువునకుఁ బూర్వము రంగవిఘ్నోపశాంతికై కుశీలవు లొనర్చు కార్యకలాపమునకుఁ బూర్వరంగమని పేరు. ఇట్లే భట్టుమూర్తి రెండు మూఁడు సందర్భములందు యవనిక ప్రసక్తికూడఁ దెచ్చినాఁడు. నర్మ సఖుఁడు యతివేషమును విడిచి నిజరూపముతో వచ్చిన పిమ్మటఁ జెలులాతని వృత్తాంతమంతయు గ్రహించిరి. తరువాత చెలికత్తె లొనర్చు మేలములకుఁ గిన్కయుఁ గలంకయుఁ గొంకును నంకురింపఁగా గిరిక "చారు ఘనప్రతతి సీర చెంతకరిగె" ననియు, నప్పుడు రాజు కొప్పు నెఱిగప్పు, తెలిహాలుగనుడాలు, లేనగవుసోన, దేహరుచి పెంపు అను సహజములైన తెరలుండఁగా నామె విశాల యవనికాభ్యంతర మున కరుగనేలయని ప్రశ్నించెననియు భట్టుమూర్తి వర్ణించి యున్నాఁడు. చతుర్థాశ్వాసమున మంజువాణి యంబరోత్పతనమును గూర్చి చెలులకుఁ దెల్పుచు "నిఖిల భూములు జవనిక వాపదారున నెదిరినట్లై తోఁచు నింతులార" యనివర్ణించి యుండెను. ఆకాశయాన మొనరించునప్పుడు నిఖిల భూములును తెర తీయఁగనే తెప్పున నెదిరి పడునట్లుగాఁ గనఁబడునని యిందలి భావము. అట్లేచంద్రోదయమును వర్ణించుచు భట్టుమూర్తి—

హరిదంభోరుహలోచనల్ గగనరంగాభోగ రంగత్తమో
భర నేపథ్యము నొయ్య నొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్.

అను చక్కని పద్యమును రచించెను. దిక్కులనెడి స్త్రీలు నభమనెడి నాట్యరంగమున నొప్పు చీఁకటియను తెరను మెల్ల మెల్లగాఁ దొల

గింప రాత్రి యనెడు నటికి వరుసగా మౌక్తిక పట్టమును, ఫాలభాగ
మును, ముఖమును దోఁచెనేమో యనఁ జంద్రుని యాకృతి రేఖాకారమై
నగమై, పూర్ణబింబమై తూర్పునఁ బ్రకాశించెనని యిందలి యర్థము.
తెరను మెల్లమెల్లగాఁ దొలగించునప్పుడు రంగస్థితయైననటి యానన
మెట్లు క్రమముగాఁ గనిపించునో యిందు వర్ణింపఁబడినది. భట్టు
మూర్తి తాను జూచిన యే వీథి నాటకమందలిదో, నాట్యప్రదర్శన
మందలిదో దృశ్యము నిచ్చట వర్ణించి యుండును.

నాటక ప్రదర్శనమున వేషధారణమునకును పాత్రప్రవేశ
నిష్క్రమణములకును అధికమైన ప్రాధాన్య ముండును. భట్టుమూర్తి
వసుచరిత్ర ద్వితీయ తృతీ యాశ్వాసములందు వీనికిఁ గథలో జోటు
గల్పించి యొక చక్కని నాటక వాతావరణమును సృష్టించినాఁడు.
వసురాజును నర్మసఖులను కోలాహల పర్వతమందలి చంద్రకాంత
శిలా వేదిపై విశ్రమించి యుండ వారికి వీనులవిందగు గానధ్వని వినిపిం
చెను. నర్మసచివుఁ డెవ్వరో వల్లకీరవము సంగతిఁ బాడుచుండిరని
తెలుప వసురాజతనిని వారెవ్వరో, యచ్చటఁ బాడుచుండుటకుఁ గారణ
మేది యో కనుఁగొని రమ్మని పంపెను. నర్మసచివుఁడరిగి ద్రాక్షపంది
ళ్ళతోఁ గూడిన యొకకోన యందలి మణి మందిరమునఁ గొందఱు
వనితలు మెలఁగు చుండిరని యెఱిఁగి, చెట్లు చాటునుండి చూచి
యామందిరమున నొకసుందరాంగి వీణా వాదన ప్రౌఢిచేఁ జెలులరంజించు
చుండెనని గ్రహించెను. పిమ్మట నాతఁడరిగి వసురాజును గూడ నచ్చ
టికిఁ గొనివచ్చెను. వసురాజచ్చటి 'ప్రాచేన పుంజాలుం దీవలచాటున'
నిల్చి గిరికనుజూచి యామె శరీర సౌకుమార్యమును వర్ణించి పరవశుఁ
డయ్యెను. నర్మసచివుఁ డంత నాతని పారవశ్యమును గాంచి జపి వేష
మున నేగి యామె జన్మప్రకారము తేటతెల్లముగాఁ దెలిసికొని వచ్చెద
నని పల్కి రాజందు కంగీకరించెను. అప్పుడు నర్మసచివుఁ డచ్చటి లతా

పుష్ప పరాగ శాఖాపల్లవ వల్కల జాలక ఫలరస కుంజల్కములతో జటాభూతి దండ ధాతుశాటీ యోగపట్ట జపమాలాపాత్రాంబు పూర పరాంజీబంధములను సంతరించుకొని సురతరువుల మహిమచే జడదారి యయ్యెను. అతఁడు జపమాలత్రిప్పుచు మణిమందిరము చేరనరుగు చుండ నచట గిరిక వీణావాద్యమును వినుచుండిన యొక చెలికత్తె సఖులతో 'గంధగజయాన గీత ప్రబంధ కలన నలరి యతి లియ్యెడ వచ్చు నరిదె మగువలార! కనుగొంటిరే" యని పలికెను. ఇందుఁ జక్కని పాత్ర ప్రవేశ సూచన యున్నది. "గిరికాదేవి గీత ప్రబంధ రచనయందు గణాది విశ్రమాక్షర రూపమైన యతి రమ్యముగాఁ గలసివచ్చు చున్నది. 'మీరు పరిశీలించి తిరా' యని యామె భావము ఆ వాక్యమునకు "గిరిక పాడుచుండిన గీత ప్రబంధమున కలరి యతి దానితోనే కలసి వచ్చుచున్నాఁడు. పరికించితిరా" యను నర్థాంతరము కూడ నున్నది. నర్మ సచివుఁడాయర్థాంతరము నాలంబము జేసికొని "మేలు లతాంగి" నీపలుకు మెచ్చితినే యతి వచ్చుజాడ యేనెఱింగి తమ్మా" యని పలుకుచు వారున్న యెడ కరుదెంచెను. సఖి సంగీత పర ముగాఁ బల్కిన వాక్యమును మాయాయతి నిజాగమన పరముగా నన్వయించుకొని ప్రవేశించుట ముద్రారాక్షస నాటకములోని ప్రస్తా వన యందలి చాణక్యపాత్ర ప్రవేశమును స్మరణకుఁ దెచ్చుచున్నది. ఇట్టి పాత్ర ప్రవేశమునకు కథోద్ఘాత మనిపేరు.

మంజువాణి గిరికాజనన వృత్తాంతమును దెల్పిన పిమ్మట నర్మ సఖుఁడు కొంతసేపాత్మధ్యాన విజ్ఞాన ముద్రాయత్తంబున నున్నట్లలరి, "ఈభామ భావి భాగ్యోదయము నాంతరదృష్టిఁ జూచితిమి ఈమెను వసుమహారాజు పెండ్లి యాడు" నని పల్కెను. అంత మంజువాణి యించుక సందియమందుచు" ఆరాజిచ్చటి కెప్పుడు వచ్చును? వచ్చి మాచెలి నెప్పుడు చూచును? చూచి యామెను తగురీతి గారవించి

మా కోరిక లెప్పుడీడేర్చు" నని యడిగెను. అంత మాయ యతి "ఈమెను వసురాజు తప్పక పెండ్లి యాడును. నీవిది నమ్మనిచో నతని నిప్పుడే నామంత్రి మహిమచే నిచ్చటికి రప్పింతు" నని పలికి మాయా జపాకలనాడంభము పూని దెసలాకర్ణించి 'మజ్ఝా'యని పల్కెను. ఇదం తయుఁ దీగల చాటుననుండి వినుచున్న వసుమహారా "జిదె సంధింపఁగ వేళయంచు" "నీరంధ్ర నీరద వారప్రతిసీర వెల్లడిన తారాభర్తలీ లన్ లతాచ్ఛద సంఛాదికఁ బాసి" యెదుటనిల్చెను. ఇచ్చట మాయా యతి మజ్ఝాయని పల్కిన వెంటనే లతావరణమును విడిచి వసు మహా రాజచ్చట ప్రత్యక్షమగుట నాటకోచితముగా నున్నది.

గిరికా వసువుల ప్రథమ సమాగమమైన పిమ్మట నర్మసచివుఁడు గిరిక కమూల్య కల్యాణ కౌతుక సమృద్ధి కావలయునని దీవించి, మణి మందిరము వెడలి చని, యచ్చటి మందార తరువుల పొదలలో యతి వేషమును విడిచి, యథాపూర్వ వేషమున మిత్రుఁడైన వసురాజును వెదకు విధమున నచ్చటికివచ్చి నిలఁబడెను. చెలు లారాజవయస్యుని పలుకుబడియు, ముఖవైఖరియుఁ గాంచి యాతఁడే యతిరూపమున వచ్చిన [illegible]ఁడని గ్రహించి యతని వాక్చమత్కారమును పలువిధ ముల భావించిరి. కోలాహల పర్వతమునకు విహారార్థమై వచ్చిన వసు రాజు గిరికా దర్శనాసక్తిచే నాతనిముందుగాఁ బంపియుండెనని వారు గ్రహించిరి. నర్మసచివుని యతివేషధారణమువలెఁ దద్వేషవర్జనమును నాటక ప్రయోగావసరము నందలి నటుల వేషధారణ వర్జనములను దలపించుచు రమ్యముగా నున్నది.

నర్మసచివుఁడు తన సహజరూపముతో వచ్చిన పిమ్మటఁ జెలి కత్తె లన్యాపదేశముగ గిరికను మేలమాడఁ దొడంగిరి. అంతనామె సిగ్గుచే నచ్చటనున్న తెరవెనుకకుఁ బోయి నిలఁబడెను. అప్పుడామె "వినికల కాకు ఘోష మొదవించు మదాళిని బక్షు గౌరవం బెనయు

వదల్చి మంజుగతి నీవనజాతములో మదీయ ఖేలనములకెల్లఁదోడయి మెలంగఁగ నా కలహంసి రాదొకో" యని తలపోయుచుండెను. అంతలో నాకలహంసి వచ్చి తాపసానీకము దీవెనలతో నొసంగిన, పూలనిచ్చుటకై తల్లి గిరికను రమ్మనెనను వార్త తెల్పెను. గిరికయు నచ్చటనుండి యామెతో వెడలుటకు యత్నించెను. రంగము మీఁద నున్నవారు భావలసిన వ్యక్తిని గూర్చి తలపోయుచుండఁగా నా వ్యక్తి ప్రవేశించుట పెక్కునాటకములలోఁ గనవచ్చుచుండును. ఇచ్చట కలహంసీ పాత్ర ప్రవేశము సరిగా నట్టి పాత్ర ప్రవేశమునకు నిదర్శనమై నాటకీయముగాఁ నున్నది.

గిరిక మదనతప్తయై నొగులుచుండ మంజువాణి యామెయుత్తల పాటు తెల్పి వసురాజు చిత్తమరసివత్తుననిపల్కి యామె హారమును గొని వసురాజు రాజధాని కరిగెను. గిరిక బాధకోర్వఁజాలక మన్మథ చంద్రమలయ పవనుల నుపాలంభించి "తుహినకర కిరణ ఝరిన్" మనుఁగ వలెనని యరుగుచుండఁ జెలులామె నడ్డగించిరి. అంతనామె యత్యంత శోక సంతప్తయై యెల్గెత్తి యేడువఁ దొడఁగెను. అప్పుడు చెలికత్తెలామె నోదార్చి "అయో మనమంజువాణియుంజని తడవయ్యె నేమిటికి జాగొనరించెనొకో" యని భావించుచుండ వసురాజ దత్త పద్మరాగ ముద్రాంగుళీయ రంజితహస్తయై మంజువాణి యచ్చటికి వచ్చెను. ఇచ్చటి మంజువాణి ప్రవేశముకూడఁ బైని పేర్కొనఁబడిన కలహంసి ప్రవేశము వలెనే నాటకోచితమై యింపునింపుచున్నది.

మంజువాణి తాను జెలులనువీడి వసురాజు రాజధాని కరిగి చూచివచ్చిన వృత్తాంతమునంతను వారి కెఱింగించెను. ఆమె వసురాజు కేళీసదనమున కరిగి యచ్చట మాయాబల తిరోహితాంగియై నిదుర తమి నుండియు వాసనాబలమున నుడిగంపుఁ జదురులు పూను పరి చారికలను గాంచెను. తరువాత మాధవీ హేమలతలను నిర్వారు

కాంతల సంభాషణము వలన వసురాజా జా[illegible]విహారమున కరిగిన నాఁటి నుండియు నిద్రాసౌఖ్యమును మాని విరహ బాధనొందు చుండె నని యెఱింగెను. అనంతరమామె చలువలు చిందు ముత్తియపుఁ జప్పర మంచముపైఁ బరుండి చిత్రపటము వీక్షించుచుండిన వసురాజును గాంచెను. పిమ్మట నామె వసురాజు హృదయము గిరికానురాగ ఝర మగ్నమో, ప్రియాంతర స్పృహా ఘనరసపోష రూపితమో కనుఁగొన వలెనని "గంధతైల భాజన భవన ప్రదీపికల చాటునఁ" బొంచి యుండెను. రాజు చిత్రపటము వీక్షించుచు గిరిక నుపాలంభించుచుండ మంజువాణి యాతనిఁ బల్కరించి యతనికి గిరిక యునికిఁ దెల్పి యానం దము కలిగింప నెంచి "మంచ సమంచిత యంత్ర [illegible]కా మండలీ లోన నొక్క మణిమండిత పుత్రికయై" పకపక నవ్వి యింతులు పరతంత్రలనియు, వారు తమకుఁ దామే కాంతుల వరింపనుండుట నేరము కాదనియు, వారిని మదను బారికి నగ్గముచేసి కనికరింపని మగవారే యపరాధులనియుఁ బలికెను. వసురాజా మాటలు విని సుర కిన్నర చారణ నాగకన్యకలలో నొకర్తెయో, గిరికా వయస్య యైన వనదేవతయో యామెస్థితి తన కెఱింగించుటకై యచ్చటికి వచ్చి యుండునని యెంచి తన మూలమున గిరిక కడుంగడు డస్సెగదా యని వగచుచు శయ్యాపరిఘూర్ణ మందొఱఁగెను. అప్పుడు మంజువాణి రాజు చెంత కేగి తన చేతనున్న గిరిక హారమును వసురాజు కంఠ పీఠ మున నుంచెను. రాజు దానిరాక కబ్బుర మొంది స్పర్శచేఁ దాపము తగ్గుటచేనది గిరిక హారమే యని భావించి దానిని బహుభంగులఁ బ్రశంసించి యెదురుగానున్న రత్నపుత్రిని గాంచి "ప్రియాహారముఁ దెచ్చి నాకపరిమితోపకారము నొనరించిన యోదాక్షిణ్యశాలినీ! నీ కీప్రతిమారూపదేశమెందుకే సమ్ముఖమందు పల్కరాదటే" యని హెచ్చరించెను. అప్పుడు మంజువాణి 'రఘునందనుని సన్నిధిఁ బ్రభూత చైతన్యయై నిల్చునట్టు పౌలఁతి కరణిరత్నపు బొమ్మగతిమాని ధృతి

పూని క్షితిజానికి జోహారుచేసి నిల్చెను. ఈ సందర్భమున మంజువాణి యొకసారి తిరోహితాంగి యగుటయు, నింకొకసారి గంధర్వైల భూషిత ప్రదీపికల చాటునఁ బొంచి యుండుటయు, నింకొకసారి మణిపుత్రికఁ యగుటయుఁ జివరికా మణిపుత్రికా రూపమును వీడి మంజువాణీ రూపమున రాజు ముందు నిల్చుటయు నాటకోచితములై యామె ధరించిన యా యా రూపములతో పాటాదృశ్యమునంతను మనకు సాక్షాత్కరింపఁ జేయుచున్నవి.

భట్టుమూర్తి వసుచరిత్ర యందలి కొన్ని ఘట్టములను పాత్రలను సంస్కృతమునందలి శాకుంతలాది నాటకములను దృష్టి యందుంచుకొని రచించినట్లు కనిపించును. శృంగారరస ప్రధానములైన సంస్కృత నాటకములందు విదూషక పాత్రమునకుఁ బ్రాధాన్య మతిమాత్రముగా గోచరించును. నాయికా నాయకులకు సమాగమము చేకూర్చుటలో విదూషకు లెక్కువగాఁ దోడ్పడు చుందురు. భట్టుమూర్తి సృజించిన నర్మసచివుఁడు సరిగా సంస్కృత నాటకములందలి విదూషకుని వంటివాఁడే. అతఁడు వసురాజు నభీష్టము ననుసరించి మాయామాని వేషము ధరించి గిరికను ఆమె చెలికత్తెలనుగాంచి చమత్కార సంభాషణాపూర్వకముగా వసురాజును మణిమందిరమునకు రప్పించెను. ఈసందర్భమున విదూషకుఁడు కల్పించిన నాయికా నాయక సమాగమ సన్నివేశము నాటకోచితమై మనోహరముగా నున్నది.

శాకుంతలమున శకుంతలయు, ననసూయా ప్రియంవదలును లతావృక్షములకు నీరుపోయు చుండఁగా దుష్యంతుఁడు లతలచాటున నుండి వారిని గాంచి వారి సంభాషణ మాలించుటయుఁ దరువాత రాజడుగఁగాఁ జెలికత్తె (అనసూయ) శకుంతల జన్మవృత్తాంత మెఱిఁగించుటయు, తృతీయాంకమున గౌతమి శరీరతాపము సంగతి యడుగుటకు వచ్చి శకుంతలను దీసికొని పోవుటయు రమ్యముగా వర్ణింపఁబడినవి.

భట్టుమూర్తియు సరిగా నట్టులే రాజులతా సంఛాదికనుండి గిరికను ఆమె సఖులను గాంచుటయు, మంజువాణి గిరికాజన్మవృత్తాంతము నెఱింగించుటయుఁ, జెలులు మేలమాడుచుండఁగా కలహాంసి వచ్చి గిరికను దోడ్కొని పోవుటయుఁ జక్కఁగా వర్ణించి యుండెను. మఱియు మంజువాణి అంబరోత్పతన మొనరించినప్పటి వర్ణనమును, గిరిక యత్తవారి యింటికేగునప్పుడు తల్లిదండ్రులు కావించిన బోధనలును శాకుంతల నాటకమునందలి కణ్వుని యుపదేశములను బోలి యున్నవి.

కథా సంవిధానమునఁ గూడ భట్టుమూర్తి కొంత నూత్న మార్గము ననుసరించి రామణీయకమును గల్పించినాఁడు. నిజమునకు వసుచరిత్రయందలి కథ గిరికా జన్మవృత్తాంతముతో నారంభించి యుండవలసినది. కాని భట్టుమూర్తి యాక్రమము సర్వసాధారణముగ నుండునను నుద్దేశముతో నావృత్తాంతమును ద్వితీయ తృతీయాశ్వాసము లందు మంజువాణిచేఁ జెప్పించి చివర... ఆనగజాత యీ తరుణి యౌవన దేవత లీనయుఁ స్యలు...కుంజరయాన విహారరంగముల్” అను పద్యముతో నాటకోచితముగా ముగించినాఁడు. అట్లే మంజువాణి అంబర యానమున వసురాజు రాజధాని కరిగిన వృత్తాంతమును భట్టుమూర్తి తానె వర్ణింపక ఆమె తిరిగి వచ్చిన పిమ్మట నామెచేఁ జెలులకుఁ జెప్పించినాఁడు. వసుచరిత్ర యందలి కథాభాగము స్వల్పమే యైనను భట్టుమూర్తి యాస్వల్పమందే యనల్పమైన శిల్పగరిమ ప్రదర్శించినాఁడు.

వసుచరిత్ర తృతీయాశ్వాసమున మన్మథపూజా సందర్భమున్నది గిరికయు నామె చెలులను బుష్పాపచయ జలక్రీడ లుపచరించిన పిమ్మట మన్మథపూజ కావించిరి. వారొకపూసెజ్జపై నొకకుశేశయ కర్ణికనుంచి, యందుఁగస్తూరితో మన్మథుని భావముఁ వ్రాసి, అతని

ద్వారామాంకమున రతిని, మోల్లెఁ జంద్రవసంతులను, గేవల గంధపవన కోకిల మరాళకీర సారంగములను లిఖించి షోడశోపచార పూర్వక ముగా నతని సంస్తుతించిరి. అంతఁ గొంతసేపటికి మలయమారుతములు విసరెను. పూవులు జలజలరాలెను. శుకపికాళుల కలకల రవము లెసఁగెను. వెంటనే మన్మథుఁ డగ్రతలంబునవచ్చి నిల్చినట్లుకాఁగా గిరిక వడఁకి, ధృతిదూలి, మూర్ఛిల్లి నేల వ్రాలెను. అప్పుడు చెలులు కింకర్తవ్యతా మూఢలై వివిధ శీతలోపచారములొనర్చి "నెలఁతకీ వసులాభంబునించు" మని మన్మథుని మరలఁ బ్రార్థించిరి. అందలి వసునామాక్షరము లాలించి గిరిక కన్నుఁగల్వలు విప్పెను. చెలులు మన్మథుఁడు సన్నిధి యొనర్చెననియు, శుకోక్తిగల సేమము తెల్పెన నియుఁ, దప్పక యభీష్టసిద్ధి కలిగించుననియు నోదార్చి యామెను విహారభవనమునకుఁ గొనిపోయిరి. ఈసందర్భమునఁ జెలులు పరివార సమేతుఁడైన మన్మథుని వ్రాసి పూజించుటయు, రమాకుమారుఁడగ్ర తలంబున నిల్చినట్లు కాఁగా గిరిక కంపితగాత్రియై భూమి నొఱఁగు టయు రంగస్థలమునందువోలెఁ బఠితలకు సాక్షాత్కరించి వారికి నాటక దర్శన జనితానంద ప్రాప్తి నొదవించు చున్నది.

వసుచరిత్ర వర్ణన ప్రధానమైన ప్రబంధ మగుటచే నందుఁ బ్రౌఢములైన దీర్ఘ వర్ణనలు పెక్కుండుట సత్యమే. వానితోపా టం డెడనెడ రమ్యములైన సంభాషణలు కూడనున్నవి. ద్వితీయాశ్వాస మందలి రాజనర్మ సచివులయు, మంజువాణీ నర్మసచివులయు, శుక్తి మతీ కోలాహలులయు సంభాషణలును, తృతీయాశ్వాసమందలి యింద్రవసు రాజులయు, రాజగిరికా సఖులయు, మంజువాణి నర్మసచివు లయు సంభాషణలును, చతుర్థాశ్వాస మందలి మంజువాణీ వసురా జుల సంభాషణమును, పంచమాశ్వాసమందలి వాసవ వసురాజుల సంభాషణమును నిందుకుఁ దార్కాణములు. "ఏమే హేమలతా

యటంచుఁ బనియేమే మాధవీయంచు" నిత్యాదిగాఁగల చతుర్థాశ్వాసము నందలి పద్యము (IV-76) సంభాషణమయమై నాటకములందలి ప్రవేశకమువలె మంజువాణికి వసురాజారామవిహారార్థమై యరిగి నప్పటినుండియు నిద్రాసౌఖ్యము మాని విరహబాధనందు చున్నాఁడను విషయమును దెల్పుచున్నది. నాటకములకు రమ్యములైన సంవాదములు ప్రాణముల వంటివి. పైని పేర్కొనఁబడిన సంభాషణాలు ప్రౌఢములయ్యు సహజములును సరసములునై వసుచరిత్ర ప్రబంధమున నెడ నెడ నాటక వాతావరణమును గల్పించుచున్నవి.

నాటకములందుఁ గవు లచ్చటచ్చట భావికథా సూచనలు కావించు చుందురు. ఆ సూచనలు భావికాలమున యథార్థములైనప్పుడు సహృదయుల కమందమైన యానందము నాపాదించు చుండును. భట్టుమూర్తి కూడ వసుచరిత్రమున మూఁడు నాల్గుచోట్ల భావికథాంశ సూచనము కావించి యున్నాఁడు. ప్రథమాశ్వాసాంతమున వసురాజుద్యానవనమునందలి లతావృక్ష సంతతులను దిలకించుచుండ" నన్నగాగ్రమున నున్న యొకానొక కిన్నర ద్వయం బన్నిఖిలోక్తి వేదికపు డన్యదురాసదమైన యొక్క యాసన్న శుభంబుఁ దిన్నని ప్రసన్న నిజోక్తులఁ దెల్పి కోలాహల పర్వత శిఖరమున కెగిరిపోయెను. లోకాద్భుతమైన యా విహగయుగమును జూచుటవలన వసురాజునకు కోలాహల విహారోత్కంఠ చెంగవించెను. అదియే గిరికా సమాగమాదికమైన అనంతరకథ కాధార మయ్యెను. ఇచ్చటఁ గిన్నర యుగ్మము సూచించిన అన్యదురాసదమైన శుభము వసురాజు గిరికా పాణిగ్రహణము కావించుటయే' నర్మసచివుఁడు గిరికా సఖులతోఁ దన వృత్తాంతమును దెల్పుచు "నిమ్మహానగము పజ్జనే యా నవపద్మినీ మనోహరుఁడు వెలుంగ నాయన కుపాయన మిచ్చుటఁ గూర్చు వాఁడనై యరయుదు పద్మిని సముదయంబని వచ్చితి" నని పల్కి యుండెను.

ఇందు నర్మసచివునకు మిత్రుఁడైన వసురాజునకు పద్మినీజాతికిఁ జెందిన గిరిక నర్పించు తలంపు గలదను విషయము సూచింపఁబడు చున్నది. తృతీయాశ్వాసమున గిరిక లజ్జాప్రేరితయై చారుఘన ప్రతిసీర చెంత కరిగిన సందర్భమున భట్టుమూర్తి "అభినవాలోక నోత్కంఠ నధిపుఁ డలర, నలరుఁబోఁడి సమగ్ర లజ్జానుభావ భావయై తెరమాటునఁ బగటు చూపఁ జూపెఁ దోఁచెఁ బరిణయస్ఫూర్తి యనుఁగు" నను పద్యము వ్రాసెను. ఇది ముందు జరుగఁబోవు గిరికా వసురాజుల పరిణయ వృత్తాంతమును సూచించుచున్నది. "తొలుదొలత (ii-61) ఇత్యాది పద్యముకూడ నిట్టిదే. భావి కథా సూచనాత్మకములైన యిట్టి సందర్భములుకూడ వసుచరిత్రయందు నాటక రామణీయకస్ఫూర్తిని గలిగించు చున్నవి.

శ్రవ్యకావ్యములందుఁ బాత్రి లోంతోరులతో సంభాషణ కావించుచుఁ దదనుగుణముగా నంగవిన్యాస పూర్వకమైన యభి నయముకూడఁ గావించు చుందురు. మాటలతో పాటే యభినయము కూడ సహృదయుల యర్థావగాహమునకుఁ బెక్కువిధముల దోడ్పడు చుండును. శ్రవ్య కావ్య మందుఁగూడ దృశ్యకావ్యోచితమైన ఇట్టియభి నయమును వర్ణించుటయందు తిక్కన సోమయాజి మేటియని విమర్శ కులు చెప్పుచుందురు. భట్టుమూర్తికూడఁ బెక్కుచోట్లఁ బాత్రిలు చెప్పు మాటలతో పాటు వారొనరించు నాంగికాది వికారములను సైతము వర్ణించి దృశ్యకావ్యచ్ఛాయలు వెలయించినాఁడు. "ఇంతి యును నంతనంతంత నెదిగి పొదలు నిబ్బరపు గబ్బిగుబ్బల యుబ్బుకతన నోరగాఁ బాణికంజంబులూఁది మ్రొక్కె-మక్కువ సఖీమణులుఁ దాను మాని మణికి" (ii-85) "అన వినిగట్టు రాకొమరుఁ డానన గహ్వార రోచమాన నూతన తరదంత హీర రుచిధారలు వెల్వడ నొక్కలేఁత నవ్వునగి . . . యన్నదిఁ బల్కు వెండియున్" (ii-125) "నావినిగట్టు

తేఁడు వదనంబున విన్నదనంబుతోఁప ... అనన్" (ii-134) "పకపక-నవ్వి యో వసునృపాలక" (iv-89) "అక్కోమలిఁ జేఁబిల్చి తలఁగ్రుచ్చి కవుంగిటఁ జేర్చి భూధర గ్రామణి పల్కె" (vi-54 "ఆ తనయుం గని కల్లోలిని తనయుంగ నితాంతయుక్తిఁ దార్చుచుఁ బలికెన్" (vi-59) "నవలా నవలావణ్యార్ణవ లాలిత కాంతిరమకు నయనద్యుతులన్నవ నీరాజన మొసఁగుచు నవనీ రాజగ్రణ్యుఁ డనియెఁ బ్రేమన్" (vi-93) మున్నగు పద్యము లిందుకు నిదర్శనములు. వీని యందారా పాత్రలు మాటలాడుటకు ముందు చేసిన పనులుకూడ వర్ణింపఁబడి యున్నవి.

ఒక్కొక్కప్పుడు రంగమునం దిరువురు పాత్రులేదో యొక విషయమునుగూర్చి సంభాషించుచుందురు. అందొక పాత్ర చెప్పు మాటల యందలి యర్థము రెండవ పాత్రకొక విధముగను, దాని పూర్వసందర్భ మెఱింగిన సామాజికుల కొక విధముగను అవగత మగుచుండును. ఇట్టిచోట్లఁ గల్గు చమత్కారమును పాశ్చాత్యులు "Dramatic irony" అందురు. వసుచరిత్రమున నిట్టి చమత్కారముతోఁ గూడిన సన్నివేశములు నాలుగైదు కలవు. నర్మసచివుఁడు గిరికా సఖులతో నిజవృత్తాంతము చెప్పు సందర్భ మందలి యన్నిపద్యములందును ఇట్టి చమత్కారము స్ఫురించును. (ii-91-95). ఇందలి శ్లేష సామర్థ్యమున నతఁడు చెప్పుమాటలలో వినువంగనలకతఁడు సూర్యభక్తుఁడనియుఁ జదువరులకు వసురాజ మిత్రుఁడనియు నర్థము తోఁచుచుండును. వసురాజు తమ యెదుట సాక్షాత్కరింపఁగనే గిరిక సఖులాతనిఁ దగిన విధమున సత్కరించిరి. పిమ్మట మంజువాణి "ఈ సింధుతనయ మహనీయ గుణశ్రీ నుతికి నెక్కె నేఁడీ మాని దయామందరాగ మహిమము కలిమిన్" అని పలికెను. అప్పుడు వసురాజు "ముదితా విదితా తనుమంత్ర జాలు నిమ్మునిఁ గొనియాడ శక్యమె సముజ్జ్వల రూపకలాపమైన ఖా

యనుఁగు వయస్యఁ గాంచు సుకృతాతిశయం బవలీలఁ గూర్చె నీ
యనఘుఁ డితండు మాకుఁ బరమాప్తుఁడుగాక మునీంద్ర మాత్రుఁడే"
యని మునిని ప్రశంసించెను. చెలికత్తెల కాపల్కులు "ఇతఁడు కేవల
మునీంద్రుఁడు కాఁడు నాకు మహోపకారము చేసిన పరమాప్తుఁడు"
అను నర్థమగును. చదువరులకు "ఇతఁడు మునికాదు, మాకు పరమ
మిత్రుఁడు" అను నర్థమగును. ఇట్లే చతుర్థాశ్వాసమున మంజువాణి
మణిపుత్రికయై పల్కిన పల్కు లాలించి వసురాజు "చారణకన్యయో,
ఖచర సారస గంధియొ కాక కిన్నరాంభోరుహ పాణియో, చిలువ
పోల్తుకయో, మఱి శైలకన్యకా ధీరవయస్యయైన వనదేవతయోయొక
మంజువాణి యేతెరగబోలు బాలగతిఁ దెల్పఁగ నిచ్చటి కద్భుతంబుగా"
నని భావించెను. ఇచ్చట మంజువాణి యనఁగా మంజుల వాక్కుగల స్త్రీ
యని యర్థము. అది స్త్రీ సామాన్య వాచకము. కాని యాతని
యెదుట నున్నది నిజముగా గిరిక చెలికత్తెయైన మంజువాణి యని చదు
వరు లెఱుంగుదురు. వసురాజది యెఱుంగఁడు. కవి యిచ్చట మంజు
వాణి పదమును ప్రయోగించుట సరసమై యత్యంత చమత్కారమును
గల్పించుచున్నది. ఇట్టి చమత్కారముతోఁ గూడిన సన్నివేశములు
శ్రవ్యకావ్యమునందు సైతము దృశ్యకావ్యస్ఫూర్తిని గల్గింపజాలును.

నాటకములు నాందీ పద్యముతో నారంభించి భరత వాక్య
ముతో ముగియుచుండును. నాందీ పద్యము ఆశీర్నమస్క్రియలతోఁ
గాని వస్తునిర్దేశముతోఁగాని కూడియుండవలెననియు, నది యర్థముచే
గాని శబ్దముచేఁగాని కథాంశమును సూచింపవలెననియు, నందెనిమిది
గాని, పండ్రెండుగాని, పదునెనిమిదిగాని, యిరువది రెండుగాని పదము
లుండవలెననియు, నది చంద్రనామాంకితమై యుండవలెననియు నియ
మము గలదు. భరత వాక్యముకూడ సర్వలోక మంగళా కాంక్షియై
యాశీర్వాద రూపమున నుండును. వసుచరిత్ర యందలి మొదటి పద్య

మాశీర్వాద రూపమున నున్నది. "మంజీరాగ్ర రత్నము నందలి ప్రతి ఫలమువలన శుక్తిమతీ కోలాహలుల కలయిక వలనఁగలిగిన గిరికా జనన ప్రకారమును, సన్నికల్లు త్రొక్కించుటఁ దెలుపు శుభక్రమాకలనవలన వసురాజు కోలాహలుని గోటితో మీటుటయు సువ్యక్తములగుచున్నవి. ఇదియే కావ్యార్థ సూచన మనఁబడును" అని వ్యాఖ్యాత సూచించి నాఁడు. భటుమూర్తి శ్రీరామ పదారవింద భజనానందుఁడు. అందుచే శ్రీరాముఁడు తిరుమలేంద్ర శ్రీ మహారాయనిఁ బ్రోచుఁగాత యని యాశీర్వదించినాఁడు. మంజువాణి రత్నపుత్రీ రూపమును విడిచి నిజ రూపమును గాంచి నప్పుడతఁడు "రఘునందనుని సన్నిధిఁ బ్రభూత చైతన్యయై నిల్చుచట్టు పొలఁతి కరణి రత్నపు బొమ్మగతి మాని ధృతి పూని క్షితిజాసకి జోహారుచేసి నిలిచె"నని వ్రాసియున్నాఁడు. సీతా రాముల వివాహమును వర్ణించు నీ పద్యము గిరికా వసువుల వివాహ మంగళమును గూడ సూచించుచున్నది. వసుచరిత్ర చివరఁగల "ఆరాజు విమలవిఖ్యాతి చంద్రిక నిచ్చరహి కెక్క జాఱెజార ప్రసంగము ... ప్రజలు గాంచిరి భూరివైభవ సమృద్ధి" యను సీసము వసు మహారాజు పాలన మందలి ప్రజల వైభవమును వర్ణించుచు భరత వాక్యమును బోలి యున్నది.

నాటకములు రసప్రధానములు. అందు శృంగార వీరములలో నొక రసము ప్రధానమై యుండవలయును. అందలి నాయకుఁడు ధీరోదాత్తుఁడు, వస్తువు ప్రఖ్యాతమునై యుండవలయును. అందైదునుండి పదివఱకు నంకము లుండవచ్చును. వచుచరిత్రమున శృంగార రస మంగిరసము. అందలి నాయకుఁడైన వసురాజు ధీరోదాత్తుఁడు. ఇతి వృత్తము మహాభారతమునుండి గ్రహింపఁబడినను వర్ణనాదులచేఁ జాల పెంపుచేయఁబడుటచే మిశ్రము. అందాఱాశ్వాసము లున్నవి. భట్టుమూర్తి లాక్షణిక శిరోమణి యగుటచే విభావానుభావ సాత్త్విక

వ్యభిచారి భావముల నుచితరీతి వర్ణించి యిందు శృంగార రసమును జక్కగా బోషించినాఁడు. "అనుపమ కాంతివైభవ సమన్వితునా వసురాజుఁ గాంచు పద్మిని సరసాంత రంగమున" అను పద్యము నందతడు తనకుఁగల రసపోషణ తత్పరతను, లక్షణ పరిజ్ఞానమును లెస్సగాఁ బ్రదర్శించినాఁడు. ఈ విధముగా నతఁడు ప్రతిభావంతుఁడును, పాండితీ పయోధియు నగుటచే శ్రవ్యకావ్యమునఁగూడ నందందు నాటక రీతు లచ్చుపడఁజేసి వసుచరిత్రకపూర్వ సౌందర్యము నాపాదింపఁ జాలినాఁడు. కథాకథనమందును, నాటకాంగ ప్రదర్శనమందును, పూర్వరంగ యవనికాది ప్రయోగమందును, అభినయ వేషధారణ వర్ణనము లందును అతఁ డావిషయమునఁ గావించిన ప్రయత్నము స్పష్టముగా గోచరించుచున్నది.

# వసుచరిత్ర - ప్రశంసావేశము

శ్రీ M. R. అప్పారావు

ఆంధ్ర సారస్వతం - మహాకవులు అన్నప్పుడు 10, 12 పేర్లు వెంటనే మనం చెప్పగలం. నన్నయభట్టు మొదలుకొని, ఈ వేయి సంవత్సరాలలోనూ 10, 12 మంది మహాకవులు శిఖరప్రాయులై, హిమాలయపర్వత శిఖరాలలాగ మనకు కనబడతారు. ఒక్కొక్క మహాకవి, ఒక్కొక్క విశిష్టమైన కవితా మార్గానికి ప్రవర్తకుడై, ఆంధ్రసారస్వతాన్ని చిత్రవిచిత్రములైన రంగులతో విద్యుద్దీపాలు అలంకరించిన నృత్యవేదికగా తీర్చి, సరస్వతీపూజ చేశారు. ఏ దీపానికి ఆదీపమే ఒకప్రత్యేకత, ఒక ఆకర్షణ, ఒక సౌందర్యం, ఒకవిచిత్రకాంతి - అంతేకాదు ఒక్క వేయిసంవత్సరాల కాలపరిమితిలో వెంట వెంటనే సమస్కంధులైన, పరమ ప్రతిభామూర్తులైన మహాకవులు ఉద్భవించడంకూడా మన ఆంధ్రసాహిత్యానికి ఉన్న ప్రత్యేకతయేమో అనిపిస్తుంది.

ఆంధ్ర సారస్వతం నన్నయ భట్టారకుని భారతావతరణంతో ఆరంభమైనదంటారు. అంతకు ముందుకూడా గేయం రూపంలోనూ, తదితర రూపాల్లోనూ కొంత వాఙ్మయం ఉండిఉంటుంది. ఏమయినా మనకు లభించిన తొలి తెలుగు మహాకావ్యం నన్నయ భట్టారకుని భారతం అనటంలో పెద్ద విప్రతిపత్తి ఉండదనుకొంటాను. ఆంధ్ర మహాభారతం పూర్తి కావడానికి ఇంచుమించుగా 300 సంవత్సరాలు పట్టింది. ఈ మూడువందల సంవత్సరాల్లోను ఒక్క మహాభారతమే కాదు, రామాయణాలు, శైవగ్రంథాలు, కొన్ని శాస్త్రగ్రంథాలు తెలుగులో వెలిశాయి. ప్రధానంగా పురాణేతిహాసాల అనువాదాలతో ఆంధ్ర సారస్వతం కొంతకాలం వర్ధిల్లింది. తరువాత శ్రీనాధుడు

వచ్చి, ఆంధ్ర సారస్వతరథాన్ని నూత్నమార్గాలకు మళ్ళించాడు. కావ్యానువాదాలు ఆరంభాలైనాయి. కవిత్వంలో క్రొత్త రీతులు వెలిశాయి. అటుపిమ్మట శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఆంధ్ర సారస్వతం స్వర్ణయుగాన్ని చూచింది. ఈ యుగాన్ని ప్రబంధయుగం అని కూడా అంటారు.

ప్రబంధ ప్రక్రియ అనేది ఆంధ్ర సారస్వతానికి, కాదు భారతీయ సారస్వతాల్లో ఒక వినూత్నమయిన అలంకారం. ప్రబంధకవులు ఆంధ్ర సరస్వతికి ఎన్ని అపూర్వాలంకారాలు సంతరించారో చెప్పలేం. అల్లసాని పెద్దన, శ్రీకృష్ణదేవరాయలు, ముక్కుతిమ్మన్న, ధూర్జటి మొదలైన మహాకవులు ఈ ప్రబంధయుగంలో ధ్రువతారలు. వీరితో సమానమైన ప్రతిభాసంపద, విశిష్టత కలవాడు మన రామరాజ భూషణుడు. ఈతడు రచించిన వసుచరిత్ర - అపూర్వమైన ఒక విచిత్ర సృష్టి, 'ఆంధ్ర పంచకావ్యాలు' అనిపించుకొన్న వాటిలో వసుచరిత్ర ఒకటి. ఇది తమిళ, సంస్కృత భాషలలోనికి అనువదింపబడుట దీని విశిష్టతకు తార్కాణము. అంతేకాదు, వసుచరిత్రకు అనుకరణముగా వెలసిన 'పిల్ల వసుచరిత్రలు' కూడ వసుచరిత్ర విశిష్టతను చాటుచున్నవి. రామరాజ భూషణుడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఉండే అష్టదిగ్గజాలలో ఒకడని సాధారణంగా చెబుతుంటారు. చరిత్రకారులు మాత్రం ఈ విషయంలో సందేహం వెలిబుచ్చుతున్నారు. పెద్దన మొదలైనవారికి ఈతడు సమకాలికుడైనా, సమవయస్కుడై ఉండడనీ, వారికంటె వయస్సులో చాలా చిన్నవాడై ఉంటాడని వీరంటారు. రామరాజ భూషణుడు తన 'వసుచరిత్ర' కృతిని రాయల అల్లుడైన అళియరామరాయల తమ్ముడు తిరుమలరాయలకు అంకితం చేశాడు. వసుచరిత్ర చాల పరిపక్వమైన ప్రబంధం కాబట్టి, అది రచించే కాలానికి రామరాజ భూషణునకు 50, 60 ఏళ్లు ఉంటాయనుకుంటే

అతడు శ్రీకృష్ణదేవరాయల కవితా వినోదాలకాలంలో బాగా యువకుడై ఉంటాడనీ, అంత చిన్నవయస్సులో ఉన్నవాడు అష్ట దిగ్గజాలలో ఒకడై సత్కారాలు పొందటం సంభావ్యం కాదనీ చరిత్ర కారులు నిర్ణయిస్తున్నారు. రామరాజభూషణుడు అష్టదిగ్గజాలలో ఒకడు కాకపోయినా, శ్రీకృష్ణదేవరాయలనాడు కావ్యనిర్మాణం తాను చేసి ఉండకపోయినా, రాయల సభావిశేషాలన్నీ కండ్లారా చూచినవాడని మనం అంగీకరించటంలో సందేహం అక్కరలేదు. రాయలవారి 'భువనవిజయం' లో జరిగే కవితాగోష్ఠీవైభవం, ఆ రసిక ప్రభువు నిండుకొలువులో మహాకవి పాదానికి 'గండపెండేరం' తొడగ టం మొదలైన సంఘటనలన్నీ రామరాజభూషణునిలో చెరగని ముద్రిలు వేసి ఉంటాయనటంలో కూడా సందేహం అక్కరలేదు.

శ్రీకృష్ణదేవరాయల వారిచేత కాకపోయినా అళియరామ రాయలచేత రామరాజభూషణుడు అనేక సత్కారములు పొందాడు. అంతేకాదు కవితా విషయంలో పెద్దన్నగారితో సమానుడనిపించు కొన్నాడు. మనుచరిత్రితో పాటు వసుచరిత్ర పండితుల్ని ఎంతగానో ఆకర్షించింది. మనుచరిత్రికంటె వసుచరిత్రయే గొప్పదని వాదించే పండితులున్నారు.

నరసభూపాలీయం అనే అలంకార శాస్త్రగ్రంథం, హరిశ్చంద్ర నలోపాఖ్యానం అనే ద్వ్యర్థికావ్యం - ఈరెండూ కూడా రామరాజ భూషణుడు రచించినవే. ఇవికూడ ఆంధ్రిసారస్వతంలో విశిష్టస్థానం సంపాదించుకొన్న ప్రిఖ్యాత రచనలు. వీటి రచయిత 'భట్టుమూర్తి' అని ఉండటంచేతనూ, ఎక్కడా రామరాజభూషణుడు అనే పేరు కని పించక పోవడం వల్లనూ ఈగ్రంథాల కర్తృత్వం విషయంలో వాదోప వాదాలు జరిగాయి. ఫలితంగా ఈమూడురచనలూ రామరాజ

భూషణునివే అని పలువురు విమర్శకులు అంగీకరించు తున్నారు. రామరాజభూషణుని కులమును గూర్చి కూడ అనేక విమర్శలుకలవు. సహృదయులైన రసజ్ఞులకు కవి కులముతో పని లేదని నా విశ్వాసము:- రామరాజభూషణుని విశిష్టత రెండు విధాలయింది — ఒకటి ఆయన శ్లేషరచనా సామర్థ్యం. ఇంత సుకుమార రమణీయమైన పద్ధతిలో శ్లేష వ్రాయడం మహాద్భుతమైన విషయం అని పండితులంటారు. రెండవది ఆయనకున్న సంగీతకళా మర్మజ్ఞత. తాను "సంగీతకళా రహస్యనిధి" అని ఆయన స్వయంగా తనకావ్యంలో చెప్పుకొన్నాడు. ఈయన సంగీతకళా వైదగ్ధ్యానికి తార్కాణంగా మనవారు ఒక విషయం చెబు తుంటారు — రామరాజభూషణుడు వేదాధ్యయన పరులైన బ్రాహ్మ ణులున్న వీధిని వెడుతుంటే ఆయన ఆవీధిని దాటి వెళ్ళేవరకు ఆ పండి తులు వేదపఠనం ఆపివేశేవారట — ఆతడు తమ స్వరంలో ఎక్కడ తప్పులు పట్టుతాడో అన్న భయంచేత. 'రాధామాధవకవి' అనే వారు వసుచరిత్రలోని పద్యాలన్నీ వీణమీద పలికించి వినిపిస్తూండే వారు; ఎంతో హృదయాకర్షకంగా ఉండేది. సంగీతకళా రహస్యాలు తెలిసినవారు వసుచరిత్రను బాగామథించి, అందలివిశేషాలను లోకానికి తెలియబరచి, గ్రంథస్థంచేస్తే బాగుంటుందని భావిస్తున్నాను. కవి స్వయంగా చెప్పుకొన్న విషయం కాబట్టి వసుచరిత్రకు సంగీతపరంగా విశేషవ్యాఖ్య వ్రాయటంలో దోసగు ఉండదు; లేనిపోని విశేషాలు ఆపాదించి, కవిని ఆకాశానికి ఎత్తుతున్నాం అనే నిందకు కూడా అవ కాశం ఉండదు.

వసుచరిత్రలో ఉండే కవితా గౌరవం, ప్రౌఢి, ఆకావ్యం యొక్క విశిష్టత మొదలైనవన్నీ మీకు నేను మచ్చునకు ఒకటి రెండు విశే షాలు మనవిచేస్తాను.

వసుచరిత్రలో నాయిక అయిన గిరికయొక్క విరహవేదనను వర్ణిస్తూ రామరాజభూషణుడు ఒక పద్యం వ్రాశాడు.

చ॥ అఱిమి, రమాకుమారుఁ డపు, డగ్రతలంబునవచ్చి, నిల్చిన న్న
ట్లఱుముటేఁ దోఁచినం, గువలయాక్షివడంకి, కడంకఁదూలి మై
మఱచి, సగంధగంధగిరి మారుతపాతిత వల్లి కాభయై,
యొఱగిన, సంభ్రమించి, చెలులుద్గత బాష్పతరంగితాక్షులై.
(3 వ ఆశ్వా – 179 ప.)

ఉద్యానవనంలో నాయిక వసురాజును గూర్చి విరహపడు తున్నది. ఆ ఉద్యానవనంలోని ప్రతివస్తువు ఆమెకు విరహాన్ని హెచ్చించేవేకాని ఉపశమింప జేసేవి కానేకావు. ఊరట పొందుదా మని ఆ అమ్మాయికురాలు ఈ ఉద్యానవనంలోకి వచ్చింది. ఉద్యానవన శోభను తిలకించిన కొద్దీ ఆమెకు విరహం భరింపరానిదై పోతూంది. ఉండగా ఉండగా ఇంతవరకు తన్ను కనిపించకుండా పీడిస్తున్న మన్మ థుడు ఒక్కసారిగా ఆమెకు ఎదురుగా వచ్చి నిలిచినట్లయింది. దానితో ఆమె మూర్ఛపోయిందట! ఈపద్యంలో మన్మథునకు 'రమాకుమార' అన్న శబ్దాన్ని వాడినాడు రామరాజభూషణుడు. పద్యంలోని గొప్ప తనమంతా ఈశబ్దంలో ఉంది; చూడండి.

| | | |
|---|---|---|
| రమాకుమార | — | అంటే మన్మథుడు |
| మాకుమార | — | అంటే మన్మథుడు |
| కుమార | — | అంటే మన్మథుడు |
| మార | — | అంటే మన్మథుడు |

పదంతీసి పదంవేస్తే మన్మథుడు అన్నమాట! పోనీ వెనక్కు తిరిగి పోదామా అంటే వెనక్కుతిరిగినా మన్మథుడే. అంటే ఆశబ్దాన్ని వెనక్కుతిప్పి చదవండి – 'రమాకుమార' అన్నది వెనక్కుతిప్పి చదివినా 'రమాకుమార' అనే అవుతుంది. ఇందులో ఒక్కొక్క అక్షరం వదలిపెట్టినా, మిగులున్న ప్రతిపదమూ మన్మథుడే అవుతు న్నాడు! ఈ 'రమాకుమారుడు' ఎంతనిర్దయగా చుట్టుముట్టి వేధిస్తు

న్నా [illegible] చూడండి ఆ అబలను! ఇంక మూర్ఛపోక ఏం చేయగలదో చెప్పండి ఆమె? - ఈ రమాకుమారుని ధాటికి ఈశ్వరుడంతటి వాడే తట్టుకోలేక పోయినాడయ్యె. ఒక్క శబ్దంతో ఎంత చమత్కారం చేశాడో చూడండి!! ఇట్టి ఉదాహరణలు వసుచరిత్రలో కోకొల్లలు.

మనకు సంగీతశాస్త్ర పరిజ్ఞానం ఉన్నా లేకపోయినా రామరాజ భూషణుని పద్యాలు చదువుతూంటే ఏదో వీణాగానం వింటున్నట్లుగా ఉంటుంది మనకు. ఇంత సమ్మోహనకరణమైన గీతిగుణంగల పద్య రచన వేరొకచోట లేదేమో అనిపిస్తుంటుంది. ఒక ఉదాహరణం-

[illegible]లనా జనాపాంగ, వలనా వసదనంగ,
తులనాభికాభంగదోః ప్రసంగ
మలసా నిలవిలోలదళ, నాసనరసాల
ఫల, సాదరశుకాల పనవిశాల
మలినీ గరుదనీక, మలినీ కృతధునీ, క
మలినీ సుఖిత, కోక కులవధూక
మతికాంత, సలతాంత, లతికాంతర, నితాంత,
రతికాంతరణ, తాంత, సుతనుకాంత

మకృత కామోద, కురవకావికలవకుల
ముకుల, సకల వనాంత ప్రమోద చలిత
కలిత కలకంఠ కులకంఠ కాకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు.

(1 వ ఆశ్వా. 125 ప.)

సహృదయులకు ఈ పద్యంలోని సుకుమారత అనుభవైకవేద్యం. [illegible]రాజ భూషణుని పద్యాలలో నూటికి తొంభై పద్యాలు మానవ కంఠనాళాలనుండి వెలువడితే నలిగిపోయేటంత పరమ సుకుమారముగా

ఉంటాయి. వీణాతంత్రులనుండి, నాదమయములై వెలువడి [illegible] మీద మధుర స్పందనాలు కలిగించేటట్లుగానే అవి అనుభవింప[illegible] వేమో! అయితే ఇది కావ్యం కాబట్టి, శబ్దార్థాలూ, భావనా[illegible]మధుర లయినవి తప్పవుమరి. కాగా సంగీత సాహిత్యాలు సరస్వతీ వక్షోజ ద్వయం అన్న పెద్దల మాటను ఇంతగా సార్థక పరచిన మహాకవి రామరాజ భూషణునకు నా జోహార్లు అర్పిస్తున్నాను. నాకీ సదవకాశం కలిగించిన శ్రీ రామరాజ భూషణ సాహిత్య పరిషత్తువారికి నా కృతజ్ఞతలు తెల్పుకొంటున్నాను.